# శుభోదయము

[ చారిత్రాత్మక నవల ]


రచన:

'సాహిత్యరత్న', 'హిందీవిద్వాన్' 'తెలుగు విద్వాన్'.

**యన్. యస్. వి. సోమయాజులు**


*


వెల: 2-8-0

# ఆముఖము

ఇది చరిత్రాత్మక నవల. మహారాష్ట్ర చరిత్రకు సంబంధించిన దిందలి యితివృత్తము. మహారాష్ట్ర రాజ్య స్థాపకుఁడైన శివాజీ మహారాష్ట్రులకేగాక ప్రతి మానవునకును పూజనీయుఁడు. మహారాష్ట్ర రాజ్య స్థాపనము శివాజీ చరిత్రలో ప్రధాన ఘట్టముకాదు. స్వధర్మ రక్షణ, పరమత సహనము, స్త్రీ జాతియెడ దాక్షిణ్యము ముఖ్యములు.

ఇందలి శివాజీ ఛత్రపతికాడు. ఇతఁడు పదునెనిమిదేండ్ల యువకుఁడు. యవనుల యత్యాచారములచే పీడింపబడుచున్న తన ధర్మమును రక్షించి స్వారాజ్యమును స్థాపింపవలెనను మహా త్వాకాంక్షతో తల్లిదండ్రుల నెదిరించి తానెన్నఁడుఁ జూచి యెరుఁగని గురూజీ యాదేశము ననుసరించి మహమ్మదీయ ప్రభుత్వమునకు ప్రతిద్వంద్వియై ప్రథమ విజయముఁ గొనిన వీరయువకుడు.

ఈ నవలయందు యథా సంభవముగ శివాజీ యావిర్భావ కాలమునాఁటి సాంఘిక రాజ నైతిక పరిస్థితులు చూపఁబడినవి. మహమ్మదీయుల స్వైరవిహారము కొలదిగ నచ్చటచ్చట చూపఁబడినవి. వానినిబట్టి తత్కాలీన పరిస్థితులను పాఠకు లూహించుకొనఁగలరు.

దేవ, మానవ, దానవ పాత్ర లిందుఁగలవు. మా దృష్టిలో రామదాసస్వామియొక్కఁడే దేవత. శివాజీ రణదుల్లా మున్నగువారు మానవులు. సయ్యదుల్లా, అహమ్మదులు రాక్షసపాత్రలకు ప్రతీకములు. స్త్రీ పాత్రలందు హమీదా ప్రేమకు విలువకట్టు భారము పాఠకులది. ఇఁక మిగిలినది రాముఁడు. అతని చరిత్రను చదివిన పాఠకులే యాతని యుజ్వలమైన భవిష్యత్తును నిర్ణయించుకొందురు. అందువల ననే చివఱకు నాతనిని వదలివేసితిమి.

చరిత్ర చిత్రణము, భాష, శైలి మున్నగు విషయముల గూర్చి నేఁ జెప్పుకొనుట యుక్తముకాదు గాన నా విషయము రసజ్ఞులకే వదలితిమి.

ఈ నా ప్రథమ ప్రయత్నమును సహృదయులు తమ విమర్శనలకు గురిఁజేసి ప్రోత్సహింతురని యాశించుచున్నాను.

—రచయిత



౧

అది పూనా పరిసరారణ్య ప్రదేశము. అయ్యది యర్ధరాత్రిసమయము. నలుదిక్కులను చీకటులలముకొని యున్నవి. మధ్యమధ్య మెఱవులు మెఱయుచు చీకటుల హరింప ప్రబల ప్రయత్న మొనరించి విఫలమై తమ యస్తిత్వము నా తమమునందే విలీనమొనరించుకొనుచున్నవి. అది మహారణ్య ప్రదేశమగుట నలుగెలంకుల నిస్తబ్ధత యావరించినది. ఆ గాఢాంధకారముకీ నిస్సబ్ధతతోడై నాస్తికునిసైత మాస్తికునిగ నొనర్ప సమర్థమై యుండెను. నిస్సబ్ధ నిబిడాంధకారమునకు తోడు గగనతలమంతయు ఘనఘనావృతమై యుండెను. అట్టి ప్రదేశమున నాసమయమున మానవునియందు జనించు భయమును మా పాఠకు లూహించుకొనగలరు. అప్పటికి కొలది ఘడియలక్రితమే కుంభవృష్టికురిసి వెలిసినది. మధ్యమధ్య చెట్లయాకులపై నిలచి గాలికి రాలుచున్న వర్షబిందువుల ధ్వని మాత్రమా నిస్తబ్ధతను భంగమొనర్చుచుండెను. ఇంతను

దేవేంద్రుని ఘనసైన్యమునకు తామొనర్చిన ఘనకార్యమునకు తృప్తిలేక కాబోలును ఫెళఫెళార్భటులతో వికటాట్టహాసము లొనరించు చున్నవి.

అట్టి భయంకర కాళరాత్రి యందొక యరణ్యమున నొక యశ్వారోహియగు సైనికుడు వేగముగ పయనించు చుండెను. అప్పటి కాతని మేనిపైగల వస్త్రములన్నియు తడిసి శరీరమున కంటుకొనియున్నవి. మనకాచీకటి యందాతని మోము కన్పించకపోయినను అతని చలనముల వలన నాతని తొందరపాటును గుర్తింపగలము. మాటిమాటికిని వెనుదిరిగి చూచుచుండుటచే నెవరో యాతనిని వెన్నంటి వచ్చుచున్నా రనియు మన మూహింపవచ్చును. అశ్వమును తనయజమాని మనోగతాభిప్రాయము నెఱింగినది గాబోలును తన శక్తివంచన లేక పరుగిడుచుండెను. అరణ్యమంతయు గాఢాంధకార సంకు లమై యుండుటచే మార్గ మగుపించుటలేదు. మధ్యమధ్య మన యశ్వారూఢుడైన సైనికుని కుపకార మొనర్చుటకు విద్యుల్లతలు మెఱయుచున్నను కండ్లు మిరిమిట్లు గొల్పుటచే పాప మాతని కుపకారమునకు బదులు అపకారమే జరుగు చుండెను. ఏమైనను ఆతని యశ్వచాలనమును దిలకించినంతనే యాత డీయరణ్య ప్రదేశములకు సుపరిచితుడని చూపరులకు దోపకపోదు.

అతడట్లే కొంతదవ్వు పయనము సాగించెను. ఇంత వఱకును ఘనీభూతములై యున్న జలధరము లొక్కుమ్మడి వర్షింపసాగెను. మనయాశ్వికుడు కొంతతడవు విశ్రమింపగోరి

వర్ష బాధనుండి రక్షించుకొనుటకై యొక భూరుహము నాశ్ర యించెను. గుఱ్ఱమును ఒకసారి శరీరమును విదలించి బడలికను దీర్చుకొనుచుండెను. మన సైనికుడు విశ్రమింపగోరి యా వృక్షచ్ఛాయనాగెనేగాని యాతని మానసమున మాత్రము గడచిన మూడునాలుగు దినములనుండియు నాతఁడొనర్చిన కార్యముల సింహావలోకనము జరుగుచుండెను. అతని మానస మున నేవేవో యూహాలు వొడముచుండెను—"భగవానుడా! నీవే నన్ను నడిపించుచున్నావు. నే నొనర్చిన కార్యములందు నా యస్తిత్వమేమియును లేదు. నీవే కర్తవు. నేను నిమిత్త మాత్రుడను. నీవు నా కొసంగిన ప్రేరణయే నన్ను ముందునకు గొంపోవుచున్నది. భరతమాతను దాస్యశృంఖలలనుండి దప్పింప యత్నించు నను బోలు యువకులకు నీవే యుండవు. ఈ మూడునాలుగు దినములనుండియు నే ననేకమంది తురక లను హింసించుటలో నా పరాక్రమ మేమియులేదు. అంతయు నీ మహిమయే ! నీ కృపాకటాక్ష వీక్షణములు ప్రసరించు చున్నచో కొలదిదినములలో నీ పవిత్ర భారతావనియం దిక గోబ్రాహ్మణ హిందూమత హంతకులైన యీ కరకుతురకలు జీవించియుండుట కల్ల. ఏమైనను తురకల పారద్రోలి భారతా వనికి స్వేచ్ఛా స్వాతంత్ర్యముల నొడగూర్చినగాని మాబోటి యువకులకు నిదుర రాదు" అని యేమేమొ యనుకొనుచు వర్షము కొంచె మాగుటవలన గాబోలును మఱల నశ్వరాజము నధిరోహించి—"అరే చిత్తల్ ! నడువుము ! నీవే నా ప్రాణ స్నేహితుడవు. నాకై ప్రాణములనైతము సరకుగొనక అష్ట

కష్టముల పాలగువాడు నీవు దక్క నాకింకెవ్వరు గలరు ? పద ! శత్రువుల కందకూడదు సుమా !" యనుచుండగనే యజమాని భావమును గ్రహించినదానివలె నా యశ్వము తలపై కెత్తి సగర్వముగ కళ్ళెమును నమలుచు పయనము సాగించెను.

కొంచెము దూరమేగిన పిమ్మట మన సైనికుడు వెనుదిరిగి చూచెను. అతని కా యంధకారమున రెండుమూడు కాగడాలు ముందునకు పరుగిడి వచ్చుచున్నట్లు తోచెను. వాటినిజూచి యాతఁ డశ్వ వేగమును మరింత హెచ్చించెను. కాని కొలది నిమేషములలో నాతనియందు గలిగిన భావ పరివర్తనమేమోగాని యశ్వవేగమును తగ్గించెను. బహుశః ఆ వెన్నంటి వచ్చుచున్న వారినిగూడ వారి స్నేహితులవద్దకు బంప నెంచెనేమో !

వెనుక నుండి తన్ను వెన్నంటి నలుగు రశ్వారూఢులు వచ్చుట నాతఁడు స్పష్టముగ దిలకించెను. వారి శరీరములపై గల వస్త్రములు గూడ వర్షమునకు తడిసిపోయినవి. వారు ధరించిన వస్త్రములకును మనకు పరిచితుఁడైన సైనికుఁడు ధరించిన వస్త్రములకును చాల వ్యత్యాసమున్నది. మన సైనికుని వస్త్రధారణా వైఖరి యాతఁడు మహారాష్ట్రుఁడని వ్యక్తము జేయుచున్నది. వెనుకనున్న సైనికుల వస్త్రధారణయే గాక విశుద్ధమైన ఉర్దూ భాషలో జరుగుచున్న వారి సంభాషణవలన వారు మహమ్మదీయ సైనికులని గ్రహించవచ్చును — 'ఈ కాఫర్‌ను పట్టి చంపువఱకు మనము నిదుర

పోరాదు. మనలో ముగ్గురి ప్రాణముల హరించి పారిపోవు చున్న యీ సైతానును మనము విడువరాదు' అని వార లను కొను మాటలు మన సైనికుని వీనులఁ బడెను. అంతనాతఁడు వారి కెదురేగి వారిని యుద్ధమునకాహ్వానింపనెంచెను. ఒంటరిగ తన్ను వెంబడించుచున్న తురకల నవలీలగ జంపి వారి స్నేహి తుల వద్ద కంప నెంచెను. ఇంతలో వెనుకనున్న ముసల్మాను సైనికులు మన మహారాష్ట్రవీరుని జూచి—"అడుగో! కాఫర్! వెంబడించుడు! వెంబడించుడు!" అనుకొనుచు తమ వేగమును హెచ్చించిరి. ఈ మాటలను వినినది గాబోలును 'చిత్తల్'. తన యజమాని మనోగతాభిప్రాయమును సైతము సరకు గొనక పరుగిడజొచ్చెను. ఆ నిశీథమున 'చిత్తల్' తనకుగాని, తన యజమానికిగాని యెట్టి ప్రాణాపాయమును కలుగకుండ శరవేగమున దూకిపోవుచుండెను. వెనుక తురకల గుఱ్ఱములు వెంబడించుచునే యుండెను. వాటియందు స్వాతంత్ర్యేచ్ఛ పొడచూపినది గాబోలును తమ యిష్టము వచ్చినట్లు పరుగిడు చుండెనేగాని తమ యజమానుల యాజ్ఞను సరకుగొనుట లేదు. అంత నొక చెట్టుకొమ్మ తగిలి యొక తురక సైనికుడు- 'యాఖుదా' యనుచు నేల వ్రాలెను. మేము 'చిత్తల్' వెంట నుండుటచే మిగిలిన ముగ్గురు సైనికులేమైరో తెలియదు.

మన చిత్తల్ మాత్రము చాలదవ్వేగి తన యజమాని కిక నపాయము లేదని గ్రహించి యాగిపోయెను. అంత మన సైనికుఁడు క్రిందకు దిగి కళ్ళెపుత్రాడు పట్టుకొని విశ్రమార్థ మెచటనైన సురక్షిత ప్రదేశము కాన్పించునేమోయని వెదకు

చుండెను. చివర కాతని కొక జీర్ణ దేవాలయము కానిపించెను. అతఁడు మెల్లగ దేవాలయ ప్రాంగణమున నొక చెట్టునకు గుఱ్ఱమును కట్టివేసి యాలయమున ప్రవేశించెను. ఆలయము నకు ముందటి భాగమున గల గూండ్లయందు గల రెండు ప్రమిదెలందు మాత్రము దీపము వెలుగుచుండెను. అందలి తైలము హరించిపోవుటచే తమ నిష్క్రమణమును సూచించు టకోయన నా దీపకళికలు పొగను వదలుచుండెను. మన సైని కుఁడు మెల్లగ లోనికేగి చూచెను. అది యాంజనేయాలయము. సంజీవనిఁ గొనివచ్చుచున్న వీరాంజనేయుని భంగిమలో నున్న విగ్రహమచటి క్షీణ దీపకాంతి యందు పొడగట్టుచుండెను,

“ఇది యాంజనేయాలయమగుటచే నిచటికి హిందువులు వచ్చుచు పోవుచుందురు. ఇంతటి యర్ధరాత్రమున నిచటి దీప కళికలు పరిసరమందెవరో నివసించుచున్నారని తోపజేయు చున్నవి. ఈ నిశీథమందు సైత మెవ్వరైన నీ యాలయ మున నున్నారేమో చూచెదగాక, యనుకొనుచు నాతఁడచటి ప్రమిదె నొకదానిఁ గొనినలువైపుల కలయజూచెను; కాని యందెవ్వరును కాన్పించలేదు. అంత నాతఁడు బడలియున్న కారణమున విశ్రమించుటకై యచటనే నేలపై మేనువాల్చెను.

అతఁడచట పరుండి విశ్రమింపదలచెనేగాని యాతనికి నిద్రపట్టలేదు. అతని మనస్సు పరిపరి విధముల నాలోచించు చుండెను — “ఆహా! నా జన్మభూమి కెట్టి యిక్కట్టులు సంభవించినవి! ఈ కలికి తురకల చేతఁబడి నా తల్లి యెన్ని యిడుమలగుడుచుచున్నది! అయ్యో! పవిత్రమైన హిందూధర్మ

విూముష్కరుల చేతఁబడి నాశనమైపోవుచున్నదే! మార్గ మధ్యమున హిందువుల కండ్లయెదుట గోబ్రాహ్మణ హత్యలా! నిదుర లేచినది మొదలు అడుగడుగునకు నవమానితులై బ్రతుకుచున్న యీ మానవులు నిజముగ జీవించియే యుండిరా? ఇన్ని యిడుమల గుడుచుచున్నను మహమ్మదీయుల కొలువు మానరేమి? మహమ్మదీయుల గొలుచుటయే ధర్మమట! అదియే వారికి గౌరవమట! అదియే రాజభక్తియట! ఆహా! ఏమి యీ ముదుసలుల మనోప్రవృత్తి! మహమ్మదీయులను వధించి వారిని దేశమునుండి వెడలగొట్టుటకై యత్నించు నాబోటి యువకులు దేశద్రోహులట! ఏమి వీరి వాదన! ఈ దేశము తురకల యబ్బ సొమ్మా? వారి కీదేశము ననుభవింపుడని శాశ్వత దానపత్రమును వ్రాసి యిచ్చితిమా? ఏమైనను సరే, యీ కిరాతులను రాజ్యచ్యుతుల నొనర్చిన గాని నా జన్మభూమికిని, నా ధర్మమునకును, శాంతి భద్రతలు లేవు. దాస్యభావముతో జీర్ణించి పోయిన యీ పెద్దలనువీడి దేశమందలి యువకులందరును దేశస్వాతంత్ర్య సముపార్జనకు బద్ధకంకణులై యిల్లు వదలిపెట్టి వచ్చిన నెంత బాగుండును?" అని యేమేమో చింతించుచుండెను.

ఇంతలో నాతని కెవరో మాట్లాడుచున్నట్లు వినిపించెను. ఆ ధ్వని యెటనుండి వచ్చుచున్నదో యాతనికి తెలియలేదు. నలుగెలంకులను పరిశీలించెను. కాని చుట్టుపట్ల నెవ్వరును కాన్పించలేదు. అందుచే నాతఁడు మగిడివచ్చి మేనువాల్చెను. మరల నాతని కేవో మాటలు వినవచ్చెను. శబ్దములు స్పష్ట

ముగ వినఁబడకున్నను మాటలధ్వని మాత్రము వినబడు చుండెను. ఆతఁడాశబ్దములధ్వని యెటనుండి వచ్చుచుండెనో గుర్తించజాలక పోయెను. కాని భూగర్భమున నెవ్వరైన మాట్లాడుచున్నారేమోనని యాతడనుమానించెను. అంత నాతఁడు దేవాలయమున భూగృహము లెచటనైన నున్న వేమోనని పరిసరములన్నియు వెదకెను. అతని కెచటను సొరంగములున్న లక్షణములు కన్పించలేదు. అతఁడిది తన మానసిక భ్రాంతియై యుండనోపునని భావించి మఱల పరుండెను. కొలదిసేపటికి మఱల నేవో శబ్దములు వినవచ్చెను. అతఁడు నేలపై చెవియానించి విన మొదలిడెను. మాటలు స్పష్టముగ వినిపించుటలేదుగాని మాట్లాడునట్టి ధ్వనిమాత్రము వినవచ్చుచుండెను. అదే ధ్యానముననున్న తనకట్లు భ్రాంతి కలుగుచున్నదేమోనని యెంచి యాతఁడటనుండి కదలక యాంజనేయుని వీక్షించుచుండెను.

ఏమి యీ యాశ్చర్యము! ఆంజనేయుని విగ్రహము కదలుచున్నట్లుండెను. మన సైనికునకిది వింతగొల్పెను గాని యాతని నేత్రము లద్దానిని విశ్వసించలేదు. అతఁడు కండ్లు నలుపుకొని మఱల చూడ మొదలిడెను. నిజముగనే విగ్రహము కొలదికొలదిగ ముందునకు జరిగి వచ్చుచుండెను. వెంటనే యాతఁ డావిగ్రహముక్రింద తప్పక భూగృహముండి యుండునని యెంచి రక్షణకై కత్తినిచేతబట్టి లేచినిలువబడెను. ఆ సమయమున నాతని యాశ్చర్యమునకు మేరలేదు. అతఁడు విగ్రహము వెనుక కేగిచూచెను. నిజముగనే పెద్ద సొరంగ

ముండెను. అతని మనమున ననేకభావము లుదయించు చుండెను. "ఇందున్నది హిందువులా లేక తురకలా? ప్రాణ రక్షణార్ధ మిటనుండి తప్పుకొనుటయా లేక ధైర్యముతో నీ రహస్యమును భేదించుటయా?" యని కొంతవడి యాలోచించి—"నేను మహారాష్ట్ర వీరుఁడను. మహారాష్ట్రునకు భయమేమి? ఈ రహస్యమును భేదించియే తీరవలె" నని సంకల్పించు కొని "జై వీరహనుమాన్" అనుచు నా సొరంగమున ప్రవేశించెను.



౨

మన మహారాష్ట్రవీరుని భాగ్యగృహమున నేవదలి మనము మరియొకచోటున కేగవలసియున్నది. అతని నాస్థితిలో వదలి పోవుటకు మా పాఠకులంగీకరింపరని మేమెఱుంగుదుము. కాని యావీరునకును, మన మేగబోవు ప్రదేశమునకును, దర్శించబోవు విషయములకును సన్నిహిత సంబంధమున్నది. పైగా మనము భిన్నభిన్న విషయముల దర్శించి వాటిని జోడించుకొనవలసి యున్నది. అందుచే మన మొకచోట నిలుచుటకును వీలు పడదు. మన మేగబోవు ప్రదేశ మాంజనే యాలయమునకు చాల దవ్వున నున్నది. అనగా మనము బీజపుర ప్రాంతమున నున్న సులతాను గఢమున కేగవలసియున్నది. మన మనో వేగమున కాదూర మొక లెక్కయా ?

మహారాష్ట్రదేశమున నున్న కోటలన్నింటిలోను సుల తాను గఢము చాల ప్రసిద్ధిజెందింది. ఆప్రసిద్ధికి గారణము దాని నిర్మాణము మాత్రమేగాక ప్రాచీనతగూడనై యుండెను. దాని

ప్రాచీనతను సమర్థించుట కనేకు లనేక విధముల జెప్పు చుందురు. అరణ్యవాస సమయమున పాండవు లద్దానిని నిర్మించుకొని యుండిరనియు, అందువలననే దాని ప్రాచీన నామము భీమగఢమనియు కొందరందురు. అల్లాయుద్దీను కట్టించినాడని కొందరి యభిప్రాయము. మొగలులే దీనిని నిర్మింపజేసి దీనికి సులతాను గఢమని నామకరణ మొనరించిరని మరికొందరును చెప్పుదురు. ఎవరేమన్నను, మన పని పురా తత్వ పరిశోధనకాదు గాన, ఈ కోట యతిప్రాచీనమైదనియు, అందువలననే దృఢముగ నుండెననియు తెలుసుకొనినచాలును.

ఈ కోట రెండు పర్వత శ్రేణులమధ్య నిర్మింపబడి యుండెను. మిగిలిన రెండువైపులను అరణ్యము. ఆ కోట పై జెప్పిన రెండు పర్వతశ్రేణుల మధ్యనున్న యొక కొండపై నిర్మింపబడియుండెను. ఆ పర్వతమునకు క్రింది భాగమున నొక చిన్న గ్రామము కలదు. అందు షుమారు నాలుగైదువందల జనాభాతోగూడిన నూరు లేక నూటపాతిక యిండ్లు మాత్రము గలవు. ఆ గ్రామమునకు సులతాను పురమని పేరు. ఆ కోటకు చుట్టును పర్వతములు, నరణ్యము నుండుటచే దూరమునకు తేలికగ కన్పించదు.

సులతాను పురమునకు విశ్వనాథ పటేలు గ్రామపెద్ద. పటేలునకు తెలియకుండ సామాన్యముగ నెవరును కోటపై కేగరు. అట్లే కోటనుండి క్రిందకువచ్చినవారు నైతము పటేలును దర్శించకుండ నెచటికి నేగరు. అందుచే సామాన్యముగ పటేలు నకు తెలియని విషయము లుండవు.

వెనుకటి పరిచ్ఛేదమున మనమే రాత్రిని గూర్చి చర్చించుకొంటిమో యా రాత్రి గడచినది. సూర్యభగవాను డేతెంచుచున్నాడు. ప్రకృతిమాత చీకటి ముసుగునుండి నిజ రూపమును వ్యక్తముజేయు చున్నది. గడచినరేయి ప్రొద్దు బోయి నిద్రించుటచే గాబోలును పటేలింకను నిదుర మేల్కాంచ లేదు. ఇంతలో నాతని గుమ్మమువద్ద కొంత కోలాహలము సాగెను. ఈ కోలాహలమునకు గారణము కోటనుండి సుభాను వచ్చుటయే. సుభాను కిలేదారునకుగల యాంతరంగిక సేవకు లలో నొకడు. సామాన్యముగ గ్రామములోని కొక నూత్న వ్యక్తి యేతెంచినచో వానిచుట్టును మూగి పలువిధముల ప్రశ్నించుట గ్రామీణుల కలవాటు. అందును సుభాను హుజూరునుండి యేతెంచినవాడు. అతఁడేదో మహత్తరకార్య భారముననున్న ట్లాతని వైఖరి చెప్పకయే చెప్పుచుండెను. ఆతఁడేతెంచిన కారణమును తెలుసుకొనవలెననెడి కుతూ హలము గ్రామీణులలో వ్యక్తమగు చుండెను. ఆకారణము ననే వారు సుభానువెంట నాతని గొప్పదనమును పొగడుచు ఆశ్చర్యమును ప్రకటించుచు, నేవేవో కబుర్లుసాగించిరి. సుభా నును క్రింది యుద్యోగస్థులు వెంటవచ్చుచుండ ఠీవిమై నడచు నట్టి యున్నతోద్యోగివలె నూగుచు ముందునడచుచు తన గొప్పదనమును ప్రదర్శించుట కాతఁడేవో విషయముల జెప్పు చుండెను. కాని పటేలు యింటివద్ద కేతెంచునప్పటి కాతనికి తన యుద్యోగధర్మము జ్ఞప్తికి వచ్చినది. రహస్యముగ నుంచ వలసిన కొన్ని విషయముల నాతఁడు తన గౌరవప్రతిష్ఠల బ్రదర్శించుటకై గ్రామీణుల యెదుట వ్యక్తము చేసినాఁడు.

తానొనర్చిన తెలివితక్కువపనికి చాలచింతించి వారలనందఱను మఱలిపొండని కసరినాడు. తెలిసినంతవఱకే చాలునని సంతృప్తిం బొందిన కొందఱు మఱలి పోయిరి.

ఒకసేవకుఁడు పైనుండి సుభాను వచ్చినాడను వార్తను లోనికేగి పటేలున కెరింగించెను. అంత పటేలు ఉలిక్కిపడుచు లేచి కండ్లు నులుముకొనుచు బయటకు వచ్చినాఁడు వెంటనే సుభానును లోనికిగొంపోయి కూర్చుండబెట్టి హుక్కాగొట్ట మందించినాడు పటేలు. సుభాను హుక్కాను సేవించుచుండ తాను లోనికేగి ముఖప్రక్షాళన మాచరించి వచ్చి సుభానుతో సంభాషణ ప్రారంభించినాడు.

పటేలు—సుభాన్జి. పెదబాపుగారు కులాసాగా నున్నారా ?

సుభాను—ఆఁ! మామూలుగానే ఉన్నారు.

పటేలు—చిన్నబాబుగారి జాడ యేమైనను తెలిసినదా?

సుభాను—(అధికారగర్వమును ప్ర ద ర్శిం చు చు) మీరిట్లు నిద్రించుచున్న జాడ యెట్లు తెలియును? కలలో కాన్పించునా ?

పటేలు—సుభాన్జి! నేను మాత్రము నిద్రపోవు చున్నానా ? చాలమంది చారులను పంపినాను. కాని, యే యొక్కడును జాడ గొనిరాలేదు. మరి పెదబాబుగారేమను చున్నారు ?

సుభాను—ఏమో నాకు తెలియదు. మిమ్ముల వెంట నిడుకొని రమ్మనినారు.

పఠేలునకీ మాట వినుటతోడనే గుండె గుభేలు మన్నది. ఏమి చేయుటకు నాతనికి దోచలేదు. కొంచెముసేపు మౌనముగ నుండి మరల — "సుభాన్జీ! పెద్ద బాబుగారు కులాసాగా తిరుగుచున్నారా? వారి విషయము నీకు తెలిసి నట్లు మఱెవరికిని తెలియదు. వారికి నీపై విశ్వాసము మెండు. వారు నిన్ను తప్ప మఱెవ్వరిని నమ్మరు. నాతో ఈవిషయము పలుమారులు ముచ్చటించినారు" అనెను.

ఈ మాటలు వినుటతోడనే సుభానునకు తన గొప్ప దనము జ్ఞప్తికి వచ్చినది. అధికార గర్వమును మరచిపోయి నాఁడు. ఆతని హృదయ ముప్పొంగినది. పఠేలు స్వయముగా తన్ను ప్రశంసించుచున్నాడు. దీనితో నాతని హృదయము కోమలమైనది. పఠేలు తన దివ్యాస్త్రమును బహు సున్నిత మైన స్థానమున నేర్పుతో ప్రయోగించినాఁడు.

సుభాను— పెదబాబుగారి విషయ మేమని చెప్పను? వారికి రాత్రింబవళ్ళు నిదురలేదు. రోజంతయు చిన్నబాబు గారికై కలవరించుటయందే గడచిపోవుచున్నది. వారి జాడ తెలుసుకొనలేక పోయిరని నౌకర్లపై కోపగించుచున్నారు. నేనొక్కఁడను తప్ప మఱెవ్వరును వారి యెదుటబడుటకు సాహసించుటలేదు. కుమారునిపై వారికింత ప్రేమ యున్నదని యిదివరకు నాకు తెలియదు. ఆయన యింటినుండి వెడలిపోయి నంతనే నిద్రాహారము మాని కుమారునికై కలవరించు చున్నారు.

ఈ మాటలు వినుటతోడనే కిలేదారు దనకొఱకై ఖబురు పంపినందులకు గల కారణమును తెలుసుకొనినాఁడు

పటేలు. అయినను నోటివెంట మరికొన్ని విషయములు రాబట్ట నెంచి—"సుభాన్జీ! నానాసాహెబుగారు ఇంటినుండి వెడలిపోవుటకు గల కారణము నీకును పెదబాబుగారికని తప్ప మఱెవ్వరికిని తెలియదట గదా! అసలేమి జరిగినది?" అని ప్రశ్నించెను.

సుభాను: ఆ రోజున బీజాపుర సుల్తానువారి దర్బారు నుండి యొక కత్తి, దర్బారు దుస్తులు, మరికొన్ని కానుకలు వచ్చిపడినవి. నానాజీని దర్బారునకు పంపవలసినదిగా సుల తానుగారు కమ్మ వ్రాసి పంపినారు. తన కుమారునకు గలిగిన యీ గౌరవమునకును, సులతాను చూపిన యీ యౌదార్యమునకును కిలేదారుగా రుప్పొంగి తమ కుమారుని దర్బారు దుస్తుల ధరించి బీజపురము పొమ్మని యాజ్ఞాపించినారు. కాని నానాజీ యందుకు సమ్మతించ లేదు. 'నేను నా జన్మలో మహమ్మదీయుల కొలువు చేయను. వారికి సలాములు చేసి హిందూ గౌరవమును మంటగలపను. గో బ్రాహ్మణ హిందూమత హంతకులైన యీ పరమకిరాతుల గొల్చుటకంటె యాత్మహత్య చేసుకొనుట మేలు. పరమ వీరాగ్రేసరులై భరతమాతకు వన్నెవాసింగూర్చి స్వాతంత్ర్యము నకై యసువుల గోల్పోయిన మహాపురుషుల జాతికిఁజెందిన నేను బానిసతొత్తునై వారి దర్బారుననేరి జోహుకుమ్మనుచు మ్లేచ్ఛులకు సలాములు చేయను.' అని ఖచ్చితముగ బల్కిరి. దానితో కిలేదారుగారి కోపము మితిమీరి — 'నీవు రాజ ద్రోహివి. నావంశము చెరుపబుట్టితివి. రాజాజ్ఞయు మహావిష్ణువు

నాజ్ఞయు నొక్కటని యెంచక మూఢుఁడవై నోటికి వచ్చినట్లెల్ల ప్రేలుచున్నావు. ఛీ! ఇక నీ ముఖము నాకు జూపవద్దు. దేశము నుండి వెడలిపొమ్ము' అని గద్దించినారు. ఆ మరుదినము నుండియే నానాజీ యగుపించుటలేదు. వారి గుఱ్ఱముగూడ అశ్వశాలయందు లేదు. కాని వారు వెడలిపోయిన నిముషము నుండియు కిలేదారుగారి దుఃఖమునకు మేరలేకున్నది." అని చెప్పుచుండగనే తటాలున నాతనికి సమయజ్ఞానము కలిగి కొండపై కేగుటకు పఠేలును తొందఱపెట్టెను. అంత పఠేలు లేచి బయలుదేరెను. వానివెంట నలుగురైదుగురు మనుష్యులు బయలుదేరిరి. కాని పఠేలు వారినందఱను మఱలిపొమ్మని అందున్న షోడశవర్ష ప్రాయుడగు రాముని మాత్రము వెంట రమ్మనెను. రాముఁడు చాల చుఱుకైనవాఁడు. సాహసికుడు. ధైర్యవంతుఁడు. అతఁడు మన కథలో తఱచు కనుపించుచునే యుండును గాన ప్రస్తుత మాతని గుఱించి యింకేమియుఁ జెప్పము.

ముగ్గురును గబగబ కొండ నెక్కుచుండిరి. పఠేలు సుభానులు మాట్లాడుకొనుచు వెనుకవచ్చుచుండిరి. రాముఁడు మాత్రము లేడిపిల్లవలె గంతులిడుచు ముందు నడచుచుండెను. కాని యాతని చెవులుమాత్రము పఠేలు సుభానుల సంభాషణమును వినుచుండెను. అతని కండ్లు పరిసర ప్రాంతముల నన్నిటిని పరీక్షించుచుండెను. అతని దొక విలక్షణమైన దృష్టి. ఆ దృష్టిని తప్పించుకొనజాలునట్టి యంశములు లేవు. అతని నడక, చూపు, ఆలోచన మున్నగునవి చూపరుల నాశ్చర్య చకితుల నొనరించును.

కొంతసేపటికి ముఫ్వురును కొండ పైభాగమునకు జేరిరి. మొదటి ప్రహరీని సమీపించుటతోడనే నలుగురైదు గురు వ్యక్తులు వారి కెదురు వచ్చిరి. అందొకడు — "దయ చేయుడు. పటేల్జీ! ఎంత కాలానకు తమ దర్శనమైనది! ఎన్నాళ్ళనుండియో వేచియున్నాము" అని వ్యంగ్యముగ ననెను.

ఇంతలో సుభాను అందుకొని— "నేను వెళ్ళునప్పటి కింకను పటేల్జీ నిద్రనుండి లేవలేదు."

పటేలు తా నాలస్యముగ లేచుటకుగల కారణములను వివరింప దలచి—'రాత్రి చాలసేపటివఱకును మేల్కొంటిని. రాత్రి యంతయు నిదురలేదు.' అనెను.

వెంటనే మొదట వ్యంగ్యముగ మాట్లాడిన వ్యక్తి యందు కొని—"ఏమి? రాత్రియెచటకైనను నృత్యప్రదర్శనమునకు వెళ్ళినారా? సుభాన్జీ! మనపటేలు గారికి నృత్యమన్న మిక్కిలి యిష్టము. అందును రామబాయి నృత్యము... వహ్వా! ఏమని చెప్పను?" అని యింకేమో చెప్పబోవుచుండెను. ఈ మాటలు విని నంతనే పటేలునకు పట్టరాని కోపమువచ్చి "సర్ఫోజీ! ఇంక నీ వేళాకోళములు కట్టిపెట్టుము." అనుచు ముందునకు సాగెను.

ముగ్గురును కోటలోనికి బ్రవేశించి వరండాను సమీ పించిరి. కాని పటేలునకు లోన బ్రవేశించుటకు ధైర్యము చాలుటలేదు. అపరాధియగు బాలుడుపాధ్యాయుని సమ్ముఖ మున కేతెంచు పగిది పటేలు వడకుచు లోన నడుగిడెను. అతనివెంట సుభానును లోనికేగెను. రాముడుమాత్రము బయటనే యుండిపోయెను.

గదిగోడలు నిలువుటద్దములతో నలంకరింపబడి యుండెను. గదియంతయు బహుమూల్యములైన కళాకృతులతో రమ్యమై యుండెను. నాలుగైదు సుఖాసనములు పరువబడి యున్నవి. ఒకవైపున మెత్తటి దూదిపరుపులతో గూడిన కుర్చీ యుండెను. అందొక వృద్ధుఁడాసీనుడై యుండెను. వాస్తవమున కాతడంత వృద్ధుడు కాకపోయినను ప్రస్తుత చింతాభార మాతని మధ్యవయస్సును ముసలితనమునకు మార్చివైచెను. పశేలు లోనప్రవేశించి యాయనకు మూడు పర్యాయములు వంగి నమస్కరించి నిలువబడెను. ఆతని బుద్ధి యేమాత్రమును పనిచేయుట లేదు. ఆతఁడొక పోతబోసిన విగ్రహమువలె కదలక మెదలక నిలువబడి యుండెను. అంతకొంతసేపటి కావృద్ధుఁడు— 'పశేల్జీ! ఇంతవఱకును నీవు నానాసాహెబుజాడ తెలుసుకొనలేదు. మీ వైఖరిఁజూడ మీ రందరును నిద్రపోవుచున్నట్లున్నది. కోటనుండి క్రిందకుదిగి పారిపోవుచున్న వానిజాడ నీకు తెలియలేదనుట క్షమించరానిది. నీవును నీ నౌకర్లును అందుకు బాధ్యులుకారా? మీ పరిస్థితి జూడ నాతనిజాడ తీయుటకై ప్రయత్నించుచున్నట్లైనను లేదు. చారులను పంపితివా లేదా?' అని గద్దించెను. ఈ మాటలు వినుసరికి పశేలు ప్రాణము లెగిరిపోయినవి. సాక్షాత్తు జమదగ్నివలెనున్న ఆయనయెదుట నోరెత్తుటకు పశేలునకు సాహసము చాలలేదు. పాపము పశేలు నానాసాహెబును వెదకుటకై విశ్వప్రయత్నములు చేసినాడు. కాని ఫలించలేదు తాను చేసిన ప్రయత్నములను విన్నవించుకొనుటకైనను ధైర్యము

చాలుటలేదు. అతనివాక్కు కుంఠితమైనది. పటేలు తన క్రింది నౌకర్ల నీ విధముగనే గద్దించెడివాడు. ఆ పటేలునకును ప్రస్తుత పటేలునకును చాలవ్యత్యాస మున్నది. అత డధికారి, ఇతడు సేవకుడు.

'ఇదిగో! నీకు నాలుగుదినములు గడువిచ్చుచున్నాను. ఈ నాలుగుదినములలో జాడ తెలుసుకొనలేనిచో నీ ప్రాణములు దక్కవు జాగ్రత్త!' అని వృద్ధుడు మరల హెచ్చరించెను.

అప్పాసాహెబుగారు చాల సంయమముగల మనిషి. పరుల యెదుట సులభముగ తన హృదయమును వ్యక్తము కానీయడు. తానొక వ్యక్తిని ప్రేమించుచున్నను తన ప్రేమను తెలియనీయడు. ముఖ్యముగ సేవకుల విషయమై ఆయన ప్రవర్తన యిట్లుండును. హృదయమున దయయున్నను బయటకు మాత్రము కఠోరముగ మాట్లాడును. ఆయన మాట్లాడు మాటలనైనను తూచి తూచి మాట్లాడును. సేవకులపై తన యధికారమును చలాయించుటకును, తన యధికారమును రక్షించుకొనుటకును వాక్సంయమమే ముఖ్యమైన యాయుధమని యాయన విశ్వాసము. బహుశః అందువలననే సేవకులు భయభక్తులతో నుందురేమో! ఆయన పట్టుదల విడువరానిది.

ఇంతటి సంయమముతో గూడినను ఆతని హృదయమునగూడ నొక కోమల స్థాన మున్నది. అతని ధైర్యసాహసములందును. కఠోరత యందునుగూడ నొక దుర్బలమైన యంశ మున్నది, ఆతని సంకీర్ణ హృదయమునగూడ ప్రేమ

ప్రవంతి వెల్లువలై పాఱుచుండును. కాని యది పాతాళజల ప్రవాహము వంటిది.

అప్పారావు సులతానుగఢమునకు కిలేదారు. బీజపూరు సులతానులకు విశ్వాసపాత్రుడు. నానాసాహె బాతని యేకైక పుత్రుడు. చిన్నతనమునుండియు నాతనికి చాల శ్రద్ధతో చదువుసంధ్యల జెప్పించినాడు. పుత్రుడు పెద్దవాడై పరాక్రమవంతుడైనాడు. తండ్రి సంతోషమునకు మేరలేదు. పుత్రునిపై తనకెంత ప్రేమయున్నను, పుత్రుని గుణగణముల కెంత సంతసించుచున్నను తన ప్రేమనుగాని, సంతోషమునుగాని వ్యక్తము జేసెడివాడుకాడు. పుత్రుడు మఱల తనవలెనే సులతానుకు విశ్వాసపాత్రుడై పేరుప్రతిష్ఠల సంపాదించునని కొండంత యాశతో నుండెను. కాని నానాసాహెబు పెద్దవాడైనకొలదియు మహమ్మదీయుల నెక్కుడుగ ద్వేషింప మొదలిడెను. అతడు తఱచు మహమ్మదీయ శబ్దమునకుబదులు 'మ్లేచ్ఛ' శబ్దమునే ప్రయోగించుచుండెడివాడు. ఇది తండ్రికి గిట్టదు. నానాసాహెబు చిన్నతనమువలన నిట్లు ప్రవర్తించుచున్నాడనియు, పెద్దవాడైనచో తప్పక తన స్వభావమును మార్చుకొనగలడనియు అప్పారావు మొదట నెంచెను. కాని పుత్రుడీకారణముననే గృహమును వీడిపోవుటతో నాతని యాశ యడుగంటెను. మొదట క్షణిక కోపవేగమున కుమారుని యిల్లు వెడలిపొమ్మనెనేగాని యాతడు వెడలిపోయిన నాటినుండియు పుత్రునిపైగల ప్రేమ యత్యధికమై వేధింప జొచ్చెను. కుమారునిపై తనకంతటి ప్రేమయున్నట్లు తనకే

తెలియదు. కాని తన దౌర్బల్యమును పరుల సమక్షమున ప్రదర్శించు టాతని కిష్టములేదు. అందుచే—'పటేల్జీ! నాలుగు దినములలో వానినిపట్టి తీసుకొనిరావలెను. అట్టి దేశద్రోహులను, విశ్వాసఘాతకులను వదలిపెట్టరాదు. అతని జాడ తెలుసుకొనిరానిచో నీ ప్రాణములు నిలువవు. జాగ్రత్త!' యని హెచ్చరించెను.

ఏదో విధముగ సింహముఖము నుండి తప్పించుకొన జూచునట్లుగ పటేలు 'చిత్తము' అని వెడలిపోబోయెను. కాని యింతలో ద్వారపాలకు డొకడు వచ్చి – 'దేవరవారి కొఱకై బీజపురము నుండి వార్తాహరుడొకడు వచ్చి వేచియున్నా'డని విన్నవించెను. అప్పారావాతని గొనిరమ్మని పంపెను. వార్తాహరు డేతెంచి కిలేదారు చేతియందొక యుత్తరము నుంచెను. ఆ యుత్తరమును జూచినంతనే అప్పారావు ముఖము వెలవెల బోయెను. పటేలున కేమి చేయుటకును తోచలేదు. అతని దృష్టి యప్రయత్నముగ కిటికీ వైపుకు బోయెను. రాముడా కిటికీలో నుండి జరుగుచున్న విషయమునంతను శ్రద్ధతో తిలకించుచుండెను. తన స్థితి యంతయు రామునకు వ్యక్తమైనందుకు పటేలునకు రామునిపై మిక్కిలి కోపము వచ్చెను. కాని ఏమిచేయగలడు? రాముడును ఇది కనిపెట్టి ప్రక్కకొదిగెను.

# 3

మన మహారాష్ట్ర వీరుని ఆంజనేయాలయమున భూగర్భము నందు వదలి వచ్చితిమి. ఇక మనమాతని విషయము నించుక తెలుసుకొందము. అతడు 'జై వీరహనుమాన్' యనుచు లోన నడుగిడెను. అతడు లోనికేగుటనుగాని, లోనికేగిన పిమ్మట సంభవించు విపత్తులనుగాని లక్ష్యపెట్టలేదు. అతడట్లు మెల మెల్లన నడుగు లిడుచు మెట్లవెంబడి లోనికి దిగిపోవుచుండెను. ఇట్లాతడు కొంతదవ్వేగిన వెంటనే యకస్మాత్తుగ 'ఆగుము! ఎవరవు నీవు? అడుగు ముందునకు వేసితివా నీ ప్రాణములు నీకు దక్కవు, జాగ్రత్త!' యను శబ్దములు వినవచ్చెను. ఈ మాటలను వినిన మన వీరు డాశ్చర్యపడి వెంటనే స్థైర్యము దెచ్చుకొని — 'ఎవరా? ఎవరైన నేమి? ప్రాణములపై మోహమును వీడినవాడే యిట్టి సాహసమున కుపక్రమించును.' అనుచు ముందునకు సాగెను.

ఇంతలో కరవాలమును చేతగొనిన యొకవ్యక్తి యాతని కెదురయ్యెను. మన వీరుడు కత్తిబట్టి యాతనిపై కుఱుక నెంచెనుగాని యా నూతన వ్యక్తి తేజమును, రూపమును జూచుటతోడనే కొంచెము వెనుకకు తగ్గెను. ఆ నూత్నవ్యక్తి సన్యాసి వేషమున నుండెను. మెడనుండి క్రిందివరకు కాషాయాంబరము వ్రేలాడుచుండెను. చేతిలో నొక రుద్రాక్షమాల యుండెను. తలపై జడలతోబాటు గడ్డము గూడ బాగుగ పెరిగియుండెను. మన సైనికుడా బాబాజీని తదేక ధ్యానముతో జూచుచుండెను. వేషమునుబట్టి యికనుండి మన మాతనిని బాబాజీ యనియే వ్యవహరింతము.

అంతనా బాబాజీ మన సైనికునిగాంచి — 'నీ వెవరవు? నీ విచటి కేలవచ్చితివి? బ్రతుకుపై నాశలేదా? బ్రతుకుపై నాశయున్న యెడల వెంటనే మఱిపొమ్ము' అనెను.

'లేనిచో చావు తప్పదా? నన్ను చంపువారెవరు? మీరా? మీరట్లు హింస కొడిగట్టరని నా నమ్మకము'.

'ఎందువలన? నా యీ వేషమునుబట్టి యిట్లు భావించితివా? అది నీ భ్రమ. ఈ గుహలోనికి వచ్చుటయే నీ చివరి ఘడియ లాసన్నములైనవనుటకు చిహ్నము. నీవు మహమ్మదీయుడవేనైనచో నీ చావు నిక్కము!'

'ఏమీ! ఇది మహమ్మదీయులకు వధ్యభూమియా? అయిన నేను సరియైన చోటునకే చేరితిని. మీరననమాటయే యదార్థమైనచో నేను మీ భృత్యుడను. నేనిచటనే యుండి తురకల వధించి నిజధర్మ రక్షణమను పవిత్ర కార్యమున నాచేత

నైన సాయమొనర్చెదను. నన్ను మ్లేచ్ఛునిగ భావింపకుడు.»
అని యిట్లు మిక్కిలి యుద్రేకముతో మననైనికుని నోటినుండి
వెలువడిన మాటలను బాబాజీ కుతూహలముతో వినుచుం
డెను. అతని ముఖమున సంతోషచిహ్నములు పొడగట్టెను.
ప్రసన్నవదనుడై బాబాజీ— 'నాయనా! నీ వాడినమాటలు
బాగున్నవి. నీవాడినమాటలను చేతలచే రుజువుపఱచినచో
నిట నీ కెట్టిలోటును కలుగదు. అది యటుండనిమ్ము. నీ వెవ
రవు? నీ విటకేతెంచిన కారణమెయ్యది? నీ వీప్రదేశమున
కెట్లేతెంచితివి?' అని యడిగెను.

అంత సైనికుడు 'బాబాజీ! నేనొక సామాన్య మహా
రాష్ట్రుడను. ఇంతకంటె వేరు పరిచయము తమకక్కఱలేదని
భావింతును. నాకు 'నా' యను వారెవ్వరునులేరుగాన విశేష
పరిచయ మిచ్చుటకు నేనసమర్థుడను. ఇక నాప్రవర్తన విషయ
మందురా? నేను మీ సన్నిధియందుండి యొవర్చు కార్యముల
వలన తేటతెల్లము కాగలదు. కాన యో సంయమాగ్రణీ!
నాకిట నుండుట కనుజ్ఞ నిడి కరుణింపు' డని ప్రార్థించెను.

ఈమాటలాలించిన బాబాజీ— 'ఏమో! నీవు నీ పరి
చయ మిచ్చుటకై వెనుదీయుచుండుటచే నాకు నీ విషయమై
నమ్మకము కుదురుట లేదు. నీవు నీ విషయములను రహస్యముగ
నుంచదలచుచున్నావు. ఆప్తులయెదుట రహస్యమనునది
హృదయదౌర్బల్యమునకు చిహ్నము. నీవు చెప్పకున్నను నేను
నీ యుద్దేశ్యమును గ్రహించితిని. అందు నీవు కొలది దినము
లలో సఫలుడవు కాగలవు. నిన్ను నేను గుర్తించలేదని యెంచ

కుము. పోనిమ్ము నీవు నీపేరును గ్రామమును గుప్తముగా నుంచుకొనదలచినచో నట్లే కానిమ్ము కాని...'అనియేమో చెప్పబోవునంతలో నొక యీల వినవచ్చెను. బాబాజీ యీ ధ్వని విని వెంటనే యంధకారమున ముందునకు సాగిపోయెను. మన సైనికుడు బాబాజీకై యచటనే చాలసేపు ప్రతీక్షించి యుండెను. కాని బాబాజీ తిరిగి రాలేదు.

అంత నాతడును బాబాజీ వెళ్ళిన దిక్కునకే బయలు దేరెను. కాని మార్గమంతయు నంధకారబంధురమగుటతో బాటు వంకరటింకరగ నుండెను. అతనికేమియు దోచలేదు. అచటనే కొంతసేపు ఆగి బాబాజీకై మఱల ప్రతీక్షించెను. ఎంతకును బాబాజీ తిరిగిరాకపోవుటచే నాతడు విసిగి ముందు నకు పోవ నమకట్టెను. కాని యంతయు నంధకారము! అత డట్లే చేతులతో తడుముకొనుచు ముందునకు సాగెను. కొంత దూర మేగునప్పటికి మార్గ మగుపడలేదు. ఎదుట గోడ యుండుటచే నంతటితో మార్గము సమాప్తమైనదని తోచినది. ఎటు పోవుటకును తోచక చేతులతో గోడలు తడుముచుండగ నాతని చేతికొక గుమ్మము తగిలెను. ఆ ద్వారము మిక్కిలి చిన్నది. అతడా ద్వారమును తెఱచిచూడ దూరమున నేదో వెలుగు కన్పించెను. అంత నాతడా ద్వారముగుండా వెలుగు కన్పించినచోటున కేగుటకు నిశ్చయించుకొని బయలుదేరెను. అతడా వెలుగును సమీపించిచూడ నచట దీపమేమియులేదు. ఆ ప్రకాశ మొక గదిలోనుండి వచ్చుచుండెను. గది తలుపులు మూయబడియుండుటచే తలుపు సందులనుండి మాత్రము దీప

కాంతిరేఖలు బయటకువచ్చుచున్నవి. అత డాసందులనుండి తొంగి చూచెను. అది యొక సభాభవనమువలె తోచెను. అందు మధ్యభాగమున నొక దేవతామూర్తి యుండెను. అతడు లోనికేగి యచటి విచిత్రముల దర్శింప నెంచి తలుపు తెఱచి లోన ప్రవేశించెను. అందలి దృశ్యము లాతని కాశ్చర్యమును కలిగించెను.

నిజమున కదియొక విశాలమైన సభా భవనము. అందలి మధ్యభాగమున నొక భయంకరమై యష్ట భుజాకృతియందున్న దేవతామూర్తి యొండు గలదు. ఆ దేవి తన పాదములతో నొక రాక్షసుని మర్దించుచుండెను. ఆమె నాలుగుచేతులందును నాలుగు విభిన్నాయుధములును, మిగిలిన నాలుగుచేతులందును మానవ కపాలములను దాల్చియుండెను. ఆ దేవతామూర్తి శిరోజములన్నియు విరియబోసుకొని యుండెను. ఆమె శిరసు తప్ప మిగిలిన దేహమంతయు సిందూరావృతమై యుండెను. ఆమెకు ముందుభాగమున రెండు దీపస్తంభములలో దీపములు వెలుగుచుండెను. ఆ దేవతామూర్తిని జూచినతోడనే సాష్టాంగ మాచరించినాడు మన సైనికుడు. అటుపిమ్మట నాతడు సభాభవనమంతయు పరిశీలింప దొడంగెను. ఎచట జూచినను సభాభవనమంతయు నాయుధములతో నిండియుండెను. గోడలపై కత్తులు తుపాకులు మున్నగునవి వ్రేలాడుచుండెను. బల్లెములు బాణములు మున్నగునవి అసంఖ్యాకములుగ నుండెను. ఒకమూల నాలుగు పెద్ద ఫిరంగులును దానికి సమీపమున తుపాకిగుండ్ల ప్రోగులు నుండెను. ఇవి యవి

యన నేల ? ఆ సభాభవనమున నెచటజూచినను యుద్ధ పరికరములే ! అతడాశ్చర్యముతో వాటిని పరీక్షించుచుండెను. తుపాకులు వ్రేలాడదీయబడిన గోడకుసమీపమున కొన్ని పెద్ద పెద్ద పెట్టెలుండెను. మన సైనికుడు కుతూహలముతో వానిని తెఱచిచూడ నవి బహుమూల్యములైన వస్తువులతోడను, రత్నములతోడను, వెండి బంగారు నాణెములతోడను నిండి యుండెను. అతని యాశ్చర్యమునకు మేర లేదు. అతడేమియు దోచక నటు నిటు పచారులు చేయసాగెను. చివరకాతడలసి యుండుటచే నచటనే యొక తివాచిపై మేనువాల్చెను. కొలది సేపటిలో నాతడు గంభీరమైన నిద్రలో మునిగిపోయెను.

బాబాజీ తిరిగివచ్చి చూచుసరికి వదలివెళ్ళినచోట సైనికుడు కాన్పింపలేదు. సైనికునికై యిటు నటు వెదకి మఱల పైకివచ్చి ఆలయమంతయు వెదకెను. కాని యాతడు కాన్పించలేదు. ఆలయమునకు ముందఱ గుఱ్ఱము మాత్ర మటు నటు తిరుగుచు గడ్డిమేయుచుండెను. అంత మన బాబాజీ సైనికుడు కాన్పింపమికి లోలోన గొణుగు కొనుచు ఆలయప్రాంగణమున నున్న చలిమంటవద్దజేరి భగవన్నామసంకీర్తనము మొదలిడెను.

సులతానుగఢమునకు నలువైపులను అరణ్యమున్నదని వెనుక చదువుకొనియున్నాము. సులతానుగఢమునకు వెనుక వైపుననున్న యరణ్యము మఱింత దట్టమైనదని మాత్రమే మన మిచట తెలుసుకొనవలసిన విషయము. ఆ వెనుకవైపుననున్న యరణ్యమందు మార్గములులేవు. ఆ దిక్కునకు వెళ్ళవలసిన యగత్యమే యుండదుగనుక నది యంతయు సంచారములేని

యరణ్యప్రదేశము. అప్పుడప్పుడు కొందరు వీరులు క్రూర జంతువుల వేటాడుటకు మాత్రమావైపున కేగుచుందురు. అట్టి నిర్జనారణ్యప్రదేశములే తఱుచుగ విప్లవకారులకును, కుత్రదారులకును రహస్యసమావేశస్థలములుగ నుపయోగపడుచుండును.

బీజపురమునుండి యొక వార్తాహరుడేతెంచి అప్పాసాహెబున కొక యుత్తరమిచ్చియుండెనని వెనుక చదువుకొని యున్నాము. ఆ యుత్తరమును జూచినతోడనే యాతని చిత్తవృత్తి దుఃఖాక్రాంతమయ్యెను. కొలదిసేపటి కాయన ప్రకృతస్థుడై వార్తాహరుని విశ్రాంతికి వలయు సదుపాయముల నొడగూర్చుమని పఠేలున కాజ్ఞాపించి 'హుజూరువారికి సమాధానము కొంచెము తీరికగ వ్రాతును. ఒకటి రెండు దినములలో నీవు సమాధానమునుగొని వెళ్ళవచ్చున' ని వార్తాహరునితో జెప్పి పంపెను. పఠేలు వార్తాహరుని వెంటగొని బయటకు వచ్చుటతోడనే రాము డతని కగుపించెను. అప్పాసాహెబుతో మాట్లాడునప్పుడు పఠేలు రాముని కిటికీవద్ద చూచెను. కాని మధ్యలో కొంతసేపటివఱకును రాముడు కానరాలేదు. తిరిగి యిప్పుడాతడు యథాస్థానమున నుండెను. రాము డీ మధ్య సమయములో నెచటికేగినదియు కనుగొనవలెనని గూడ పఠేలునకు తోచలేదు. పఠేలు సాధ్యమైనంత త్వరలో కోట క్రిందకు దిగిపోవ నెంచుచుండెను. మఱల కిలేదారు పిలిపించునేమోయని యతని భయము. అందుచే నాతడొక జమాదారుతో వార్తాహరుడైన ఖానునకు వలయు సదుపాయము లొనర్చుమని చెప్పి రాముని వెంటగొని యచటి నుండి తప్పించుకొన

జూచెను. కాని ఖానాతనిని వదలలేదు. ఖాను హుజూరు దర్బారు నందలి సైనికుడు. పైగా హుజూరు వారిచే ప్రేషితుఁడై వార్త గొనివచ్చినాఁడు. అతఁడు తన యధికారమును ప్రకటించుచు తనకు గావలసిన యేర్పాటులన్నియు నొనరించిన పిమ్మటగాని వెళ్ళుటకు వీలులేదని పశేలు నాజ్ఞాపించెను. పాపము పశేలేమి చేయగలడు ?

ఇంతలో సర్ఫోజీ తన నలుగురైదుగురు అనుచరులను వెంటనిడుకొని ఖానును కలుసుకొనుటకై యచటి కేతెంచెను. ఖాను మాటలను విని పశేలు లేని ప్రసన్నతను ప్రకటించుచు నిలచిపోయెను. సర్ఫోజీ మున్నగువారి యాగమనముతో సభ పూర్తియైనది. హుక్కాకు వలయు యేర్పాట్లు గావింపబడెను. ఖాను హుక్కా గొట్టమును నోటబెట్టి తన యౌన్నత్యమును ప్రదర్శించుచు మాటలాడుచుండ సభ్యులు తలలూపుచుండిరి. పశేలు మాత్రము లోలోన తిట్టుకొనుచుండెను. మాటల సందర్భమున సర్ఫోజీ పశేలుపై గొన్ని వ్యంగ్య బాణముల విసరెనుగాని పశేలు వానిని సునాయాసముగ ఖండించివైచెను. అంత కొలదిసేపటికి ఖాను పశేలుతో – 'పశేల్జీ! ఇంక మీరు వెళ్ళవచ్చును. మాకు ప్రొద్దుబోవుటకై సర్ఫోజీ కలడు' అనెను. ఇది విని పశేలు 'బ్రదుకు జీవుడా !' యనుకొనుచు బయలుదేరి రామునికై చూచెను. కాని రాము డెచటను కానరాలేదు. అంత పశేలు రామునికై ప్రతీక్షించుచు కూరుచుండినచో మరల పైనుండి పిలుపు వచ్చునేమోయని యెంచి బయల్వెడలెను.

కొంతసేపటికి సర్ఫోజీ మిగిలిన తన యనుచరులను గూడ నచటి నుండి పంపివేసెను. ఇక మిగిలినది సర్ఫోజీ ఖానులు మాత్రమే! ఖానుతో మాట్లాడుటకు సర్ఫోజీ చాల తొందరపడుచుండెను. 'ఖాన్జీ! నాకేదైన ప్రత్యేక సందేశము పంపినారా?' యని మెల్లగ నడిగెను.

అంత ఖాను — 'అవును. నీకొక ఉత్తరమిచ్చినారు. దానిని నీకు రహస్యముగ నిమ్మనినారు. ఇచటనిచ్చిన నెవరైన చూతురేమో!' అనెను.

'వలదు. ఇచట వలదు. దానిలోని విషయమును మాత్రము క్లుప్తముగ జెప్పుడు. తరువాత నమ్మకస్తులైన వారిచే ఉత్తరము చదివించుకొందును.'

ఇంతలో నెవరో గొణుగుచున్నట్లు చప్పుడయ్యెను. సర్ఫోజీ నలువైపులను జూచి – 'ఎవరును లేరులే! బహుశః ఉడుతలేమో! చెప్పుడు!' అనెను.

'నేటిరాత్రి పండ్రెండు గంటలకు నిన్ను మామూలు చోట కలుసుకొనవలసినదిగా చెప్పినారు. వారచటికి వత్తురట. మిగిలిన విషయములు కాగితములో నున్నవి. దానిని నేను తరువాత రహస్యముగ నిత్తు'నని ఖాను మెల్లగ ననెను.

ఇంతలో నొక సేవకుఁడు వచ్చి సర్ఫోజీని పిలచెను. సర్ఫోజీ ఖానులు కలసి బయలుదేరిరి. వారి వెనుకనున్న బండ చాటునుండి యెవరో దగ్గుచున్న ధ్వని వచ్చెను. ఆ బండ వెనుక నొక చిన్న తల కనుపించెను. అందలిచాతుర్య పూర్ణమైన చిన్న నేత్రములు వారిరువురివైపునకు జూచుచుండెను.

ఆ చిన్న మస్తిష్క మేదియో యాలోచించుచుండెను. సర్ఫోజీ ఖానులు దానిని కనిపెట్టలేదు. వారు దూరమైనకొలదియు నిచట తల పైకి లేచుచుండెను. అరె! ఇతఁడు మన రాముఁడే! అతని దృష్టి వారి ననుసరించుచుండెను. ఖాను సర్ఫోజీ చేతియందు త్తరముంచుటనుగూడ చూచిన వాతనికండ్లు. ఇఁక నతని యాలోచనల కంతులేదు.

పటేలు తల వంచుకొని తన యింటికి జేరెను. అతని ముఖాకృతిని జూచినంతనే యాతని మానసిక స్థితిని మనము గుర్తించవచ్చును. అతఁడు కిలేదారిచ్చిన యాజ్ఞను మాటి మాటికిని తలచుకొనుచు భావి కర్తవ్యమునుగూర్చి యాలోచించుచుండెను. ఇంతలో రాముడు పరుగు పరుగున కొండపై నుండి దిగివచ్చి పటేలు గృహమునకేగెను. రాముని జూచుట తోడనే పటేలు – 'ఓరి వెధవా! నీ వింతవరకు నెచటి కేగితివి?' అని కోపపడెను. కాని రాముడంత మాత్రమునకే భీతిల్లువాడు కాడు. అతఁడు — 'పటేల్జీ! మీరు ఖానువద్దనుండి తప్పించుకొని యింటికి వచ్చినారు. నేనచటనే యుండిపోతిని. పటేల్జీ! సర్ఫోజీఖాను లిద్దరు కలసి యేదియో కుట్ర పన్నుచున్నట్లున్నది. మీరుండగనే సర్ఫోజీ ఖానునకు కనుసైగ చేయుట నేను చూచితిని. అంతియకాదు, వారిరువురి సంభాషణను వింటిని. ఖాను సర్ఫోజీ కొక ఉత్తరమును రహస్యముగ నిచ్చుటనుగూడ చూచితిని. నేటి రాత్రి పండ్రెండు గంటలకు మనకోట కావలవైపునున్న యరణ్యమందలి సెలయేటివద్దకు వచ్చి కలుసుకొమ్మని యెవరో సర్ఫో

జీకి కబురంపినారు. మీరేమనిననుసరేగాని సర్ఫోజీ యేదియో కుట్ర పన్నుచున్నాడని తోచుచున్నది' అనెను.

మొదట పటేలు రాముని మాటలపై ధ్యానముంచ లేదు. కాని సర్ఫోజీ కుట్ర పన్నుచున్నాడని చెప్పుటతోడనే పటేలు నాలుగైదు పర్యాయములు జరిగిన యుదంతమును గ్రుచ్చి గ్రుచ్చి యడిగినాడు. చివర కాతనికి రాముని మాటలు సత్యములై యుండవచ్చునని తోచెను. రాముడు అల్లరి పిల్ల వానిగను, చదువుకొనని మొద్దబ్బాయిగను, పోకిరీగను గ్రామ మున పేరుబొందినవాడు. మంచి మాటకారి. అబద్ధమాడడు. విశ్వాసపాత్రుడు. గ్రామము నందందరును రాముని ప్రేమిం చుట కిదియే కారణము. పటేలునకు రామునిపై ప్రేమమెండు. రామునకు పటేలుపై చక్కని శ్రద్ధగలదు. రాము డొకదినము కనుపించనిచో పటేలు వానికై కబురంపును. రాముని విష యము పటేలునకు బాగుగ తెలియును. అందువలననే పటేలు వాని మాటలను నమ్మినాడు. ముందు చేయవలసిన పనిని గుఱించి యాలోచించ మొదలిడినాడు. ఇంతలో లోపలినుండి భోజనమునకు పిలుపు వచ్చినది. కాని పటేలు పిలుపును వినిపించుకొనలేదు. రామునితో— 'రామూ! నీ విచటనే భోజనముచేసి కొండపైకేగి సుభానును పిలుచుకొని రమ్ము' అనెను. రాము డిదివిని—'భోజనమునకు తొందరేమి? ముందు పోయి సుభానును పిలుచుకొనివత్తును. తరువాత భోజనము నకు పోదును. భోజనమున కాలస్యమైన పరవాలేదు. అమ్మ కోపపడును. ఇంతియేకదా!' అని కొండపైకి బయలుదేరెను.

కాని పఠేలు భోజనము చేయకుండ వెళ్ళనీయలేదు. భోజన మైన తరువాత రాముడు చెంగు చెంగున కొండనెక్కి- సుభానును కలుసుకొని పఠేలు చెప్పిన సమాచారము వినిపించినాడు. ఇరువురు బయలుదేరి వచ్చుచుండగా త్రోవలో సర్ఫోజీ యెదురయ్యెను. అతనికి మొదట వారిపై కొంచెమను మానము కలిగెను. వెంటనే యాతని సూక్ష్మబుద్ధి దానికి తగిన సమాధానమిచ్చి సమాధానపఱచినది.

ఇరువురును వచ్చునప్పటికి పఠేలు వారికొఱకై ప్రతీక్షించుచుండెను. పఠేలు సుభానునకు విషయమంతయు జెప్పిన పిమ్మట నిరువురును కొంతతడవేవేవో విషయములను చర్చించుకొనిరి. మధ్య మధ్య రాముని పిలిచి – 'ఖాను ఏమనినాడు? సర్ఫోజీ యేమనినాడు? ఉత్తరము నెవరు పంపిరి? అందేమున్నది?' అని ప్రశ్నింపదొడగిరి. రాముడు తనకు తెలిసినంతవఱకు చెప్పినాడు. తెలియని విషయముల కాతడేమి చేయును? చివఱకు పఠేలు సుభాను లెల్లైనను రాత్రికీ విషయమును గుఱించి తెలుసుకొనవలెనని నిశ్చయించుకొనిరి. సుభాను తాను ముందుగబోయి వారు సమావేశము కాబోవు ప్రదేశమును పరిశీలించి వచ్చెదననియు, రాత్రికి తాను వచ్చునప్పటికి పఠేలును ప్రయాణమునకు సిద్ధముగ నుండవలసినదనియు చెప్పి తాను బయలుదేరెను.

సుభానునకును, సర్ఫోజీకిని బద్ధవైరము. సుభానునకే గాదు; కోటలోని చాలమంది నౌకర్లకును సర్ఫోజీకిని సరిపడదు. నేడు సర్ఫోజీపై చిరకాలమునుండి తనకు గల పగను సాధించు

కొనుటకై తగిన తరుణ మాసన్నమైనదని యెంచి సుభాను సంతసించి వారి రహస్య సమావేశమునకై నిర్దేశింపబడిన ప్రదేశమునకేగెను. అది జన సంచారములేని యరణ్యము. చెట్లు దట్టముగ నుండెను. అందొక యెత్తైన కొండగలదు. ఆ కొండ శిఖరముపై నొక పెద్దశాలిబండగలదు. ఆ కొండపై కెక్కుటకు ముందువైపున మాత్రము కాలిబాటగలదు. మిగిలిన మూడు వైపులను కొండ నిలువునా నుండుటచే దానిపై కెక్కుటకష్టము. సుభాను ఆ పరిసరప్రదేశములను చీకటియందైనను సులభముగ చేరగలుగునట్లుగ పరికించి మగిడికోటకేతెంచెను. అతడు తన మనోభావముల నితరులకు వ్యక్తముకాకుండ తన పనియందు తాను నిమగ్నుడైయుండెను. మధ్య మధ్య రెండు మూడు పర్యాయములు మాత్రమేదో నెపమున కోట సింహద్వారము వద్దకేగి సుభానెచటికో వెడలనున్నాడనియు, తాను వచ్చువఱకును తన స్థానమున మరొకనిని నియమించినాడనియు దెలుసుకొనెను. సాయంకాలమైనపిమ్మట నాతడు కిలేదారువద్దకేగి నేటి రాత్రికి తాను సులతానుపుర మేగవలసియున్నదని చెప్పి శలవుగైకొనెను. తరువాత నాతడు సర్ఫోజీకి తెలియకుండ కొండ దిగి క్రిందనున్న గ్రామమును చేరెను. అతడు నడచుచు తనలో తానేదియో ఆలోచించుకొనుచుండెను బహుశః సర్ఫోజీకిని తనకునుగల పూర్వవైరమును జ్ఞప్తికి దెచ్చుకొనుచు నాతనిపై పగసాధించుట కాలోచించుచుండవచ్చును. ఆ యాలోచనలందే నిమగ్నుడై యాతడు పటేలు గృహమును చేరెను. పటేలు సిద్ధముగ నుండెను. కాని యాతని మనసుమాత్రము సిద్ధముగ

లేదు. అందుచే నాతడు సుభానునొక్కనినే వెళ్ళవలసినదిగ కోరెను. కాని సుభానందులకంగీకరించలేదు. చివఱకు పఠేలు బయలుదేరక తప్పినదికాదు. గామునికై ప్రతీక్షించకయే వారిరువురును బయలుదేరిరి. గ్రామపు పొలిమేర నతిక్రమించి యరణ్యమార్గమునబడిపోవుచుండిరి. అర్ధరాత్రియందు చీకటిలో పఠేలునకు మాటిమాటికిని ఎదురుదెబ్బలు తగులుటతో నాతని పూర్వ్యాలు జ్ఞప్తికి వచ్చుచుండిరి. ముండ్లు గ్రుచ్చుకొనుటవలన నాతని నోటివెంట నప్రయత్నముగనే భగవన్నామము వెడలుచుండెను. ప్రక్కనున్న సుభానాతనిని వారించుచుండెను. సుభాను మాత్రము మెల్లగ పఠేలుతో సర్ఫోజీ పన్నుచున్న కుట్రలనుగూర్చిన తన యుద్దేశ్యముల జెప్పుచుండెను. కాని పఠేలునకివి యన్నియు పట్టలేదు. అరణ్యము దట్టమైన కొలదియు నాతని బాధలతోబాటు నిశ్శబ్దముగనుండవలసిన యవసరముగూడ హెచ్చెను. ఇంతలో సుభానున కెదురుగ నెవరో వచ్చుచున్నట్లు తోచెను. ఆ వచ్చునతడు చిటిక వేసి-'సుభాన్జీ! ఇక మాట్లాడవలదు. అతడు వచ్చినాడు. గుఱ్ఱమును చెట్టునకు గట్టి యచట నిలబడియున్నాడు. సర్ఫోజీ యింతవఱకును రాలేదు. మీరు చెప్పులు విడచి అటునుండి వచ్చి చూడుడు!' అనెను. ఈ మాటలే చిన్ననోటినుండి వెలువడినవో వారిరువురును గుర్తించిరి. అలసియున్న కారణమున రాముడు నిద్రపోయియుండునని తామూహించిన యూహ యబద్ధమని గ్రహించిరి. వారి యాశ్చర్యమెక్కువయ్యెను.

వారిరువురును రాముడు చెప్పినట్లొనర్చిరి. చెప్పులు చేతబట్టి రాముని వెనుకనే నడువసాగిరి. కొంత దూరమేగిన పిమ్మట రాముడు—'పఠేల్జీ! ఇకముందు నడచుటకు వీలు లేదు. మనము వారు కూర్చుని మాట్లాడుకొను బండకు వెనుక జేరి పొంచి కూర్చుండవలెను. అచటి కెక్కుట కష్టము. మీ రిచటనే చెట్టుక్రింద కూర్చుండుడు. నేనును సుభానును ముందునకు వెళ్ళెదము'అనెను. పఠేలు మారుమాటాడక వెంటనే యంగీకరించెను. రాముడును సుభానును బయలు దేరిరి. కొండవెనుక భాగమునుండి యెక్కుట ప్రారంభించిరి. కొండ ఏటవాలుగ లేక నిలువుగనుండి యెక్కుటకు వీలులేకుండెనని మన మిదివఱలో చదివినాము. కాని వారిలోనున్న కుతూహలము, ఉత్సాహము వారిని పైకిలాగు కొని పోవుచుండెను. కొంత దూరమేగిన పిమ్మట సుభాను ఇక ముందునకు పోలేక యచటనే పొంచి కూర్చుండెను. అచటినుండియే యాతఁడు వారి సంభాషణను వినగలడు. రాముడు మాత్రము ఇంకను పైకేగి వారు మాట్లాడుకొనుబండకు వెనుకవైపుననున్న ఱాళ్ళ సందులో కప్పవలె కూర్చుండెను.

సర్ఫోజీకై ప్రతీక్షించుచున్న వ్యక్తి యిటునటు పచారులు చేయుచుండెను. సర్ఫోజీ యింతవఱకును రానందుల కాతనికి కోపము వచ్చెను. ఆ కోపముతో నాతడు సర్ఫోజీ మాతృ పితృ వంశముల తాత ముత్తాతలను సుశబ్దములతో జ్ఞాపకము చేసుకొనుచుండెను. ఆ ధోరణిలో సర్ఫోజికిని, కుక్క, పంది, గాడిద మున్నగు జంతువులకును అభేదమును

చెప్పుటగూడ మరువలేదు. ఇంతలో నెవరో కొండనెక్కి వచ్చు చుండిరి. అతనిని జూచినంతనే వాగుడు మఱింత హెచ్చినది. విశుద్ధమైన ఉర్దూభాషలోఁ దిట్టుచు,—కృతఘ్నుడా! నీ బాబు నిచట కూర్చుండబెట్టి యింత ఆలస్యమేల చేసితివి? ఈ కత్తితో నిన్ను ముక్కల క్రింద కోయుదును. దుర్మార్గుడా! నీవు చెప్పిన మాటలన్నియు యదార్థములని నేను నమ్మెదు ననుకొంటివా? అనెను.

భయముతో సర్ఫోజీ గుడ్డలుతడిసిపోయెను. వణకుచు—'ప్రభూ! నేను చెప్పిన మాటలో నబద్ధ మేమియు లేదు.'

'ఆ విశ్వాస ఘాతకుడైన యువకు డిక తిరిగి రాడనియు అందుకు వలయు యేర్పాట్లు గావింపబడినవనియు నీవు చెప్పిన మాటలు నిజమేనా?

'నిజమే! ఆ విషయములో మీా కనుమానమక్కరలేదు. నేను చేయుదుననిన పనిని చేసియే తీరుదును. అతడు పారి పోవుటకు నేనే సాయము చేసితిని. వాని కెచటికి పోవలసి నదియు, ఏ మార్గమున పోవలసినదియుగూడ చెప్పి పంపితిని. అతడు నేను చెప్పినట్లే వెళ్ళియుండును. ఆయన కింకను నావంటి విశ్వాసపాత్రుఁడైన సేవకుడు లేడనియే నమ్మకము. మీారా విషయమై ఆలోచించనక్కరలేదు. మీా భావికర్తవ్యమును నిశ్చయించుకొనుడు. ఇచట వ్యవహారములన్నిటిని నా హస్తగతమొనరించుకొంటిని. మీారు మీా ప్రయత్నములో నుండుడు. కాని......మఱి......'

"'కాని' యనుటలో నీ యుద్దేశ్యమేమో చెప్పుము. నీ కోరికలను, షరతులను బయటపెట్టుము. నీ వంటివారు ప్రపంచములో లేనియెడల...'అనుచు ఎందువలననో నాలుక నొక్కుకొని కొంచెమాగి — 'నీవు నీ పనిని నెఱవేర్చినచో తప్పక బహుమతి లభించగలదు. నీవు దానిని మాటిమాటికిని జ్ఞాపకము చేయనక్కరలేదు. నీతో నేను ముఖ్యముగా చెప్పిన పని పూర్తియైనదా ? ఇంతవఱకు నది పూర్తిగానిచో నీ వలన మా కేమియు సహాయము లభించలేదన్న మాటయే !"

"ఆపని చాల కష్టము. అనేక విధముల ప్రయత్నించుచున్నాను. కాని..."

"'కాని' అనునది నావద్ద పనికిరాదు. ముందాపని జరిగితీరవలసినదే ! ఇంతవఱకు చేసిన దేమున్నది? ఈమాత్రపు పనిని ప్రతివాడును చేయగలడు. నానాజీకి నీపై విశ్వాసము మెండనియు, వెళ్ళునప్పుడు అంతఃపురమును నీ కొప్పగించె ననియు చెప్పితివి కదా !"

సర్ఫోజీ యీ ప్రశ్నకు సమాధాన మీయలేదు. ఆ వ్యక్తి మఱల నా ప్రశ్న నే రెట్టించిన పిమ్మట భయముతో సర్ఫోజీ—"అవును. కాని ... కాని ... ఆ పని నెఱవేరునట్లు లేదు." అనెను. తరువాత కొంతసేపటివఱకు నిరువురును మౌనముగానుండిరి. ఇరువురు నొకరినొకరు చూచుకొనుచుండిరి. అంతయు నిశ్శబ్దముగ నుండెను. ఆకుకూడ కదలుటలేదు. కొంతసేపటి కా వ్యక్తి సర్ఫోజీతో — "సరే! వెనుక చెప్పి ట్లుగ వారముదినములలో పనియుంతయు పూర్తియగును.

కిలేదారువద్ద కొక యుత్తరము పంపుదును. దానితోబాటు నీకుగూడ కబురుచేతును. సుభాను పశేలుల విషయమై యేమి చేయవలెనో గూడ తెలియజేతును. ఈ లోపున నేవైన సమాచారము లున్న తెలియజేయుము. ఇక నీవు వెళ్ళవచ్చును” అని యాతడు బయలుదేరెను. ఇంతలో సర్ఫోజీ—“సర్దార్జీ! ఈ బండవెనుక నెవరో దాగియుండి మన సంభాషణను వినినారు” అని కేకవేసెను.

“విననిమ్ము! బ్రహ్మదేవుడు వినినను నాపనికి అడ్డులేదు. ఇక కోట నా చేతిలోనికి...“తరువాతి శబ్దములు వినబడలేదు. అప్పటికే యాతడు చాలదూరము వెడలిపోయెను. సర్ఫోజీ పిచ్చివానివలె నచటనే కొంతసేపు నిలువబడెను. రాముడు, సుభానును మెల్లగ క్రిందకు దిగిరి. సర్ఫోజీ తనదారి బట్టెను.

రాముడు, సుభానును చాలసేపటివఱకును నిశ్శబ్దముగ నడచి పశేలున్నచోటున కేగిరి. పశేలును వెంటనిడుకొని కొంత దవ్వేగిన పిమ్మట సుభాను తాను వినిన సంగతులన్నిటిని మెల్లగ పూసగ్రుచ్చినట్లు వర్ణించెను. సర్ఫోజీతో మాట్లాడుటకై వచ్చిన వ్యక్తి యెవ్వరో వారికి తెలియలేదు. హుజూరు దర్బారున తమకు పరిచితులైనవారి నందఱను జ్ఞప్తికి దెచ్చుకొనిరి. కాని వారికెవరైనది తోచలేదు. ముగ్గురును మెల్లగ చప్పుడు కాకుండ నడచుచుండిరి. రాముడు మాత్రము సుభాను పశేలుల సంభాషణను వినుటలేదు. అతని దృష్టి చాలదూరమున నుండెను. రాముడకస్మాత్తుగా—‘సుభాన్జీ! చూడుడు! కోటకు వెనుకవైపునుండి యెవరో

యిరువురు వ్యక్తులు దిగుచున్నారు. వారెవరో చూచివత్తునని చెప్పి యచటినుండి రివ్వున పరుగెత్తెను. రాముఁడా యిద్దరు వ్యక్తులను సమీపించెను. మెల్లగ వెనుకనుండి వారిని చూడ నెంచెను. కాని యాతని యాశ నిరాశయయ్యెను. వా రిరువు రును తమ శరీరముల నాపాదమస్తకము కప్పుకొని యుండిరి. వారు పురుషులో స్త్రీలోగూడ గుర్తించుట కష్టమయ్యెను. రామునకు వారి మాటలుగూడ వినబడలేదు. అందుచే నాతఁడేమైనను వారివెంటనంటి వారి విషయమును కనుగొన నెంచి కొంతతడ వచటనే యాగి మఱల వారి ననుసరించెను.

రాముడు త్రోవతప్పెనను భయములేదు. అందుచేతనే సుభాను పటేలు లాతనికై ప్రతీక్షించక బయలుదేరిరి. తెల్ల వారినంతనే యీ సమాచారము కిలేదారునకు తెలియజేయ వలెనని నిశ్చయించుకొనిరి. సుభాను ముందుగ నీ విషయము అప్పాసాహబుతో చెప్పవలెను. తరువాత పటేలు దానికి సాక్ష్యమిచ్చును. ఇట్లు నిర్ణయించుకొని వా రిరువురును తమ తమ యిండ్ల కేగిరి.

ఉదయమైనంతనే సుభాను సర్ఫోజీ యేమి చేయు చున్నాడో తెలుసుకొనుటకై సింహద్వారమువద్ద కేగెను. అతడు రాత్రియంతయు కష్టపడినవానివలె నిద్రించుచుండెను. సుభా నచటినుండి కోటలోనికేగి కిలేదారుతో రాత్రి జరిగిన విషయమంతయు నివేదించుటకు తగిన తరుణమునకై వేచి యుండెను. కొలదిసేపటిలో నాతనికి సరియైన సమయము చిక్కినది. అంత నతడు కిలేదారుతో విషయమంతయు పూస

గ్రుచ్చినట్లు వర్ణించెను. అప్పాసాహెబునకు భయము కలుగుటకును, సర్ఫోజీపై కోపము హెచ్చుటకును తాను కొంత కల్పించి విషయమునకు వన్నెదెచ్చెను. కిలేదా రిదియంతయు శాంతభావముతో వినుచుండెను. అతని ముఖాకృతియందేవిధమైన మార్పును లేదు. సుభానున కేమి చేయవలెనో తోచక మెల్లగ నచటినుండి నిష్క్రమించుటకై ప్రయత్నించుచుండెను. అంతలో కిలేదారు—'సుభానూ! నీవు నా విశ్వాసపాత్రుడవైన సేవకుడవు. నీవు నాకొక ముఖ్యమైన పని చేయవలసియున్నది. నీవు నాతో జెప్పిన విషయములు నా కిదివరకే తెలియును.' అని యింకేమియో చెప్పబోవుచుండెను. ఇంతలో లోపలినుండి సేవకు డొకడువచ్చి — 'అయ్యా! ఈ దాసీ లేదియో కబురు తెచ్చిరి. మాకు నమ్మకములేదు. వారు మాత్రము పద్మాబాయిగారు, దాసియగు రుక్కి కనబడుట లేదనుచున్నారు.' అనెను.

* * *

## ౫

వెనుకటి పరిచ్ఛేదమున జెప్పినట్లు బాబాజీ కొంతసేపు చలిమంటవద్ద కూర్చుని కీర్తనలుపాడి మఱల లేచి గుడిలోని కేగెను. సైనికుని జాడ కనుపించలేదు. అంత బాబాజీ ఆంజనేయ విగ్రహమును యథాస్థానమున నుంచి బయటనున్న నూతివద్ద స్నానాదికము లాచరించి కమండలము, భిక్షాపాత్రను దండమును గొని ప్రక్కనున్న గ్రామమున కేగి భిక్షాటన మొనర్చి తిరిగివచ్చెను. తిరిగి వచ్చునప్పుడాయన త్రోవలో కొంత గడ్డిని కూడ ప్రోగుచేసుకొని వచ్చి గుఱ్ఱము ముందు వైచెను. తాను మఱల చలిమంట వద్దకేరి గంజాయి పీల్చుచు రామనామ స్మరణ చేయ మొదలిడెను. రాత్రి నాలుగైదు ఘడియలు గడచెను. ఇంతలో నెవరో వచ్చుచుండుటను చూచి బాబాజీ—'ఏమి? నేడుకూడ ఒంటరిగా వచ్చితివేమి ?' అనెను.

ఇంతలో నా వ్యక్తి బాబాజీని సమీపించెను. అతని వేషము గ్రామీణునివలె నుండెను. నల్లని రూపము. యువకుడే, కాని మోటువానివలె నుండెను. అతడు వచ్చి బాబాజీకి నమస్కరించి—'వారు నేటిచటికి వచ్చునట్లు లేదు.' అనెను.

"కారణమేమి? నేను తప్పక రావలసినదే! వారివద్ద నుండి యేమైనను కబురు వచ్చినదా?' యని బాబాజీ ప్రశ్నించెను.

"లేదు కాని వారేదియో ప్రయత్నములో నున్నట్లు తోచుచున్నది. మధ్యాహ్నము అందఱకును రాత్రి కెవరును ఆలయమువద్దకు పోవలదని యాజ్ఞాపించిరి. తమరు వారికై ప్రతీక్షింతురేమోయని నేను మీవద్దకు వచ్చితిని."

బాబాజీ కొలదిసే పేదియో. ఆలోచించి— 'సరే! సోమోజీ! నీవు వెళ్లుము. వారితో శ్రేపైనను తప్పక యిచటికి రావలసినదిగా చెప్పుము. నేడే వచ్చిన బాగుండెడిది. కాని మించిపోయినదిలేదు." అని యాతనిని పంపివేసి గుడిలోని కేగి తలుపులు బిగించి ఆంజనేయ విగ్రహమును కదిల్చి లోనికేగ బోవునంతలో నెవరో తలుపు దట్టిరి. బాబాజీ తలుపు తెరచి చూచుసరికి తన వేషములోనున్న మరియొక బాబాజీ కనుపించెను. అంత మన బాబాజీ—'ఏమి? ఇంత త్వరలో మఱల తిరిగి వచ్చితివేమి?' అని ప్రశ్నించెను.

"ఇంతకు పూర్వము తమతో చెప్పిన విషయము నిజమేనని త్రోవలో రూఢిగా తెలిసినది. అందుచేత మఱల తమతో చెప్పుటకు వచ్చితిని. సులతానుగఢపు కిలేదారుగారి——"

అతని మాటలు పూర్తికాక పూర్వమే మన బాబాజీ "మూర్ఖుడా! ఈ విషయమునకై మరల తిరిగి రావలెనా! ని న్నేపనికై పంపితినో యాపని చూడవలెనుగాని యితర విషయము నీ కనవసరము. చెప్పిన పనిని వదలి మరియొక పనికి బూనుకొనినచో నేపనియు పూర్తికాదు. నీవుచెప్పిన విషయము నాకిదివఱకే తెలియును. ఈపాటికి నీవచటికి చేరి యుండవలసినది. సరే! ఈనాటికిచటనే యుండి ఉదయమే లేచి వెళ్ళుము" అనెను. పాపమూరెండవ బాబాజీ ముఖమున నెత్తురుచుక్కలేదు. తానీ వార్త గొనివచ్చినందులకు బాబాజీ సంతోషించునని తలచెను. కాని యట్లు జరుగలేదు. అతని ముఖమును జూచి మన బాబాజీ మెల్లగ—"పిచ్చివాడా! మనసు చిన్నబుచ్చుకొనకుము. మనము క్రమశిక్షణతో ప్రవర్తించవలెను. నీవు తెచ్చిన కబురు నాకిదివఱకే తెలియును. ఒకవేళ తెలియక పోయినను మరెవ్వరైనను చెప్పి యుండెడివారు. నీవు కొని వచ్చిన విషయమునకు నిదర్శనము చూపెదను రమ్ము" అని గుహలోనికి గొంపోయి యచట నిద్రించుచున్న మహారాష్ట్ర వీరుని చూపి చెవులో మెల్లగ— 'నిన్నటి రాత్రి యిచ్చటికి వచ్చినాడు. అతడు స్వయముగ నిచటికి వచ్చిన తరువాత నీ వార్త లెందుకు?' అనెను. ఇంతలో నెవరో ఆలయమున కేతెంచుచున్న చప్పుడు విన బడెను. అంత మన బాబాజీ రెండవవానితో నీవు వెళ్ళి వారి నచట కూర్చుండబెట్టి యవసరమైనచో నన్ను పిలువుమని పంపివేసెను. అంత నాతడు పైకివచ్చి విగ్రహమును యథా స్థానముననుంచి బయట కూర్చుండెను.

ఇంతలో నిరుపృత బైరాగులు 'జై వీరహనుమాన్' అనుచు వచ్చిరి. అందొకడచటకూర్చొనియున్న బాబాజీతో 'అయ్యా! ఇచటి బాబాజీగారెచటికి వెళ్ళిరి?' అని యడిగెను. మన బాబాజీకేమి చెప్పుటకును తోచలేదు. అతడు-'వీరెవరై యుందురు? నిజముగ వీరు బైరాగులేనా? లేక నావలె గురూజీ యనుచరులై యుందురా? ఇపుడు గురువుగారిని పిలువవలెనా? కూడదా?' యని యాలోచించుచుండెను. ఒకవేళ పిలువవలసివచ్చినచో వీరి యెదురుగనే గుహాద్వారము తెరువవలసి వచ్చునుగదా యని యతడనుమానించుచు క్రొత్తగ వచ్చినవారిని పరీక్షించుటకై - 'మీకు చెప్పిన పని పూర్తియైనదా? సమాచారమును గొనివచ్చితిరా?' యని ప్రశ్నించెను.

అంత నా బైరాగులలో నొకడు తొట్రుపడుచు — 'మాకెవరు పనిచెప్పిరి? మేమేమి సమాచారము గొని వత్తుము? మేమూరకనే యిచటకు వచ్చితిమి. మాకు బాబాజీతో పరిచయమున్నది. అప్పుడప్పుడు వచ్చి గంజాయి త్రాగి పోవుచుందు'మని బదులు చెప్పెను.

అంత నా బాబాజీ వీరు నిజమైన బైరాగులు కారనియు మనవలెనే గురూజీ గుప్తచరులై యుందురనియు తలచి 'బాబాజీ యెచటికేగిరో తెలియదు. నేనును వారికొరకై ప్రతీక్షించుచున్నా'ననెను.

అంత నొకడు రెండవవానితో - 'పద మన మాచలి మంటవద్దకేగి గంజాయి త్రాగుదము. ఈ లోపుగ బాబా

నత్తును.' అని లోనికేగెను. బాబాజీగూడ వారివెంట లోని కేగెను వారు ముగ్గురును చలిమంటవద్దజేరి మాట్లాడుకొను చుండిరి. ఇంతలో నకస్మాత్తుగ ఆంజనేయవిగ్రహము ముందుకు జరుగుచుండెను. బైరాగు లీ విషయమును చూచిరికాని వారి ముఖమున నాశ్చర్య చిహ్నములగుపించ లేదు. అంత బాబాజీ వీరుగూడ మన శిష్యకోటిలోనివారని గ్రహించెను. వెంటనే గుహాద్వారమువద్దకేగి బాబాజీతో నిరువురు బైరాగులు వచ్చి నారని చెప్పెను.

బాబాజీ మహారాష్ట్రవీరునితో బాటు బైరాగులను సమీపించి అందొకని వీపుపై తట్టి - 'సమాచారములేమి?' అని యడిగెను. మన మహారాష్ట్రవీరునకిదియంతయు నాశ్చర్య ముగ నుండెను - 'ఈ బైరాగులెవరు? బాబాజీకి ఈ బైరాగులతో పనేమి?' అతనికేమియు తోచలేదు.

బాబాజీ యడిగిన ప్రశ్నకు సమాధానమిచ్చుటకు బైరా గులు అనుమానించుచుండిరి. బాబాజీ యిది గ్రహించి రెండవ బాబాజీతో - 'బలరాంజీ! వీరిని గుఱ్ఱమువద్దకు గొనిపొమ్ము. పాపమది వీరికై దిగులుపడినది.' అనెను. అంత బలరాంజీ మహారాష్ట్రవీరుని వెంట నిడుకొని బయటికేగెను.

వారు బయటకేగినంతనే బాబాజీ - 'చెప్పుము. నీ వి తనిని గుర్తించితివా? సమాచారమేమో త్వరగా చెప్పుము!' అనెను.

అంత బైరాగి - 'మూడు నాలుగు దినములలో సుల తాను గఢమునకు గొప్ప విపత్తు రానున్నది. ఈపాటికి చక్రవర్తి

వద్దనుండి కిలేదారునకు ఉత్తరము తెచ్చియుండును. "మనము పటేలు, సుభానులను మనవైపునకు త్రిప్పుకొనవలెను. నానా సాహెబెచటికి వెళ్ళినది తెలియలేదు. చాలమంది బహుశః మీవద్దకు..." అనుచుండగనే బాబాజీ వానిని వారించెను. బలరాంజీతోబాటు మహారాష్ట్రవీరుడు తిరిగి వచ్చుటను బాబాజీ చూచెను. వెంటనే బాబాజీ బైరాగులను మీ పనులు చూచుకొనుడని చెప్పి పంపివేసెను. మహారాష్ట్రవీరునకిది యంతయు నాశ్చర్యముగ నుండెను. అతడు బాబాజీ వెంట భూగృహమునకేగి - "బాబాజీ! మీ విషయము చూడ నా కాశ్చర్యమగుచున్నది. ఈ సాధువు లెవరు? ఈ బైరాగు లెచటనుండి వచ్చిరి? ఈ భూగర్భ గృహము! ఇందు జగదంబ మందిరము! ఆ మందిరమున నసంఖ్యాకలైన యాయుధములు! ఇవి యన్నియు నెచటినుండి వచ్చినవి. మీరేదియో రాజకీయ కార్యమును సాధింపనెంచినట్లున్నది. నన్నిచట నేమి చేయమందురు? నాకిచట నేమియు తోచుటలేదు. మీరు సాధింపదలచిన కార్యము మాతృదేశ విముక్తికుపకరించునెడల మీ యనుచరులలో నన్నుగూడ నొక సేవకునిగ నొసర్చుకొనుడు." అని ప్రార్థించెను.

ఇది విని బాబాజీ - "వత్సా! త్వరపడకుము. కొన్ని విషయములు విని తెలుసుకొనుటకంటె స్వయముగ చూచి తెలుసుకొనుటకు మిక్కిలి యందముగా నుండును. రేపు సాయంకాలమువఱకు నోపికపట్టుము. అన్ని విషయములను వేసి

తెలుసుకొనగలవు. నీ మనోవాంఛితమును నెఱవేఱగలను. ఈ చాపపై పరుండి రాత్రి గడుపుము.' అనెను.

పాపమాతడు చేయునది లేక చాపపై పరుండెను. నిద్ర పోవుటకు చాల ప్రయత్నించెను. ఆతని ప్రయత్నములన్నియు విఫలమయ్యెను. కౌతూహలపూర్ణమైన మనసునకు నిద్రపట్టునా? ఎట్లో కష్టముమీద రాత్రి గడచెను. సూర్యోదయమైనది. బాబాజీ వానిని తనవెంట గొనిపోయి స్నానాదికములైన పిమ్మట – 'నీ విచటనే యుండుము. నేనుపోయి భిక్షాటన మొనరించివత్తును. నీభోజనమునకు వలయు యేర్పాటుగావింప బడినది. నీ యశ్వమునకుగూడ గడ్డి వచ్చును. నేను వచ్చు నంతవఱకును నీ విచటనే యుండుము.' అనెను.

మన వీరున కా గుహాయందొంటరిగ పనిలేక కూర్చుం డుట అసహ్యమయ్యెను. బాబాజీతో తానుకూడ ప్రక్క గ్రామమునకు వత్తుననెను. కాని బాబాజీ—'నీవు వచ్చుటకు వీలులేదు. నీకై చాలమంది వెదకుచున్నారు. సాయంకాలము వఱకిట్లే యోపికపట్టుము. తరువాత నీ కోరిక నెఱవేర గలదు' అని చెప్పుచుండగనే యొక బ్రాహ్మణుడు పళ్ళెర మందాహార పదార్థముల నిడుకొని వచ్చెను. అతడు బాబా జీతో — 'వెంకడు గడ్డికొఱకు వెళ్ళినాడు వచ్చుచునే యుండును.' అని చెప్పి స్వామికి నైవేద్యముపెట్టి యా పళ్ళె రము మన వీరుని ముందుంచెను. బాబాజీ భిక్షాటనకై వెడలి పోయెను. ఆకలి యగుటవలన మన వీరుడా పళ్లెరమునందలి

పదార్థముల నన్నిటిని ఆరగించెను. బ్రాహ్మణుడా ఖాళీపళ్ళె రముంగొని వెళ్ళిపోయెను.

మధ్యాహ్నము మూడుగంటలైనది. కాని, భిక్షాటనకై వెళ్ళిన బాబాజీ తిరిగిరాలేదు. మహారాష్ట్రవీరున కేమియు తోచుటలేదు. అతని మనసు పరిపరివిధముల నాలోచించు చుండెను.—"ఈ బాబాజీ యింకను రాలేదేమి ? ఆలస్యము నకు కారణమేమై యుండును ? ఇచటికి సాయంకాల మెవ రైనను వత్తురా ? బాబాజీ మాటిమాటికిని సాయంకాలము వఱకు నోపిక పట్టుమనుచున్నాడే ! ఇతఁడు విశ్వాసఘాత మొనర్పడుగదా ! నన్ను శత్రువుల కొప్పగించునేమో ! మన మిచటినుండి త్వరలో వెళ్ళిపోవుట మంచిదేమో !" అనుకొను చుండగనే భిక్షాటన మొనరించి బాబాజీ తిరిగివచ్చెను. అతడు బాబాజీతో లోనికేగెను.

రెండుమూడు ఘడియలు గడచినవి. ఇంతలో దూర మున నెవరో మనుష్యులు వచ్చుచున్నట్లు గోచరించెను. వారి చేతులలో కాగడా లున్నవి. ముగ్గురు నలుగురు మాత్రము గుఱ్ఱములపై నధిరోహించియుండిరి. మిగిలినవారు నడచు చుండిరి. వారు గుడివైపునకే వచ్చుచుండిరి. వారు శత్రు వులో మిత్రులో మన వీరునకు బోధపడలేదు. అతఁడు వెంటనే లోనికేగి యెవరో వచ్చుచున్నారని బాబాజీతో చెప్పెను. బాబాజీ యేమియు ననలేదు.—'రానిమ్ము. వచ్చిన తరువాత యెవరో తెలియునుగదా !' అనెను. ఇంతలో 'భవానీకి జై' అను శబ్దము వినవచ్చెను. మన మహారాష్ట్రవీరుడు వారివైపు

తదేకధ్యానముతో జూచుచు బయట నిలువబడియుండెను. ఆ వచ్చినవారందరును తనవంటి మహారాష్ట్రీ యులే!

ఆ సమూహమున చాలమంది గలరు. అందఱకును ముందు ఇరువురు యువకులు కాగడాలు పుచ్చుకొని నడచు చుండిరి. వారి వెనుక నలుగురైదుగురు సైనికులు నడచివచ్చు చుండిరి. వారివెనుక నొక యువకుడు గుఱ్ఱముపై వచ్చు చుండెను. ఆ యువకుని శరీరము పచ్చగను, నేత్రములు విశాలముగను, తీక్ష్ణముగను నుండెను. అతని ముక్కు గరుత్మంతుని ముక్కువలె నుండెను. అత డధిరోహించిన గుఱ్ఱము గూడ మంచి జాతికి జెందినదే! ఆ యువకుడు ముఖమును ప్రక్కకుత్రిప్పి ప్రక్కనున్నవారితో మాట్లాడుచు వచ్చు చుండెను. అతని ప్రక్కన ఇరువురు యువకులు గుఱ్ఱములపై వచ్చుచుండిరి. వారును సమాన వయస్కులే! ఒకటి రెండు సంవత్సరముల హెచ్చుతగ్గు లుండవచ్చును. వారి వెనుక పది పండ్రెండుమంది కాలినడకను వచ్చుచుండిరి. వారందఱును మంచి బలిష్టులు. వారు దగ్గఱకు వచ్చుచున్నకొలదియు గుడిలోని వీరున కాశ్చర్య మెక్కువయ్యెను. — 'వీరెవరు? ఇచటికి వచ్చుటకు గల కారణమేమి? బాబాజీ కొఱకు వచ్చి యుండిరా? అయిన వీరి సంబంధ మెట్టిది?' అతని యాలో చనలు తెగలేదు. ఇంతలో ఉత్తమాశ్వముపై నెక్కిన యువకు డాతని సమీపించి —'శ్రీధరస్వామి యెచట నున్నా' రని ప్రశ్నించెను. అతడు సమాధాన మిచ్చు పరిస్థితిలో లేడు. అతని సమాధానమునకై ప్రతీక్షించకయే నవయువకు

డును, అతనితో గుఱ్ఱములపై వచ్చిన మరి యిరువురును లోని కేగిరి. ఆ యువకుడు లోనికేగి ఆంజనేయునకు సాష్టాంగ మాచరించి చలిమంటవద్దనున్న బాబాజీకి నమస్కరించిరి— 'స్వామీ! మీరిచటనే యుండిరే! తమ శ్రీచరణముల కర్పించుటకై కానుకలు గొనివచ్చితిమి.' అని ఈత డెనడను నట్లు మన మహారాష్ట్రవీరునివైపు చూచెను. అంత బాబాజీ నవ్వుచు—'అతడు నీ తరగతికె జెందినవాడే!' అనెను.

కొంతసేపు ఆగి నవయువకుడు బాబాజీతో — 'తమ దయతోబాటు ఇట్టి యువకులు లభించినచో నా మహాపురుషులు నాచే చేయించదలచిన కార్యము త్వరలోసిద్ధింపగలదు. కాని నే చేయుపని నా తండ్రి కేమాత్రమును యిష్టములేదు. ప్రతిదినమును వారివద్దనుండి నన్ను వారించుచు ఉత్తరములు వచ్చుచునే యున్నవి. ఐనను నా నిశ్చయమునుండి మఱలను. నేడు కొంత సొమ్ము చేజిక్కినది. తమరు స్వీకరించుడు. ఢిల్లీకి ఖజానాను పంపుచుండగా మేము దోచి లాగుకొని వచ్చినాము. ఇది వారి బాబు సొమ్మా? బీదల నందరిని దోచి ఢిల్లీకి గొని పోవుచున్నారు. త్రోవలో కాచి వారి నందరను పారద్రోలి యీ ధనమును తెచ్చితిమి.' అనెను.

శ్రీధరస్వామి యిది యంతయు మాట్లాడకుండ విని — 'ఈ వినయమే నీకు భూషణము. నిన్న మీరొనర్చిన దాడిలో నీ యిరువురి పరాక్రమమును నాకు ముందే తెలిసినది. కాని, ఇదిగో! ప్రతి పనికిని నీవు ముందుగ నుండవద్దు. నీవు వీరికి

నాయకుడవు. వీరిని నడపుచుండుము. నీవు చాల జాగ్రత్తగ నుండవలెను సుమా!' అనెను.

అంత నా నవయువకుడు "స్వామీ! భవానీమాత దయతోబాటు మీదయ యున్నంతవఱకును నాకు పరవా లేదు." అనెను.

ధనముతో నిండియున్న పెట్టెలన్నియు భూగృహము నకు జేర్చబడెను. నవయువకుడు, అతని యిరువురు అనుచరులు, బాబాజీ, మన మహారాష్ట్రవీరుడు తప్ప మిగిలిన వారందరును బయటకు వెడలిపోయిరి. అంత బాబాజీ నవయువకునితో మన మహారాష్ట్రవీరుని చూపుచు – 'నీ యిరువురి ప్రాణస్నేహితు లతోబాటు ఇతనినిగూడ స్వీకరించుము. ఇతడుకూడ మాతృ భూమికై ప్రాణములర్పింప సిద్ధపడియున్నాడు' అనెను. ఆ నవ యువకుడా వీరునివైపు కొకసారిచూచి – 'చిత్తము. మీరాజ్ఞ యిచ్చిన తరువాత నీతని విషయమై నేనిక ప్రశ్నించను.' అని మన మహారాష్ట్రవీరునితో – 'సోదరా! వింటివిగదా స్వామి యాజ్ఞ! నేటినుండి మనమిరువురము సోదరులము. నేనిచటి నుండి వెళ్ళునప్పుడు నాతోగూడ రమ్ము' అనెను.

కొంతసేపయిన తరువాత శ్రీధరస్వామి యా నవ యువకుని యిరువురు అనుచరులకును సంకేతమొనర్చెను. అతడు సంకేతమును పొందుటతోడనే ద్వారమువద్దకేగి మిగి లిన తమ యనుచరులతో 'స్వామీజీ యేదో రహస్యముగ మాట్లాడదలచినారు. మీరందరును నిశ్శబ్దముగ నుండుడ'ని చెప్పి, యొక స్థూలకాయునితో 'నీవు సీమాఘూలు పని చేయు

చుండుమ'ని చెప్పెను. తరువాత శ్రీధరస్వామి యాంజనేయు నకు ప్రదక్షిణ మొనరించి భూగృహమునకేగెను. అతనివెంట నవయువకుడును, అతని యిరువురు అనుచరులును గూడ లోని కేగిరి. మన మహారాష్ట్రవీరుని మాత్రమచట నే వదలిరి. కొంత సేపటికి శ్రీధరస్వామి నవయువకునితో — 'నీకొప్పగించిన యువకుని విషయమై నీవేమియు ప్రశ్నించకపోవుటకు కారణ మేమి? అతనిని నీవెట్లు నమ్మితివి?' అని ప్రశ్నించెను. అంత నాతడు - 'స్వామిజీ! అతనిపై భవానీమాత కరుణ పూర్తిగ నున్నట్లు నాకు తోచినది. పైగా తాము శల్యపరీక్ష యొనరించి గాని నాకొప్పగించియుండరు. అందుచేత నే నేను పరీక్షించ లేదు' అనెను. ఇది విని శ్రీధరస్వామి యా వీరుని గుఱించి యువకుని కేదియో రహస్యము చెప్పెను. దానిని వినుట తోడనే నవయువకునికాశ్చర్యము కలిగెను కాని, తన యాశ్చ ర్యమును మాటలలో ప్రకటించలేదు. తరువాత శ్రీధర స్వామి పైనున్న వీరునిగూడ లోపలికి పిలిపించెను అందరును భవానీ మందిరమున జేరిరి.

అచటికి జేరినవెంటనే యువకుడు పూర్వపరిచితుడైన వీరునితో - 'సోదరా! ఇక మనమిచట మన వాస్తవికస్థితిని దాచనక్కరలేదు. మనము దాచినను మన విషయమంతయు స్వామిజీకి తెలియును. వారు నాకంతయు చెప్పిరి. అందుచే నిన్ను నేనింకేమియు నడుగను. నీవు వచ్చిన తరువాత నచట జరిగిన విషయములను తెలుసుకొనవలెనని నీకు కోరికయుండ వచ్చును. నీకావిషయము తప్పక......' అని యింకేదియో

చెప్పుచుండగనే శ్రీధరస్వామి - "ఆ విషయములు తిరువాత చెప్పుకొనవచ్చును. ముందిచటి పనులను నిర్వర్తింపుడు" అనెను.

అంత నా యువకుడు భవానీ మాతకు ప్రదక్షిణ మొనరించెను. అతనికా సమయమున మిగిలిన విషయములు స్ఫురణయందు లేవు. అతని ముఖముననొక విచిత్రమైన తన్మయత్వము గోచరించుచుండెను. అతడేకాగ్ర దృష్టితో దేవి వైపునకు చూచుచుండెను. అతనికి బాహ్య జ్ఞానము లేదు. దేవి యెదుట మోకరించి యుండెను. అతని నోటినుండి యా తన్మయావస్థలో నప్రయత్నముగ—"విపత్తి సంభవింప నున్నది—కాని పరవాలేదు - యవనులు ప్రబలులై యున్నారు - కొంచెము సాహసము చూపినచో...…" అను శబ్దములు మాత్రము వెలువడెను. శ్రీధరస్వామియు మిగిలిన వారును ఆ శబ్దములు వినిరి. కొంత సేపైన తరువాత నా యువకుడు ప్రకృతస్థుడయ్యెను. అప్పుడు శ్రీ ధరస్వామి తన్మయావస్థలో నాతని నోటివెంట వచ్చిన మాటలాతనికి చెప్పెను. మహారాష్ట్ర వీరునకిది యంతయు స్వప్నమువలె నుండెను. నవయువకుడు మన వీరుని జూచి—'భవానీమాత సాక్షిగా మాతృభూమిని రక్షించుటకును, హిందూమతోద్ధరణ కును ప్రాణములు నైత సమర్పింతునని ప్రతిజ్ఞ చేయుము' అనెను. వీరుడట్లే ప్రతిజ్ఞ చేసెను.

తరువాత నవయువకుడు శ్రీ ధరస్వామితో— "స్వామిజీ! మనపై దేవి కరుణాకటాక్షమున్నంత వఱకును

పరవాలేదు. పట్టుదలతో పని చేసినచో కార్యసాఫల్యము తప్పదు. కష్టములురాక మానవు. కాని వాటి నతిక్రమించుటయే పురుష లక్షణము" అనుచుండగ నెవరో తలుపు త్రోయుచున్న ధ్వని వచ్చెను. శ్రీధరస్వామి యనుజ్ఞ గొని యువకుని యనుచరులలో నొకడు ద్వారమువద్దకు వచ్చి తెరచెను. అచట పహరా నిచ్చుచున్న వెంకన్న అతనితో—"దూరము నుండి మహమ్మదీయ సైనికులు వచ్చుచున్నారని వార్త వచ్చినది. వారిచటకే వచ్చుచున్నారట. మన విషయము వారికి తెలిసియుండ వచ్చును. గుడిని ముట్టడించుటకై వచ్చుచున్నా"రని చెప్పెను. అతడీ విషయమును శ్రీధర స్వామికెఱిగించెను. ఇది విని నవయువకుడు—'స్వామిరాజీ! ఇది వారినెదుర్కొనుటకు తరుణముకాదు. కావునపైకేగి పైనున్న వారినందరను రేపు రాత్రివఱకు ఎచటికైన పొమ్మని చెప్పుట మంచిది. మన విషయము మనము చూచుకొందము' అనెను.

శ్రీధరస్వామి వెంటనే పైకి వచ్చి అచటనున్న వారి నందరను పంపివేసెను. ఆజనేయ విగ్రహమును సరిగనుంచి చలిమంట వద్దజేరి రామనామము మొదలుపెట్టెరు.

* * *

## ౬

అది సంధ్యాసమయము. సూర్యుడస్తమింపనుండెను. సూర్యభగవానుడు తన సంధ్యారుణ కిరణములతో తన నిష్క్రమణమును సూచించుచుండెను. అట్టి సమయమున సుభాను, రాముడు కలసి యరణ్య మార్గమున బడిపోవుచుండిరి. సుభాను మాటిమాటికిని తన మొలలోనున్న యొక ఉత్తరమును పైకితీసి చూచి మరల దాచుచుండెను. బహుశః అది కిలేదారిచ్చి పంపినదై యుండవచ్చును. ఎంత నడచినను అరణ్యము తరుగుటలేదు. అంత సుభాను రామునితో—"ఇంకెంత దూరమున్నది? నేనటు పోవుదమన్న నీవిటు దగ్గఱ త్రోవయున్నదని తీసుకొని వచ్చితివి. దారి తప్పితిమేమో! దారి తప్పించితివా నీ యెముకలు విరిగినట్లే!" అనెను.

"దాదాజీ! మనము త్రోవ తప్పలేదు. ఈ త్రోవలు నాకు క్రొత్తకాదు. కండ్లకు గంతలు కట్టినను తీసుకొని పోగలను" అనెను.

సూర్యుని ప్రకాశము అంధకారమున లీనమైపోయెను. నలుదిక్కులను చీకటులు వ్యాపించెను. త్రోవకూడ కని పించుటలేదు. రాముడు ముందు నడచుచుండెను. సుభాను అతని వెంట నడచుచుండెను. దూరమున మాత్రమేదియో చిన్న దీపము మిణుకు మిణుకు మనుచుండెను. దానిని చూచుట తోడనే వారికి గొంత యాశ జనించెను.

రాముడు :— దాదా! అదియే మన మేగబోవు గ్రామము. మనమీ రాత్రికి గ్రామములో ప్రవేశించుటకన్న గ్రామము వెలుపలనున్న శివాలయములో రాత్రి గడిపి తెల్ల వారుఝామున యూరిలో ప్రవేశింతము. అట్లైయినచో మనల నెవరును చూడరు.

సుభాను :— సరే! అటులనే కానిమ్ము. ముందు శివాలయమువద్దకు దారితీయుము.

కొలది ఘడియల కిరువురును శివాలయమును సమీపించి లోనికేగి చూచిరి. లోపల నెవరునులేరు. అంతయు నంధకారమయమైయుండెను. ఆలయ ప్రాంగణముననొక బావి కలదు. ఇరువురును ఆ చీకటియందే ఆలయమున పండుకొని అలసియున్న కారణమున నిద్రించిరి. వారు గాఢనిద్రలో మునిగిపోవుటచే బాహ్యజ్ఞానమే లేకుండెను.

అట్లు మూడు నాలుగు ఘడియలు గడచినంతనే దూర మున నెవరో ఆలయము వైపునకు వచ్చుచున్నట్లు కనుపించెను. ఇంతలో చంద్రుడుకూడ ఆకసమున తన యాగమనమును తెలుపుటకై తన తొలికిరణముల బంపెను. కొలదిసేపటికా

యిరువురి ఛాయలు వెన్నెలలో ఆలయప్రాంగణమునబడెను. వారిరువురును మందిరమున భయముతో నడగిడిరి. ఆ వెన్నెలలో నా యిరువురు వ్యక్తులలో నొకడు పురుషుడని వేరొకతె స్త్రీ యనియు స్పష్టముగ గోచరించుచుండెను. స్త్రీ కంటె పురుషుడు చాల అందముగ నుండెను. అతడు యువకుడు. పచ్చని శరీరచ్ఛాయతో విశాలమైన నేత్రములతో పెద్ద తలపాగా చుట్టియుండెను. సుమా రిరువది సంవత్సరముల వయస్సుండును. అతని ముఖ మాకర్షణీయముగనుండెను.

స్త్రీవయసులో నతనికంటె నాలుగైదు సంవత్సరములు పెద్దది. నల్లని శరీరము, సంభాషణా వైఖరినిబట్టి నీచకులస్థురాలని వ్యక్తమగుచుండెను. ఇరువురును క్రూరమృగములు గాని లేక శత్రువులుగాని వెంబడించుచున్నట్లు బెదురుచుండిరి.

పురుషుడు:—మన మీ రాత్రికి యీాలయమున గడపుటయే మంచిది. ఈ చీకటిలో నడచుటకు నాకు భయముగ నున్నది. లోనికేగి చూతము.

స్త్రీ:— ఇదియేనా నీ ధైర్యము! వేషపు పసయే గాని...

పురుషుడు:—"ఛీ! నోరు మూాయుము! లోనికి పద. ఎవరైనను విందురు." ఇరువురును లోనికేగి తొంగిచూచిరి. అంతయు చీకటిగ నుండెను. సుభాను గుఱ్ఱుపెట్టి నిద్రించుచుండెను. అతని నోటినుండి వెలువడిన గుఱక విని యిరువురును వెనుకకు తగ్గిరి. వారి కది క్రూరమృగ గర్జనవలె నుండెను. వారు ప్రక్కకొదిగి, గోడనంటుకొని పొంచియుండిరి. నాలు

గైదు నిముషములు గడచిన పిమ్మట సుభాను లేచి 'యా ఖుదా! యా అల్లా!' యనుచు కండ్లు నులుముకొనుచుండెను. అతడు లేచుటతో వీరిరువురి భయమును ఎక్కువయ్యెను. అతని స్వరము వారికి పరిచితమైన దానివలె గోచరించెను. అందుచే వారింకను ఒదిగి దాగియుండిరి.

సుభాను నిద్రనుండి మేల్కాంచి రాముని లేపి బయలు దేరెను. బయటనున్న యిరువురును భయముతో పారిపోవ నెంచిరి. కాని వారు తమ్ము వెంబడింతురను భయముతో ప్రక్కకుపోయి దాగిరి. సుభాను రాముని లేపి పయన మయ్యెను. వారు బయటకు వచ్చుటతోడనే దాగియున్న వారిరువురును సుభానును, రాముని గుర్తించిరి. సుభాను గాని, రాముడుగాని వారిని చూడలేదు. సుభాను కొంతదూర మేగిన తరువాత 'బ్రతుకు జీవుడా' యనుకొనుచు, ఇరువురును లోన బ్రవేశించిరి.

సుభాను ముందు నడచుచుండెను. రామునకు మాత్రము తాము బయటకు వచ్చిన తరువాత నెవరో తొంద రగ లోని కేగినట్లు అనుమానము కలిగెను. అందుచే నాతడు మాటిమాటికిని వెనుతిరిగి చూచుచు నడచుచుండెను. వారెవరో చూచి రావలెనని యాతనికి కోరిక కలిగెను. కాని సుభా నందుల కంగీకరించడని యాతని భయము. అతని బాల జిజ్ఞాస కావిషయమును పూర్తి తెలుసుకొనిననేగాని తృప్తి లేదు. రాముని వైఖరి జూచుటకు సుభానునకు తీరికలేదు. అత డనేక భావపరంపరలలో నూగులాడుచుండెను. —

"ఇప్పుడు నేను చేయవలసిన పనియేమి? అయ్యో! మన కిలేదారున కెంతటివిపత్తు సంభవించినది? పుత్ర వియోగముతో బాటు సులతాను దౌర్జన్యములు గూడ మితిమీరి యాతనిని బాధించుచున్నవి. ఈ యుత్తరమువలననైనను పని జరుగునో లేదో! ఈ సులతానున కింతటి ద్వేషమేల? హిందువులనిన బద్ధవైర మెందులకు? హిందూ ముసల్మానులు సోదరులవలె జీవించలేరా? నేను మహమ్మదీయుడనైనను కిలేదారు నన్నెంత గౌరవించుచున్నారు! పాపము! నానాసాహ బేమయ్యెనో తెలియలేదు. దానికితోడు పద్మాబాయి యంతర్ధానము! విపత్తు లెన్నడును ఒంటరిగ రావు. సులతాను గథమున కెంతటి దుర్దినము లాసన్నములైనవి! దీనికంతకు సర్ఫోజీ కారకుడు. వానిని వధించి తీరవలెను. చీమలచెట్టునకు కట్టి చిత్రవధచేసినను పాపములేదు."

ఇక రాముడు - "ఆ గుడిలోని కేగిన వ్యక్తులెవరై యుందురు? వారిని చూచినచో నెంత బాగుండెడిది! యీ సర్ఫోజీ వెంటలేనిచో చూచివచ్చెడివాడనుగదా!' యనుకొనుచుండెను.

ఇంతలో దూరమున నేదో ధ్వని వినిపించెను. లేబచ్చిక మేయుచు సవ్వడి విని చెవి నిక్కించి యాలించు కుందేటిపిల్లవలె రాముడాధ్వని నాలకించెను. దూరమున నాతనికి గొంతమంది వచ్చుచున్నట్లు కనుపించెను. రాముడు సుభానుతో - 'దాదాజీ! అటు చూడుము! ఎవరో వచ్చుచున్నారు. వారి

వైఖరిజూడ సులతాను సైనికులవలెనున్నారు. మనము ప్రక్కకు తప్పుకొని వెళ్ళుట మంచిది' అనెను

సుభాను 'మనము ప్రక్కకొదిగి వెళ్ళినచో వారికి మనపై అనుమానము మఱింత యెక్కువగును. ఎవరైననేమి? మనలనేమిచేతురు ?' అని ముందునకు బయలుదేరెను.

గుంపు చాల సమీపమునకు వచ్చెను. పది పదిహేను మంది గుఱ్ఱములపై నారూఢులై యుండిరి. వందమందికి పైగా కాలినడకను వచ్చుచుండిరి. వారికి వెనుక ఏడెనిమిది బండ్లపై గుడారములకు వలయు సామగ్రి వచ్చుచుండెను. వారందరును సంతోషముతో గోలచేయుచు వచ్చుచుండిరి. అశ్వారూఢులైన వారు మాత్రమేదియో తమలో తాము మాట్లాడుకొను చుండిరి దూరమున నుండుటవలన వారి నోటివెంట వచ్చిన- 'సులతానుగఢము - నానాసాహెబు - చంద్రాబాయి - వెధవ సర్ఫోజీ - ' మున్నగు మాటలు మాత్రము సుభాను నకు వినిపించెను. ఈ మాటలు వినుటతో సుభానునకు కుతూహలము హెచ్చి జాగ్రత్తతో నాలకించెను. కొన్ని మాటలు వినిపించెను. ఆమాటలు వినుటతో నాతని ముఖము మలినమై చింతాక్రాంతమయ్యెను. వెంటనే రాముతో — "రామూ! వీరి మాటలు వినగా మన సులతానుగఢమునకు ముప్పు వాటిల్లునట్లున్నది. మనము వెంటనే యీ సమాచా రము కిలేదారున కెరింగించవలెను. ముందు ఉత్తరమును జేర్చు టయా ? లేక కిలేదారునకీ సమాచారము వినిపించుటయా ?' అనెను.

రాముడు — 'దాదా! రెండును ముఖ్యములే! నేను త్తరమును చేర్చెదను. నీవు సులతానుగఢ మేగి కిలేదారున కీవార్త తెలియజేయుము." అనెను.

అంత సుభాను తాను జాగ్రత్తగ దాచిన యుత్తరమును తీసి రామునకీయబోయెను. ఇంతలో నందరికంటె చివరనున్న సైనికుడొకడిది చూచి — 'ఓరీ! కృతఘ్నులారా! ఆయుత్తర మేమి? మీరెవరో గూఢచారులవలె నున్నారే!' అని వారిని సమీపించెను.

అతని మాటలు వినుటతో సుభాను చేతినుండి ఉత్తరము జారి నేలపై బడెను. ఆ సైనికుడు వంగి దానిని తీసు కొనబోవునంతలో రాముడు దానిని లాగుకొని కాలికి బుద్ధి చెప్పెను. సైనికునికి రాముడొనర్చిన పనికాశ్చర్యము కలిగెను. అతనిని వెంబడింపవలెనను విషయముకూడ తోచలేదు. రాముడొనర్చిన పనికి సుభాను చాల సంతసించెను.

తరువాత నా సైనికుడు ముందేగుచున్న తన యను చరులను కేకవేసెను. అందరును గుమిగూడి 'ఆ యుత్తరమెవ రిచ్చిరో, ఎచటికి పంపిరో చెప్పుము'ని సుభానును నిర్బంధించిరి. కొందరు తమ బలము నుపయోగించి సుభానును కొరడాలతో మోదిరి. కాని సుభాను రహస్యమును బయటపెట్టలేదు. చేయునది లేక వారు సుభానును బంధించి తీసుకొనివెళ్ళిరి.

తనను బంధించినను ఉత్తరము మాత్రము వారి చేతుల బడకుండ రాముడు గొనిపోవుట సుభానునకు చాల సంతోష మును కలిగించెను. వారట్లు సుభానును బంధించి ముందు

అశ్వముపై నేగుచున్న తమ సరదారువద్దకు గొంపోయి జరిగిన విషయము యథాతథముగా చెప్పినచో తమకు చీవాట్లు వచ్చునని ఇతడెవడో కుట్రదారునివలె నున్నాడనియు, ఎవరికో ఉత్తరమును పంపుట మేము చూచితిమనియు చెప్పిరి. ఇది విని సరదారు ముందు మజిలీలో నితనిని విచారింతునని ముందునకు సాగిపో శెలవిచ్చెను. సైన్యము ముందునకు కదలి కొంత దూరమేగిన తరువాత సరదారు తన యనుచరుడైన కరీమును పిలిపించి తగిన ప్రదేశమున డేరాలు వేయించుమని యాజ్ఞాపించి తానొక వృక్షచ్ఛాయను విశ్రమించెను. కరీము కొందరనుచరులను వెంట నిడుకొని అటు నిటు వెదకుచు శివాలయము ముందున కేతెంచి అహమదుఖానుతో నీ యాలయము ముందు డేరాలు వేయింపుమనెను. అహమదుఖాను యిది హిందువుల దేవాలయమనియు, కొంచెము దూరముగా మన డేరాలను నిర్మించుకొందమనియు చెప్పెను. కాని కరీము వినలేదు. పైగా తాను దేవాలయములోని కేగి డేరాలు తయారగువఱకును విశ్రమింపవలెనుగాన లోనికేగి చూచి రమ్మని అహమదును పంపెను. చేయునదిలేక అహమదులోనికేగెను. అతడు లోనికేగి తొంగి చూచుటతోడనే మనకు పరిచితుడైన స్త్రీ పురుషులాతని కంటబడిరి. వెంటనే యతడు తిరిగివచ్చి కరీముతో — 'అయ్యా! అచటనెవరో ప్రేయసీ ప్రియులున్నారు. మనము కొంచెము దూరముగా పోవుట మంచిదనెను. కాని కరీముందుకు సమ్మతింపక ఆ పురుషుని పిలిపించెను.

అహామదులోనికేగి పురుషునితో మా యజమానిగారు మిమ్ములను పిలుచుచున్నారని చెప్పెను. ఇది వినుటతో నా పురుషుని ప్రాణము లెగిరిపోయెను. విధిలేక భయపడుచు నాతడు కరీముఖానువద్ద కేతెంచెను. భయముతో, సంకోచ ముతో గూడిన యాతని చూపులు కరీమున కాశ్చర్యమును కలిగించెను. కరీము రెప్పవాల్చకుండ అతనివైపునకే చూచు చుండెను. పాపమాపురుషుడు కన్నెత్తిచూడలేక ముఖము క్రిందకు వాల్చుకొని నిలువబడెను. కొంతసేపైనతరువాత కరీము— 'నీవు నీ జనానాను వెంటబెట్టుకొని గ్రామములోని కేగుము. మేమిచట బసచేయవలసియున్న'దనెను. ఈమాటలు వినుటతో పురుషుని పోయిన ప్రాణములు లేచివచ్చినట్లయ్యెను. గుడిలోని కేగి యాస్త్రీని వెంటనిడుకొని బయలు దేరెను.

వారట్లు కొంతదూరమేగినపిమ్మట కరీమున కేమి తోచెనోగానియాపురుషుని మరల పిలిపించి— 'మా సరదారుగారు వచ్చువరకును మీరిచటనే యుండుడు. మీ జనానాను గుడిలో కూర్చుండబెట్టుడు. లేనిచో మా సైనికులకిచ్చి గ్రామములోనికి పంపెదను.' అని ఏదైక ధ్యానముతో నాతనిముఖమువైపు చూచుచుండెను. అతనిముఖములో నేదియో ఆకర్షణ యున్నది. కరీమున కాతనిముఖము చూచుటయందమితానం దముపొడముచున్నది. కాని యాపురుషుని దైన్యస్థితి వర్ణనాతీతము. అతని కేమి చేయుటకును తోచలేదు. అత డిక చేయునదిలేక తన స్త్రీతోగూడ గుడిలోనికేగెను.

కొంతసేపటికి సరదారువచ్చి యచట నిర్మింపబడిన డేరాలో ప్రవేశించెను. ఈ సరదారు నవయువకునివోలె నుండెను. బలిష్ఠమైన శరీరము. ముఖమున అధికారగర్వ ముట్టిపడుచుండెను. అతడు విశ్రమించిన తరువాత కొంతసేపటి కాతనికి త్రోవలో పట్టితెచ్చిన ఖైదీవిషయము జ్ఞప్తికివచ్చి వానిని పిలిపించెను. సుభాను లోనికివచ్చి సరదారునకు సలా మొనర్చి నిలువబడెను. సరదా రతనితో నేదియో మాట్లాడ బోవునంతలో కరీమువచ్చి సరదారుతో నేదియో రహస్యముగ చెప్పెను. ఇది విని యాతడు 'వానినిగూడ పిలిపింపుము' అనెను. కరీము వెంటనే గుడిలోనికేగి యాపురుషుని వెంట నిడుకొని వచ్చెను. ఆ పురుషుని చూచుటతోడనే సుభానున కాశ్చర్యము కలిగెను. సుభానును చూచినంతనే యా పురు షుని ముఖము గూడ వెలవెలబోయెను. వీరిరువురిస్థితియు సర దారున కర్థముకాలేదు. అతడాపురుషుని వంక రెప్పవాల్చక చూచుచుండెను.

## ౭

శ్రీధరస్వామి మహమ్మదీయ సైనికులు వచ్చుచున్నారని తెలుసుకొని తన యనుచరులనందరను పంపివేసి తాను చలిమంటవద్ద జేరి రామనామస్మరణచేయుచుండెనని మనమిది వఱలో చదివియున్నాము. బాబాజీ రామనామస్మరణచేయుచుండెనేగాని యాతని మనసు పరిపరివిధముల నాలోచించుచుండెను. అతడు మాటిమాటికిని ఉమ్మివేయుటకో లేక కొల్లాయిగుడ్డ పిండుటకో బయటకు వెళ్ళి సైనికులెటు వచ్చుచుండిరో చూచుచుండెను. కొంతసేపటికాతనికి సైనికులాంజనేయాలయమునకే వచ్చుచున్నట్లు తోచెను. వెంటనే బాబాజీ మఱల చలిమంటవద్ద జేరి యుచ్చైస్స్వరముతో భగవన్నామసంకీర్తన మొదలిడెను.

ఇంతలో నిరువురు సరదారులు గుడి సింహద్వారము వద్ద నిలువబడిరి. అందొకడు మహారాష్ట్ర సరదారు. రెండవవాడు మహమ్మదీయ సరదారు. అందు మహమ్మదీయ సర్దారు

బాబాజీని చూచి విశుద్ధమైన ఉర్దూభాషలో బాబాజీకిని తన కును బావబావమఱదుల సంబంధమును కల్పించుకొని— 'ఓరీ! బైరాగీ! ఇటు రమ్ము' అని పిలచెను. బాబాజీ శాంతభావ ముతో వారివద్దకేగి నిలువబడెను. అంత మహారాష్ట్ర సర్దారు — 'బాబాజీ! ఈ గుడియెవరిది? ఇచట నింకెవరెవ రున్నారు? ఇచటికెవరు వచ్చుచుందురు? మీరిచటేమిచేయు చున్నారు?' అను ప్రశ్నవర్షము గురిపించెను.

ఇది విని బాబాజీ— 'అయ్యా! ఇది యాంజనేయా లయము. ఇచట నింకెవరును లేరు. నేను మాత్రము ప్రక్క గ్రామములలో భిక్షాటన మొనర్చుకొని ఇచటనే పడియుందును. అప్పుడప్పు డెవరైనను బైరాగులు వచ్చి రెండు పూటలుండి వెళ్లుచుందురు" అనెను.

మహమ్మదీయ సర్దారిది విని మండిపడుచు బాబాజీని పంది, గాడిద మున్నగు శబ్దములతో సంబోధించి —— 'ఓరీ! కాఫర్! మేము బైరాగుల విషయ మడుగుట లేదు. ఇచటి కింకెవరు వచ్చుచున్నారో నిజము చెప్పుము. లేనిచో నీ ప్రాణ ములు దక్కవు' అనెను. ఈ మాటలు వినుటతో శ్రీధర స్వామికి మిక్కిలి కోపము వచ్చెను. కాని యిది తరుణము కాదని కోపమును లోలోన నణచుకొని యేదియో మాట్లాడ బోవునంతలో మహారాష్ట్ర సర్దారు 'బాబాజీ! మేమడుగునది బైరాగుల విషయము కాదు. శహాజీ భోన్సలేకుమా రుడు శివాజీ యిచటికి వచ్చుచున్నట్లు మాకు తెలిసినది. అతడెచట నున్నాడో, ఎప్పుడు వచ్చునో చెప్పుము"అనెను.

'అయ్యా! నాకా విషయము తెలియదు. తెలియని విషయమును నేనెట్లు చెప్పగలను? మాబోటి సన్యాసులకు వారితో పనేమి?' అని బాబాజీ శాంతముతో ననెను.

'దుర్మార్గుడా! చాలును. నీ బోటి సన్యాసులే వానికి గురువులట. ఆ దోపిడి దొంగకు బైరాగులే ఆశ్రయమిచ్చుచున్నారట. నీ దొంగ వేషములు చూడ నీవును వారిలోని వాడవనియే తోచుచున్నది' అని మహమ్మదీయ సర్దారు కోపముతో ననెను.

బాబాజీ యాతనికి తగినప్రత్యుత్తరమీయబోవుచుండగనే మహారాష్ట్ర సర్దారు — 'బాబాజీ! మీ మాటలపై మాకు నమ్మకము లేదు. నేను గుడిలోనికేగి వెదకుదును' అని లోనికేగుచుండెను. అతనివెంట 'ఈ గుడిని పాయిఖానా దొడ్డిచేసిగాని విడువను' అనుచు మహమ్మదీయ సర్దారు కూడ లోనికి బయలుదేరెను. ఇంతలో బాబాజీ యకస్మాత్తుగ గుమ్మమున కడ్డమునిలచి—'హిందువుడు తప్ప మరొకడు లోననడుగిడుటకు వీలులేదు. నా శరీరములో ప్రాణములున్నంతవరకు తురకలాలయమున ప్రవేశించుటకు వీలులేదు.' అని యా మహమ్మదీయుని వారించెను. అతడు తెల్లమొగముతో నిశ్చేష్టుడై నిలువబడెను. ఇది చూచి మహారాష్ట్ర సర్దారు రెండవవానితో—'సర్దారజీ! మీరచటనే యుండుడు. నేను గుడియంతయు పరిశీలించెదను. ఇందేమాత్రమైన అనుమానము కలిగినచో దీనిని నాశనము చేయుదము' అనెను. ఇది యంతయు నా మహమ్మదీయున కసహ్యమయ్యెను. ఈ యవమానమును

భరించలేక కోపముతో—'నీవు నాకేమియు చెప్పనక్కరలేదు. నేను నీ సేవకుడను కాను. నీవు కూడ యీ కాఫర్‌తో కలసి పోతివి. నీ మాట నేను పాటించను.' అని యేమిచేయుటకును తోచక బయటనే అటు నిటు తిరుగుచుండెను.

మహారాష్ట్ర సర్దారు మాత్రము లోనికేగి యంతయు పరీక్షించెను. కాని యాతని కే విధమైన యనుమానమును కలుగలేదు. అంతలో బాబాజీ మెల్లగ నాతనిని సమీపించి—'సర్దార్జీ! మీరు మహారాష్ట్రులు. మహారాష్ట్రులై యుండి హిందూ ధర్మమునకు శత్రువులైన తురకలతో కలసి వారికి సాయ మొనర్చుట మీకు పాడిగాదు. పొట్టకొఱకై స్వజాతిని, స్వధర్మమును నాశన మొనరించుట మీకుతగునా?' అని మెల్లగ ననెను.

మహా. స. :—చాలు, చాలును. నీ మాటలు చూడ నీపై అనుమానము ధృవపడుచున్నది. ఇక నిట్టి మాటలాడకుము. శివాజీ జాడ నీకు తెలిసియుండును. చెప్పుము. లేనిచో నిన్నేమి చేతుమో తెలియునా?

బాబా :—నన్నేమి చేసిననుసరియే! నాకు తెలియని విషయములను నేను చెప్పజాలనుగదా!

మహా. స. :— ఈగుడిలో నెచటనైన భూ గృహము లున్నవా?

బాబా :—ఆ విషయము నాకు తెలియదు. ఎచటనైనను అట్టి గృహమున్నచో దయచేసి వెదకుడు. మీబోటి వారినుండి రక్షించుకొనుటకు నాకుగూడ నవసరమే! దానిలోనే పడియుండి తల దాచుకొందును.

మహారాష్ట్ర సర్దారు దీపము చేతబట్టి గుడియంతయు నన్వేషించెను. కాని యాతని కెట్టి యనుమానమును కలుగ లేదు. అందుచే బయటకువచ్చి మహమ్మదీయునితో 'సర్దార్జీ! గుడిలో నేమియు లేదు. అనుమానించదగిన చిహ్నములైనను లేవు. ఇక మనము పోవుదము' అనెను.

మహమ్మదీయుడు మండిపడి — 'నీ మాటలను నేను నమ్మను. మీ హిందువులు విశ్వాసఘాతకులు. మీరందరు నొకటియే! నీవుకూడ వారిలో కలసిపోతివేమో!' అనెను.

ఈ మాటలకు మహారాష్ట్ర సర్దారునకు చాల కష్టము తోచెను. ఆకాలపు పరిస్థితియే అట్లుండెను. మహారాష్ట్ర సర్దారులు మహమ్మదీయ సామ్రాజ్యమునకు మూల స్తంభముల వలె నుండిరి. అందుచే వారికి విభిన్నములైన బాధ్యతతోగూడిన పనుల నొప్పగించెడివారు. కాని వారివెంట నొక మహమ్మదీయ సర్దారునుగూడ పంపుచుండెడివారు. విజితులకు విజేతలకు ఎంతటి సఖ్యభావమున్నను విజేతల యభిమానము, విజితుల యసంతృప్తియు పూర్తిగ పోలేదు. మధ్య మధ్య విజితులు పరాభవమునకు లోనుగావలసి వచ్చుచుండెను. వారి స్వామిభక్తికి దగిన విశ్వాసము విజేతలు చూపకపోవుటచే వారి మనసునకు వ్యథ కలుగుచుండెడిది. అందువలననే అప్పుడప్పుడు మహమ్మదీయులు ఓడిపోయిరను వార్త వినినచో వారికిగూడ సంతోషము కలిగెడిది. వారి మనసు నందలి యసంతృప్తిలోలోన నణగి యుండెను. అందువలననే మన మహారాష్ట్ర సర్దారు మహమ్మదీయునిపై లోలోన మండిపోవుచుండెను.

ఇంతలో నా మహమ్మదీయ సర్దారు తన యనుచరులను పిలిపించి బాబాజీని ఖైదుచేసి కొనిరమ్మని యాజ్ఞాపించెను. నలుగు రైదుగురు సైనికులు బాబాజీని సమీపించి యవమానింప నెంచిరిగాని బాబాజీ వారిని చూచుటతోడనే మండిపడుచు —"ఆగుఁడు! మీరు నన్ను బంధించ నక్కఱ లేదు నేను మీ యిష్టానుసారము నడచివత్తును. నాశరీరముపై జేయివైచితిరా మీ మర్యాద దక్కదు." అని గద్దించెను. ఇది వినుటతో నా సైనికులు వెనుకకు తగ్గిరి. బాబాజీ వారి ననుసరించి నడచుచుండెను.

మహారాష్ట్ర సర్దారునకిది నచ్చలేదు. తనపై నవిశ్వాసముతో తన క్రిందియుద్యోగియైన యాతురకసర్దారు తన మాటకు విరుద్ధముగ బాబాజీని ఖైదుచేయుటయు, తన్ను నీచముగ జూచుటయు నాతని మనసును కలతబెట్టుచుండెను. "మనమెంత విశ్వాసముతో బ్రవర్తించినను శిక్షానష్టులైన యీ యవనులకు కృతజ్ఞత లేదు. పైగా అడుగడుగునకును మహారాష్ట్రుల నిట్లవమానించుచునే యుందురు. వీరి రోజులు దాపునకు వచ్చినవి." అనుకొనుచు నడచుచుండెను.

అట్లు నడచు సమయమున త్రోవలో నా మహమ్మదీయు లొనర్చిన ఘాతుకకృత్యములను, అల్లరులను వర్ణించుటకిట చోటుచాలదు. వారి కెదురైన బ్రాహ్మణులనుజూచి నోటికివచ్చినట్లెల్ల ప్రేలి యవమానించిరి. త్రోవలో పచ్చిక మేయుచున్న గోవుల ననేకవిధముల హింసించుచు నానందించిరి. ఇది యంతయు జూచునప్పుడు బాబాజీకి వారి నొక్క

సారిగ మ్రింగివేయవలె ననిపించెను. కాని యది తరుణము కాదని మిన్నకుండెను.

కొంతదూరమేగిన పిమ్మట వారొక గ్రామమును సమీపించిరి. ఆ గ్రామపు చెఱువునుండి కొందరు మహారాష్ట్ర వనితలు నీరుగొంపోవుచుండిరి. ఆకాలమున మహమ్మదీయులు మహారాష్ట్ర వనితలవైపు దుర్మార్గపు చూపులతో జూచుటయు వారిని హేళనజేయుటయు నలవాటు. పాప మా వనితలు సహజమైన యమాయకపు చూపులతో వీధివెంట నడచుచున్న పటాలమును చూచుచు ప్రక్కన నిలువబడిరి. వారిని చూచినంతనే మహమ్మదీయ సైనికులు తమ నోటికివచ్చిన ట్లెల్ల ప్రేలిరి. వారి యసభ్యపు కూతలతో బాబాజీకోపము మితిమీరి పోవుచుండెను. కాని ప్రయత్నముతో నాతడు తన ప్రతిహింసా భావము నణచుకొనుచుండెను.

ఇంతలో నొక గ్రామీణ యువతి బరువువలనగాబోలు శిరముపైనున్న కుండను బుజముపై దింపుకొని మెడ సవరించుకొని మరల నా కుండను శిరముపై నిడుకొనెను. ఇది చూచి యొక మహమ్మదీయ సైనికుడు — "వహ్వా! ఏమి యామె య్యారము! ఏమి యా సౌందర్యము. ఆ మెడ యందము చూడుడు! దీనిచే డ్యాన్సు చేయించిన మజాగా నుండును. పాప మా మెడకు కుండ బరువైపోయినది. కుండను మోయుము లేకున్నది." అనెను.

ఇది విని మతియొకడు—'నిజమే! దానికి నిఖా కట్టెదవా? ఆ కుండ బరువును దింపుదును, చూడుము" అనుచు

నొక జూతిని విసరి కండను బ్రద్దలుకొట్టెను. పాప మా యువతి నిలువెల్ల తడిసిపోయెను. ఇది చూచుసరికి బాబాజీకి మితిలేని యాగ్రహము కలిగెను. అతని సంయమము చెదరి పోయెను. వెంటనే యాతడా సైనికుని క్రిందపడవైచి డొక్కలలో పొడువసాగెను. ఈ యకస్మాత్సంఘటనకు మిగిలిన సైనికు లాశ్చర్యచకితులై చూచుచు నిలువబడిరి. తమతోటి వానిని రక్షించవలెనను జ్ఞానముగూడ వారికి లేకుండెను. ఆ సైనికుడు బాబాజీ దెబ్బలకు తాళలేక రక్తవమనము మొదలిడెను. కొంతసేపటికి మిగిలిన సైనికులు ప్రకృతిస్థులై కేకలిడుచు బాబాజీని లేవదీసి యాతనిపై బడిరి. ఈ గోల విని ముందు నడచుచున్న మహారాష్ట్ర మహమ్మదీయ సర్దారు లిరువురును పరుగు పరుగున వెనుకకు వచ్చిరి. ఇంతలో నొక మహమ్మదీయ సైనికుడు కత్తినెత్తి బాబాజీని సంహరింప బోయెను. కాని మహమ్మదీయ సర్దారాతని నాపి జరిగిన యుదంతమును విచారింప మొదలిడెను. మహమ్మదీయ సైనికులు తమకు తోచినట్లు కల్పించి తమ యపరాధమును కప్పి బుచ్చుకొనిరి. అంత నాతడు బాబాజీని జరిగిన యదార్థమేమో చెప్పుమనెను. బాబాజీ కోపముతో నిలువెల్ల వణకిపోవు చుండెను. ప్రతి హింసాభావము పెల్లుబికినది. అతని ప్రతి హింసకు తృప్తికలుగలేదు. అందుచే—"యదార్థమేమో నాకు తెలియదు. నీసైనికుల నడుగుము. లేవిచో నీ స్త్రీలనడుగుము. నన్నేమియు నడుగనక్కరలేదు" అనెను.

అంత నా సర్దారు మార్గమధ్యమున విచారణ జరుపుట యసమంజసమని నిశ్చయించుకొని మరల తన సైనికులకు ముందునకు పోవ ననుజ్ఞ నిచ్చెను.

మనము ప్రస్తుతమునకు బాబాజీ విషయమును వదలి యాంజనేయాలయమునకు రెండుక్రోసుల దూరమున కేగవలసి యున్నది. మనమేగబోవు ప్రదేశమంతయు పర్వతశ్రేణులతో నిండియున్నది. అందొక కొండకు ప్రక్కన రెండు చిన్న గుడిసెలు కలవు. ఆ కుటీరము లందెవరు నివసించుచున్నారో తెలియదు. ఆ నిశా సమయమందా ప్రదేశమంతయు నిస్తబ్ధమై యుండుటవలన నా కుటీరము లందెవరును లేనట్లు తోచును. కొలదిదూరమున నొక కొండపై మాత్ర మొక వ్యక్తి కాగడా చేతగొని యటు నిటు పరికించుచుండెను. కొంతసేపటి కాతడు 'భోలా ? భోలా !' యని రెండుమూడు పర్యాయములు పిలచెను. కాని యెవరును పలుకలేదు. అంత నాతడు విసుగుకొనుచు నొక కుటీరమువద్ద కేతెంచి తలుపు తట్టి 'భోలా!' యని పిలచెను. ఆ పిలుపు విని లోపలినుండి యొక నల్లని స్థూలకాయు డొకడు నిద్రమత్తుతో తలగోకు కొనుచు తలుపు తెఱచెను. అతనిని జూచినంతనే మొదటి వ్యక్తి—'భోలా! నీ కెన్ని పర్యాయములు చెప్పినను బుద్ధి లేదు. ఇదియేనా పహరా నిచ్చుట! ఇక ముందిట్లు నిద్రపోవు చున్న యెడల మర్యాద దక్కదు జాగ్రత్త!' అని హెచ్చరించి—'పొమ్ము. నాలుగుగుఱ్ఱములు సిద్ధముచేసియుంచుము.' అని యాజ్ఞాపించెను. అంత భోలా తాను నిద్రపోయినందులకు

బశ్చాత్తాప పడుచు – 'యే సాజీ! ఇక ముందిట్టి తప్పుపని చేయను. క్షమించుడు. ఇప్పుడే గుఱ్ఱములను సిద్ధము చేయింతును' అని యెచటికో వెడలిపోయెను.

ప్రస్తుత ప్రదేశమును మా పాఠకులకు పరిచితమొనర్తుము. ఇది పర్వతశ్రేణులతో గూడిన ప్రదేశమనియు, అందొక కొండ గుహావద్ద యేసాజీ కాగడా చేతబట్టి నిలువబడి యుండెననియు చదివి యున్నాము. ఆంజనేయాలయపు భూ గృహామునుండి యీ పర్వత గుహాలోనికి మార్గము గలదు. బాబాజీని తురకలు కైదుచేసి గొనిపోయిన పిమ్మట భూగృహామున తమ కర్తవ్యమును నిర్ణయించుకొనుచున్న నవయువకుడు, మహారాష్ట్ర యువకుడు, మరి యిరువు రనుచరులకు నీ విషయము తెలిసెను. అంత వారెల్లరును బాబాజీని విడిపించుటకై దృఢ ప్రతిజ్ఞ నొనర్చి రహస్యమార్గమున బయలుదేరిరి.

భోలా చెంగు చెంగున కొండలపై కెక్కుచు బోవుచుండెను. అట్లు కొంత దవ్వేగి యొక గుహావద్ద నిలువబడి యెవరినో పిలచెను. ఆ పిలుపువిని యొక సేవకుడువచ్చి నిలువబడెను. అతనితో భోలా నాలుగు మంచి యశ్వముల సిద్ధ మొనర్చి యుంచుమని చెప్పి బయలుదేరెను. ఆ సేవకుడు వెంటనే గుహాలోనికేగెను. గుహాబయటకుచిన్నదిగ కనుపించినను రెండుమూడు మెలికలు తిరిగిన పిమ్మట చాల విశాలముగ నుండెను. అది యొక గుఱ్ఱపుసాల. అందు త్తమ శ్రేణికి జెందిన యనేక గుఱ్ఱములు కట్టి వేయబడి యు . ఆ సేవకుడు

నాలుగుత్తమాశ్వములకు జీనుమున్నగునవి యమర్చి బయటకు గొనివచ్చి ప్రతీక్షించుచుండెను.

కొంతసేపటికి నవయువకుడు, మన మహారాష్ట్ర వీరుడు తానాజీ యేసాజీలచటికి వచ్చిరి. అందొక గుఱ్ఱముపై నవ యువకుడును, మరియొకదానిపై మహారాష్ట్ర వీరుడు నధిరోహించి యొక దిక్కునకు బయలుదేరిరి. తానాజీ వేరొక గుఱ్ఱముపై నెక్కి మరియొకవైపున కేగెను. యేసాజీమాత్ర మచటనే నిలువబడియుండెను. అతనివైఖరిజూడ నెవరికొఱకో ప్రతీక్షించుచున్నట్లుండెను. కొంతసేపటి కొకవ్యక్తి యాతని వద్దకేతెంచి నమస్కరించెను. యేసాజీ యతనితో 'యమాజీ! వచ్చితివా? ఏమిసమాచారము?' అనెను.

"శాహాజీవద్దనుండి యొక యుత్తరము వచ్చినదట. మన ప్రయత్నములన్నియు విఫలమొనర్చుటకై తగిన యేర్పాట్లు చేయవలెనని చూచుచున్నట్లు తెలిసినది."

సరేకానిమ్ము! దాని విషయమై తరువాత నాలోచింతము." అని కొంత తడవేదయోచించించి— 'యమాజీ! నీవు విశ్వాసపాత్రుడవు. నీపై శివాజీకి మిక్కిలి యనుగ్రహమున్నది. బాబాజీని కైదుచేసి గొనిపోయిన విషయము నీవెఱుంగుదువు. నీవు వారివెంటనేవెళ్ళి బాబాజీని కనిపెట్టి యుండుము. ఎట్లైనను మనము బాబాజీని విడిపింపవలెను. బాబాజీకి హానికలుగనంతవఱకును నీవా మహమ్మదీయ సర్దారును వెన్నంటి యుండుము. బాబాజీకి ప్రాణహాని కలుగజేయుచో వారిని రక్షించుటకై నీయిష్టమువచ్చినట్లు చేయుము.

మాకుమాత్రము వెంటవెంటనే సమాచారము లందజేయుచుండుము” అనెను.

యమాజీ— ‘చిత్తము’ అనికుటీరములోనికేగి కొలది సేపటిలో పకీరువేషమునుదాల్చి కంజరి మ్రోగించుచు బయటకువచ్చి యేసాజీకి నమస్కరించెను. యేసాజీ యతని చిరునగవుతో పంపివేసెను. తరువాత కొంతసేపటికి గుఱ్ఱమెక్కి యేసాజీ యెటకో వెడలిపోయెను.



రాముడు క్రిందపడిన ఉత్తరమునుగొని మహమ్మదీయున కందకుండ పరుగిడిపోయెనని చదివియున్నాము. అతడట్లు పరువెత్తి ధారా గ్రామమును సమీపించెను. అప్పటికే యపరాహ్ణ మయ్యెను. గ్రామమును సమీపించినంతనే యాతడు తానొనర్పవలసిన పనిని గూర్చి యాలోచింప మొదలిడెను – 'దేశముఖునకీయుత్తర మందజేయు టెట్లు? ఎవరైనను ప్రశ్నించినచో నేమని సమాధాన మీయవలెను?' అను విషయముల నిశ్చయించుకొని గ్రామమున ప్రవేశించెను. కొంత దూరమేగినంతనే వీధులన్నియు కోలాహలముతో నిండియుండెను. జనులిటునటు తొందరతో దిరుగుచుండిరి. రాముడా కోలాహలమున కారణ మారయనెంచి యొకరిద్దరి నడిగెను. కాని వారు రాముని బాలునిగ నెంచి— 'నీ తాత శోభనమ'ని యొకడును, 'నీ యమ్మమ్మ పుట్టినరోజ'ని యొకరును హేళన జేసిరి. రాముడు చేయునదిలేక తిన్నగ దేశముఖుని యింటి

వైపున కేగెను. దేశముఖుని భవనమువద్ద జనులు తండోపతండములుగ గుమిగూడియుండిరి. భవనము చుట్టును సశస్త్రులైన మహమ్మదీయ సైనికులు ముట్టడించియుండిరి. మేడపై నుండి యద్దములు మున్నగు ననేక విలువగల వస్తువులు క్రింద బడుచుండెను. కొందరు మహమ్మదీయ సైనికులు క్రిందనున్న జనులపై నుమియుచుండిరి. క్రింద నున్న జనులు తుడుచుకొనుచు ప్రక్కకు తొలగుచుండిరి.

ఈ కోలాహలమునంతయు జూడ మహమ్మదీయ సైనికులు దేశముఖుని భవనమును ముట్టడించి దోచుకొనుచున్నట్లు రామున కర్థమయ్యెను కాని కారణముమాత్రమాతని బుద్ధికందలేదు. అతడు "లోనికేగుటెట్లు? దేశముఖునకీ యుత్తర మెట్లు చేర్చవలెను?" అని యాలోచించుచుండెను. ఇంతలో కొందఱు మహమ్మదీయ సైనికులు లోపలినుండి వచ్చి బయట గుమిగూడియున్న జనులను తరుమమొదలిడిరి. కొంతసేపటికి వీధియంతయు జనశూన్యమయ్యెను. అరుగులపై మాత్ర మచ్చటచట కొంతమంది నిలువబడియుండిరి. మిగిలిన వారు — పురుషులు — తమ యిండ్ల కిటికీలలో నుండి తొంగి చూచుచుండిరి.

కొంతసేపటికి భవనములో నుండి మహమ్మదీయ సైనికులు సశస్త్రులై బయటకు వచ్చిరి. వారి వెనుక లజ్జావనతుడై యున్న వృద్ధుడొకడును, అతని వెంట పదిపండ్రెండువత్సరముల బాలురిరువురు, వారి వెనుక నలుగురైదుగురు స్త్రీలును ముసుగులలో నడచివచ్చుచుండిరి. అందొక మహమ్మదీయ యువ

కుడు గుఱ్ఱముపై నెక్కియుండెను. ఆ మహమ్మదీయ సైనికుల వస్త్రములన్నియు రక్తపు మరకలతో నిండియుండెను. వారి వేషములను తిలకించినంత భవనములందు వారొనర్చిన ఘాతుక కృత్యముల నూహించుకొనవచ్చును. రాముడొక యరుగుపై నిలువబడి యిది యంతయు జూచుచుండెను.

వారు వీధిలోనికి వచ్చినంతనే రాముడు లజ్జావనతుడై నడచుచున్న వృద్ధుని జూచెను. అతడే దేశముఖుడు. అతని స్థితి జూచినంతనే రాముని కనులు చెమ్మగిలెను. ఆ పరిస్థితి యందు త్వరమిచ్చుట యసంభవమేగాక, యనర్థదాయకము గూడనని భావించి రాముడు మిన్నకుండెను. అచటినుండి మఱలిపోవుటయే యుత్తమమని యెంచెనుగాని యిచటి విషయము లామూలాగ్రము తెలుసుకొని వెళ్ళవలెనని నిశ్చయించుకొనెను. ఇంతలో నతనికి సూర్యాజీరావు జ్ఞప్తికి వచ్చెను. మహమ్మదీయులు బంధించి తీసుకొనిపోయినవారిలో సూర్యాజీరావు లేడు. సూర్యాజీరావు బ్రతికియున్నంతవఱకును దేశముఖు పరివారమున కట్టి యుపద్రవము సంభవింపదు. మరి సూర్యారావు విషయమేమి ? అతనిని వధించి మిగిలినవారిని బంధించి గొనిపోవుచుండిరేమో యని రాముడు భావించెను. ఈ యూహతో నాతని మేను కంపించెను.

సూర్యాజీరావు దేశముఖునకు జ్యేష్ఠపుత్రుడు. శూరుడు పరాక్రమవంతుడునైన యువకుడు. కిలేదారు కుమారుడైన నానాసాహెబునకును సూర్యారావునకును ప్రాణస్నేహము. ఇరువురు నొకే ప్రాయపువారు. ఇరువురి భావములు నొకటే!

ఇరువురును మహమ్మదీయ ప్రభుత్వమునకు వ్యతిరేకులే ! నానాసాహెబువద్దకు వచ్చినపు డనేకమారులు రాముడు సూర్యాజీరావును జూచెను. చూచుటయేగాదు; అతనితో బరిచయముకూడగలదు. నానాసాహెబు పైవలెనే సూర్యాజీ పైనగూడ భక్తివిశ్వాసములుగలవు అందుచే రాముడు సూర్యాజీ విషయమేమయ్యెనో తెలుసుకొననెంచి బయలు దేరెను.

రామునకు సింహద్వారముగుండా లోనికేగుట కష్టము గాన వెనుకవైపునుండి బయలుదేరి లోన ప్రవేశించెను. భవన మంతయు నిస్తబ్దముగనుండెను. గదులందలి యలంకార సామగ్రియంతయు నస్తవ్యస్తముగ నాశనమొనర్పబడియుండు టయేగాక రక్తములో పడియున్న శవములు కానవచ్చెను. ఆ దృశ్యమును తిలకించినంతనే బాలుని మేను గగుర్పొడిచెను. అతడీ దృశ్యము జూచి భయమందక పడియున్న శవములలో సూర్యాజీ శవమున్న దేమోయని పరికించెను గాని కానరాలేదు. అంత నాతడచటినుండి పైయంతస్తు కేగదలచి మెల్లెక్కెను. పైకి జేరి వరండాలో నిలువబడి గదిలోనికి తొంగి చూచెను. గది యంతయు శవములతోడను, శరీరములనుండి వేఱైయున్న యంగములతోడను నిండియుండెను. అతడు లోనికేగి శవముల గుర్తింపనెంచెను. కాని యింతలో నకస్మాత్తుగ నొక యాక్రందనము వినవచ్చెను. దానితోబాటు పైనుండి యొకశవము క్రిందపడెను. రామున కీదృశ్యము జూచుటతో భయముకలిగెను. కాని వెంటనే ధైర్యముదెచ్చుకొని చూడ నాశవ మొక

దాదినని గ్రహించెను. 'పైనుండి శవమును క్రిందపడవైచిన చెవరు? ఇంకను పైన మహమ్మదీయ సైనికులుండిరా? బహుశః పైనున్న గదులు అంతఃపురమై యుండవచ్చు"నని యాలోచించి వెంటనే రాముడు పైయంతస్తునకేగి మెల్లగ గదిలోనికి తొంగిచూచెను.

ఆ గదియందొక మహమ్మదీయ సైనికుడుమాత్ర ముండెను. అతడు తన కత్తిని క్రిందబెట్టి యొకతివాచీని పఱ చెను. ఆ తివాచీకి ప్రక్కనే యొకయువతి స్పృహదప్పి పడి యుండెను. ఆమెను కొలదిదూరమున నొక పసిబిడ్డ యేడ్చు చుండెను. ఆ మహమ్మదీయుడు మెల్లగ నాయువతిని సమీ పించి —'సుందరీ! నిన్నెన్నినాళ్ళనుండియో ప్రేమించు చుంటిని. నేటికి చేజిక్కితివి. అనేక మారులు నాపై నుమిసి యుంటివి. భర్తయండజూచుకొని నన్నసహ్యించుకొంటివి. ఆదరిద్రుని నరకయాత్రకు బంపితిని. నీ వింతలో ననే మూర్ఛ బోతివే! కానిమ్ము యీ తివాచీలో చుట్టి గుఱ్ఱముపై నిడుకొని పోదును. నా మంచముపై ననే కనులు తెరువవచ్చును.' అని యామెను లేవనెత్త బోవుచుండగనే పసిపిల్లవాడు గొల్లున నేడ్వసాగెను. ఆబాలుని యేడ్పు ముష్కరుడైన యాతురకకు నచ్చలేదు. 'ముందు ఈ పీడవదలించిన మంచిది' యనుచు బాలునివద్దకేగి కాలితో మెడను త్రొక్కబోయెను. రాముడిది యంతయు వెనుకనుండి చూచుచుండెను. సైనికుడు కాలు ఎత్తుటతోడనే రాముడావేశపూరితుడై సైనికుడచట వదలిన కత్తినిగొని వెనుకగవెళ్ళి సైనికుని పొడిచెను. సైనికుడు వెను

కకుతగి క్రిందబడెను. అతనిపై బడి రాము డెన్నిమారులు కత్తితో పొడిచెనో లెక్కలేదు. ఆ సమయమున రాముని రూపము చూడదగనది. అతనికి బాహ్యజ్ఞానములేదు ఆ సైనికుని ప్రాణములు పోయిన తరువాతగూడ పొడుచుచునే యుండెను. కొంతసేపటి కాతనికి బాహ్యజ్ఞానము కలిగెను. ఆ యువతి యింకనునట్లే పడియుండెను. రాముడు నీటిని గొనివచ్చి యా యువతి ముఖమున చల్లెను.

కొంతసేపటి కామెకు స్పృహ వచ్చెను. కాని యా భయంకర దృశ్యముల జూచుటతో నామె మనసు వికలమై పోయెను. ఆమెకు మతిస్థిమితము తప్పెను. ఆమె సూర్యారావు ధర్మపత్నియని రాముడు గ్రహించి – 'అమ్మా' సూర్యారావుగారెక్కడ ? అని ప్రశ్నించెను. కాని యామె సమాధాన మిచ్చుటకు బదులుగ పిచ్చిదానివలె వెకిలి నవ్వులు నవ్వుచు నచటినుండి పరుగిడిపోయెను. రాముడామెననుసరించెనుగాని యెచటికేగినదియు వానికి తెలియలేదు. ఇంతలో నతని కొక మూలనున్న గదిలోనుండి మూలుగుచున్న ధ్వని వినవచ్చెను. అత డచటి కేగి చూడ సూర్యారావు పడియుండెను. అతని శరీరమున బలమైన కత్తిపోట్లుండెను. అతడు నేలపైబడి దొర్లుచు మరణవేదన ననుభవించుచుండెను. అతనికి కొలదిదూరమున నాతని భార్య పిచ్చిదానివలె నిలువబడియుండెను. సూర్యారావు మాటిమాటికిని భార్యను తన తల్లిదండ్రుల విషయమును, కుమారుని విషయమును, అప్పచెల్లెండ్ర విషయమును అడుగుచుండెను. కాని యాతనిభార్య

వెకిలినవ్వులు తప్ప సమాధాన మీయలేదు. తన భార్య స్థితిని జూచి సూర్యారావునకు కండ్ల వెంట కన్నీరు కారెను. అతడా దుఃఖముతో మూర్ఛబోయెను. రాము డిదియంతయు జూచు చుండెను. అతని కేమి చేయవలెనో తోచలేదు. వెంటనే నీరు తెచ్చి సూర్యారావు ముఖముపై జల్లెను. కొంతసేపటికి సూర్యారావు కనులు విప్పి రాముని గుర్తించెను—'రామూ! నీవిచటి కెట్లు వచ్చితివి? నా తల్లిదండ్రు లేమైరి? నాకుమారుని గతి యేమైనది?" అని ప్రశ్నించెను.

రాముడు తా నా గ్రామము వచ్చినది మొదలు జరిగిన విషయమును సంగ్రహముగ చెప్పెను. ఇది విని సూర్యారావు — 'రామూ! నీవు చాల సాహసము చేసితివి. ఇక నీ విచట నున్నచో నీ ప్రాణములు దక్కవు. నీవు చంపిన మహామ్మదీయ సైనికునికొఱకు మఱల కొంతమంది వెనుకకు వత్తురు. నీవు వెంటనే వెడలిపొమ్ము. నీ వొనర్చిన పనికి నా యాత్మ సంతసించినది. నేనిక బ్రతుకను. నేను బ్రతికినచో నీకు తగిన యుపకార మొనర్చెడివాడను. నీవు నానాజీతో నా మాటలుగ — "మన మిరువురము మహామ్మదీయ రాజ్య విధ్వంసనమునకు ప్రతిజ్ఞ చేసితిమి. నేడు నా స్థితి యిట్లైనది. రేపు నీగతికూడ నింతియే! నీవు నిజమైన మహారాష్ట్ర వీరుడవైనచో మన కార్యక్రమమును కొనసాగించి నా యాత్మకు శాంతి జేకూర్చుము. లేనిచో...' అనుచుండగనే మఱల మూర్ఛవచ్చెను. రాముడు మఱల శైత్యోపచార మొనర్చెను. సూర్యారావు కనులు విప్పినంతనే రాముడు మంచినీటి

నందించెను. రెండుగుటకలువేసి సూర్యారావు మఱల — 'రామూ! నీవు పిల్లవాడవు. కాని నీవు చూపిన ధైర్య మద్వితీయము. అందువలననే నా భార్యా పుత్రులను రక్షించు భారము నీ కొప్పగించుచున్నాను. ఒకవేళ వారిని నీవు నానా సాహాబువద్దకు గొనిపోజాలనిచో నీ విధముగ చేయుము. ఇచ్చనుండి ఉడౌతీ గ్రామమువైపునకు రెండుక్రోసుల దూరము వెళ్ళిన తరువాత నాలుగువైపులకు నాలుగు త్రోవలు కనుపించును. అందు కుడివైపుననున్న మార్గమున కొంతదూర మేగినచో నరణ్యము వచ్చును. ఆ యరణ్యమున నొక పెద్ద మఱ్ఱిచెట్టుక్రింద నొక కుటీర ముండును. ఆ కుటీరమున నొక వృద్ధుడుండును. అతడు నిన్ను చూడగనే చంపుటకై పైకి వచ్చును. అప్పుడు నీవీ కత్తిని, రక్షరేకును అతనికిచ్చి సూర్యారావు తన భార్యా పుత్త్రిలను రక్షించుభారము మీ కొప్పగించి చనిపోయిరని చెప్పుము. పొమ్ము! ఇక ఆలస్యము చేయవద్దు.' అని కండ్లు మూసుకొనెను. ఈ యంతిమ శబ్దము లాతని నోటినుండి క్షీణస్వరమున వెలువడెను. రాముడు 'చిత్తము' అని, సూర్యారావు భార్య యున్నదేమోనని వెనుదిరిగి చూచెను. వారు మాట్లాడుచుండగనే ఆమె యచటి నుండి వెడలిపోయినది.

రాముడచటినుండి బయలుదేరి యామె నన్వేషింప మొదలిడెను. అతడట్లు వెదకుచునే "మతిభ్రమతోనున్న యీామెను, పిల్లవానిని మఱ్ఱిచెట్టుక్రిందకు జేర్చుటెట్లు?' అని యాలోచించుచుండెను. అట్లు వెదకుచుండగ పూజాగృహ

మున తల విరియబోసుకొని నవ్వుచు, ఏడ్చుచు, గంతులు వైచుచు పిచ్చిపాటలు పాడుచున్న యామె కనపించెను. అట్టి యామెను తానొక్కడు తీసుకొనిపోవుట యసంభవమని యెంచి యెవరైన సాయమొనర్చువారు గలరేమోయని దొడ్డిలోనున్న యశ్వశాలవద్దకేగెను. అచట కొన్ని గుఱ్ఱములతప్ప మనుష్యు లెవరును కానరాలేదు. అశ్వశాలయందున్న యొక పొట్టి గుఱ్ఱమును చూచి మెల్లగ దానివద్దకేగెను. ఇంతలో నతని కేదియో శబ్దము వినవచ్చెను. అందుచే నాతడు చుట్టుప్రక్కల వెదుకనారంభించెను. అచటికి సమీపముననే గడ్డివామి యుండెను. అందుండి మెల్లగ నొకవ్యక్తి బయటకు వచ్చెను. తన యెదుటనున్న వ్యక్తి బాలుడని తెలుసుకొనినంతనే ఇాతని వఱకు గడ్డివామిలో దాగిన యాతని పౌరుషము పైకుబికెను. 'ఎవడవురా నీవు ?' అనుచు రాముని కొట్టబోయెను.

రాముడాతనింగాంచి — 'ఎవరు ? హనుమప్ప నాయకుడా ! మామా ! ఏమి నీ పరాక్రమము ! మహమ్మదీయులు వచ్చి భవనమంతయు కొల్లగొట్టి, సూర్యాజీని వధించి దేశముఖుని పరివారముతోగూడ బంధించి గొనిపోవుచుండ గడ్డివామిలో దాగి యిపుడు నాపై నీ ప్రతాపమును చూపుచున్నావా ? ఇన్ని రోజులనుండియు సూర్యాజీ పెట్టిన కూడు తినుచున్నావు. ఆయన చనిపోవుముందు మనల నిరువురను తన భార్యను పుత్రుని రక్షింపవలసినదిగా చెప్పినాఁడు. రమ్ము, లోనికేగి వారిని గొనిపోవుదము' అనెను.

హనుమప్పనాయకునకు సూర్యాజీ చనిపోయెనను వార్త దుఃఖమును కలిగించెను గాని రాముని మాటలవలన నాతనిలో సాహస ముదయింప లేదు. మహమ్మదీయ సైనికులింకను కాపలాకాయుచున్నారనియు, చూచినచో ప్రాణములతో విడువరనియునాతని భయము. ఇంతలో గడ్డివామిలోనుండి రాముని మాటలను వినిన మరియొకవ్యక్తి బయటకు వచ్చి సూర్యాజీ మృతికి దుఃఖమును వెలిబుచ్చుచు, రామునితోగూడ లోనికి వచ్చుటకు సమ్మతించెను. ఇరువురును కలసి మెల్లగ భవనము లోనికి ప్రవేశించిరి. రాముడు చప్పుడు కాకుండ నడచుచుండెను. రెండవ్యక్తి యాతని ననుసరించుచుండెను. ఇరువురును సూర్యాజీ భార్యకొఱకు వరుసగ గదులన్నియు వెదుక మొదలిడిరి కాని యెచటను జాడ కానరాలేదు. ఇంతలోనేదియో కోలాహలమువినవచ్చెను. ఇరువురును గోడచాటుననుండి యాలకించుచుండిరి. పదిమంది మహమ్మదీయ సైనికులాయుధముల దాల్చి — "శిబిరమునకు వెళ్ళునంతవఱకు అతని విషయము జ్ఞప్తిలేదు. అచటికి వెళ్ళిన తరువాత చూడగా ముహబ్బత్ ఖాను లేడు. అతడు సూర్యాజీ భార్యను ప్రేమించిన సంగతి మేమెఱుగుదుము. అందువలననే భవనమంతయు కొల్లగొట్టి సూర్యాజీని గాయపఱచి దేశముఖుని పరివారముతోగూడ బంధించి తీసుకొనిపోవునప్పుడు ముహబ్బత్ ఖాను అంతఃపురము లోనికేగుట చూచితిమి. బహుశః సూర్యాజీ భార్యను తీసుకొని దొడ్డిత్రోవను వచ్చునని యనుకొంటిమి. ఏమి జరిగెనో తెలియదు." అని తమలో తామనుకొనుచు వచ్చుచుండిరి.

రాము డీపియంతయు దాగి వినుచుండెను. ఆ సైనికులు ప్రతి గదిలోనికి నేగి వెదకుచుండిరిగాని ఖాను కన్పించలేదు. ఆ సైనికుల వెంట సూర్యాజీ భార్య లేకుండుటచే నామె వారి చేజిక్క లేదని రాముడు సంతోషించెను. ఇంక నచట నిలచి లాభము లేదని భావించియు తనచే హతుడైన ఖానును చూచి వారెట్లు విలపింతురో చూడనెంచి రాముడు మెల్లగ ఖాను శవము పడియున్న గదిలోని కేగి స్తంభము చాటున దాగియుండెను. అతనితోనున్న సూర్యాజీ సేవకుడు గూడ మరియొక స్తంభము నాశ్రయించెను. కొలదిసేపటికి సైనికులా గదిలోనికి ప్రవేశించిరి. అందు ఖాను శవమును చూచుటతో యాశ్చర్యాగ్రహముల కంతులేకపోయెను. ఇంతలో నొక సైనికుని దృష్టి రామునితో గూడ వచ్చిన సేవకునిపై బడెను. వారాతనిని గదినుండి బయటికీడ్చుకొనివచ్చి — 'నీవెవడవు? ఇచటి కెందులకొచ్చితివి? ఖానును చంపినదెవరు?' అని బాదసాగిరి. నేను కావలావాడనని చెప్పుకొని నను వదలలేదు.

ఇది చూచి రాముడు మెల్లగ గదిలోనుండి జారి యశ్వశాల వైపునకు వెళ్ళెను, ఇంక సూర్యాజీ భార్యను గొనిపోవుట తన శక్తికి మించిన పనియనితలచి యొక గుఱ్ఱము నెక్కి యరణ్యములోని మఱ్ఱిచెట్టు వైపునకు బయలుదేరెను. సూర్యాజీ చెప్పిన జాడననుసరించి యాతడు కొంతసేపటికి మఱ్ఱిచెట్టుక్రింద నున్న కుటీరము చెంత కేగెను. సూర్యాజీ చెప్పినట్లు వృద్ధుడొకడు రామునిపై కురికెను. కాని వెంటనే

సూర్యాజీ పాపిన కత్తిని రక్తరేకును చూచి యాగిపోయెను. రాముడు పరిస్థితినంతను పూసగ్రుచ్చిన ట్లావృద్ధునితో జెప్పి సూర్యాజీ చెప్పిన యంతిమ వచనమును వినిపించెను. అంత నా వృద్ధుడు వెంటనే 'భీమాజీ' యని కేకవేసెను. ఆ కేకవిని యొక బలిష్టుడగు నల్లని యువకుడేతెంచెను. వృద్ధుడాతని చెవిలో నేదియో చెప్పెను. అదివిని యా యువకుడు రాము డెక్కి వచ్చిన గుఱ్ఱముపై నెక్కి వాయువేగమున వెడలి పోయెను.

మహమ్మదీయ సైనికులకు ముహబ్బతుఖాను మర ణమునకు దుఃఖముతోబాటు కోపమెక్కువయ్యెను. ఖానును వధించిన వాడెవడో తెలియదు. ముందు పహరాయున్న తమ యనుచరులు లోనికెవ్వరును వెళ్ళలేదని సాక్ష్యమిచ్చుచుండిరి. పట్టబడిన సేవకుడు సామాన్యుడేగాని ఖానును చంపజాలు నట్టి వాడుకాడు. వాని నెన్నికొట్టినను ప్రయోజనము లేక పోయెను. వారిలో ప్రతిహింసా భావ మెక్కువయ్యెను. తమ వాని హత్యకు ప్రతీకార మొనర్పకుండ శిబిరమునకేగుట యవ మానకరమని యెంచి భవనమంతయు తగులబెట్ట నిశ్చయించు కొనిరి. ఇక వారిని కాదనువారెవరు? వారి స్వేచ్ఛాచార మున కడ్డులేదు. భవనమునగల తలుపులన్నియు బిగించి నాలుగు మూలల నిప్పుపెట్టిరి.

భవనమంతయు నగ్నిజ్వాల లలముకొనెను. సైనికులు కొంతసేపు వినోదించి ఖానుశవమును గొని వెడలిపోయిరి. గ్రామములోని వారందరును మట్టిబొమ్మలవలె చూచుచుండిరి.

కొందరశ్రువుల నైతము జార్చుచుండిరి. కాని మహమ్మదీయుల క్రౌర్యమునకు వెఱచి ఒకరును చల్లార్పుటకు ముందునకు రాలేదు. అట్లని దేశముఖునిపై గ్రామీణులకు భక్తివిశ్వాసములు లేవని తలచరాదు. భక్తివిశ్వాసములున్నవి. కాని యవనుల నెదిరించు సాహసములేదు. పౌరుషమున్నది, పరాక్రమమున్నది గాని వారిని నడిపించు నాయకుడు లేడు.

దేశముఖుని భవనమంతయు జ్వాలలచే చుట్టబడియుండెను. తలుపులన్నియు తగులబడిపోయెను. పైకప్పు కూలుటకు సిద్ధముగ నుండెను. లోపల పొగ క్రమ్మియుండుటచే నేమియు నగపడుటలేదు. అట్టిసమయమున లోపలినుండి యొక యాక్రందనమువినవచ్చెను. కాని లోనికేగి యావ్యక్తిని రక్షించుటకు సాహసించువారు లేరైరి. వీధిలో నిలువబడి మౌఖిక సహానుభూతిని చూపువారలు మాత్రమనేకులుగలరు. ఇంతలో భీమాజీ యచటకేతెంచి గుఱ్ఱమునొకచోనుంచి జనులను నెట్టుకొనుచు ముందునకువచ్చి నిలువబడెను. మరు క్షణముననే మఱల లోపలినుండి యాక్రందనము వినవచ్చెను. భీమాజీ చెప్పరాని యావేశముతో నాక్రందనము వినవచ్చిన గదివైపునకు బయలుదేరెను. గదితలుపులు కిటికీలు తగులబడిపోయెను. అందుచే నాతడు ప్రాణములకు లెక్కసేయక లోనికి దుమికి యందున్నవ్యక్తికొఱకు వెతుక మొదలిడెను. గదియంతయు పొగచే నావరింపబడుటచే భీమాజీ కేమియు కనబడుటలేదు. అతడట్లే వేడిమికి లెక్కసేయక చేతులతో తడుముకొనుచు గదియంతయు వెదకుచుండెను. ఒక కిటికీవద్ద

నొకవ్యక్తి బిడ్డ నెత్తుకొని యేడ్చుచుండెను. వెంటనే భీమాజీ యా యిరువురను బుజముపై నెత్తుకొని బయటకువచ్చెను. అతడు బయటకు వచ్చిన మరుక్షణముననే పైకప్పు నేలకూలెను.

భీమాజీ యా యిరువురను గుఱ్ఱముపై నెక్కించుకొని వేగముగ పరుగిడెను. గ్రామీణు లాశ్చర్యముతో నీ దృశ్యమును తిలకించుచుండిరి. అకస్మాత్తుగ నేతెంచి మాతాశిశువుల ప్రాణముల రక్షించిన యావ్యక్తి సాహసమునకు వారాశ్చర్యచకితులైరి. భీమాజీ వారిని గొంపోయి యా వృద్ధున కొప్పగించి మఱలి యెటకో వెడలిపోయెను.

మహమ్మదీయ సర్దారు శ్రీధరస్వామిని బంధించి గొనిపోవుట పాఠకులకు విదితమే! త్రోవలో బాబాజీ చూపిన సాహసము, ధైర్యము పాఠకులు చదివియుండిరి. మహమ్మదీయ సర్దారు బాబాజీని పురందరు కోటకు గొంపోయి ఖైదు చేసెను. పురందరుకోట ఆంజనేయాలయమునకు మూడు నాలుగు క్రోసుల దూరమున నున్నది. ఆ ప్రాంత మంతయు బీజపురు సుల్తాను అధీనమున నుండెను. పురందరుకోట కొక మహారాష్ట్ర కిలేదారు గలడు. అతడు బీజపూరు సుల్తానులకు పరమభక్తుడు. అందుచే మహమ్మదీయ సర్దారు బాబాజీని ఖైదుచేయుటకు పురందరు కోటయే తగినదని నిశ్చయించుకొనెను.

తన యుద్దేశ్యమునకు విరుద్ధముగ బాబాజీ నట్లు కారాగారమున నుంచుట మహారాష్ట్ర సర్దారున కిష్టములేదు. కాని అతడేమి చేయగలడు? వాస్తవమునకు మహమ్మదీయసర్దారు

తన క్రింది తాబేదారు. పురందరు ప్రాంతమున జరుగుచున్న అల్లరులను, దోపిడీలను అణచుటకై సుల్తాను తనను పంపుచు సహాయమునకై మహమ్మదీయ సర్దారును గూడ పంపెను. ఇచటకు వచ్చిన పిమ్మట సేవకుడు యజమాని యయ్యెను. ఆ కాలమున మహారాష్ట్ర సర్దారులందరి పరిస్థితియు నిట్లే యుండెను.

బాబాజీని బంధించి హింసించినచో రహస్యములు బయటపెట్టునని మహమ్మదీయ సర్దారుని నమ్మకము. బాబాజీ చెఱసాలలో నుండి తప్పించుకొను మార్గము లాలోచించు చుండెను. ఇంతలో నొక పహరానిచ్చువాడు వచ్చి-'బాబాజీ! సర్దారు మిక్కిలి క్రూరుడు. మిమ్ముల నధికముగ హింసింప జూచుచున్నాడు. మీకు తెలిసిన విషయములను చెప్పి తప్పించుకొనరాదా? అన్యాయముగ ప్రాణము లర్పించు టెందులకు ?" అనెను.

ఇది విని బాబాజీ—'మూర్ఖుడా! మహారాష్ట్రుడవై యుండి యిట్టి నీచపుమాట లాడుటకు సిగ్గులేదా? మహారాష్ట్రజాతి నుద్ధరించుటకై యత్నించుచున్న శివాజీ విషయమై తెలిసిన రహస్యములను చెప్పి యీ తుచ్ఛ ప్రాణములను దక్కించుకొను మంటివా? అట్టి బ్రతుకు కంటె చావు మేలు' అనెను. ఈ మాటలకా జమాదారుని హృదయము చలించెను. కాని చేయునదిలేక యచటినుండి తప్పుకొనెను.

జమాదారు వెడలిపోయిన కొలదిసేపటి కొక సేవకుడు వచ్చి— 'బాబాజీ! మీతో మాట్లాడుటకై కిలేదారుగారు

రానున్నార'ని చెప్పెను. ఇది విని బాబాజీ కిలేదారు తన్నేమి ప్రశ్నించునో! తానేమి సమాధాన మొసంగవలెనోయని యాలోచించుచుండగనే అతని కెచటనో కంజరి వాయించు చున్న ధ్వని వినవచ్చెను. బాబాజీ యా ధ్వని విని ఉత్సు కతతో గోడకున్న రంధ్రములోనుండి బయటకు చూచెను. కాని యాతని కెవరును కానరాలేదు. రెండు నిమిషములైన తరువాత నింకను దగ్గరలో నా కంజరి ధ్వని వినవచ్చెను.

అంత బాబాజీ కాపలావానితో—'ఇచటి కెవరైనను పకీరులు వచ్చుచుందురా?' అని ప్రశ్నించెను.

ఇంతలో నిరువురు సేవకులతో కిలేదా రచటికేగెను. సేవకు లొక యాసనమును తెచ్చిరి. కిలేదారు దానిపై గూర్చుండి సేవకులతో 'మీరు దూరముగ పొండు. అవసర మైనచో పిలుతును.' అనెను. సేవకు లిరువురును దూరముగ బోయి యొక చెట్టుక్రింద కూర్చుండి చుట్టలు ముట్టించి మాట్లాడుకొనుచుండిరి.

సేవకులు వెడలిపోయిన తరువాత నా వృద్ధుడు—కిలేదారు బాబాజీతో—'స్వామీ! మీ రెవరు? మిమ్ముల నెచటనుండి బంధించి తెచ్చిరి? మిమ్ములను బంధించి తెచ్చుటకు కారణమేమి?' అని యడిగి తదేక ధ్యానముతో నాతని వైపు చూచుచుండెను. బాబాజీ — 'అయ్యా! నే నెంత వాడను? హిందూజాతి, హిందూ ధర్మము, హిందూ స్వాతంత్ర్యము అన్నియు బంధింపబడినవి. నేనొక లెక్కయా? ఈ యవన ప్రభుత్వమునకు కార్యకారణములతో నిమిత్తములేదు.

నేనొక సన్న్యాసిని. ఆంజనేయాలయమున నుందును. నావద్దకు శివాజీ సలహాలకై వచ్చుననియు, నేను వారికి నాయకుడననియు బంధించి తెచ్చిరి. ఇంతకంటె నన్న్యాయము గలదా ?' అనెను. కిలేదారు తన హృద్గత భావముల వ్యక్తముచేయక బాబాజీ ముఖవైఖరిని మాత్రము తదేక ధ్యానముతో గనిపెట్టుచు— 'బాబాజీ! మీ దేయూరు? మీరు సన్న్యసించి యెంతకాల మైనది? సన్న్యసించుటకు గారణ మేమి? నిజముగ శివాజీ విషయము మీకు తెలియదా?' అని ప్రశ్నించెను.

ఈ ప్రశ్నలు వినినంతనే బాబాజీ ముఖము వెలవెల బోయెను. "అయ్యా! నా తల్లిదండ్రులు చిన్నతనముననే గతించిరి. బీదవాడను. సంసార మిష్టములేక సన్న్యసించితిని. శివాజీ విషయము నాకేమియు తెలియదు' అనెను.

ఇది విని యా కిలేదారు — "బాబాజీ! మీ విషయ మంతయు నేను కనిపెట్టితిని. మిమ్ము నేను గుర్తించలేదనుకొనుట పొరపాటు ఇప్పటికైనను సత్యమును బయటపెట్టుడు. మీ ప్రాణములు దక్కును. ఇంతకంటె చెప్పవలసినదిలేదు." అనెను.

ఈ మాటలు వినుటతో బాబాజీ ముఖము మఱింత కాంతివిహీనమయ్యెను. 'ఈతడు నిజముగ నన్ను గుర్తించి నాడేమో' నని లోన కలవరమందెను. కాని తన యనుమాన మును వ్యక్తము కానీయక తలవంచుకొని — "నేను చెప్ప వలసినదింకేమియు లేదు. తెలియని విషయమును చెప్పజాలను. మా! మాటికిని మరణదండన విధింతుమని భయపెట్ట నవసరము

లేదు. మృత్యువునకు వెఱవవాడనుకాను. మీ యిష్టము వచ్చినట్లు చేయువచ్చును" అనెను.

ఇంతలో కంజరి మ్రోగించుచు నొక ఫకీరు చెట్టుక్రింద కూర్చుని చుట్ట కాల్చుచు మాట్లాడుకొనుచున్న సేవకు లిరువురివద్దకును వచ్చి యాలోచించుచు మధ్య మధ్య బాబాజీ యున్న గదివైపునకు జూచుచుండెను. కిలేదారుతో మాటలాడుచు కంజరి ధ్వని విని బాబాజీ వంగి జూచెను. ఇరువురి చూపులును కలసినవి. ఆ చూపులో నేదియో రహస్యము దాగియుండెను. ఆ ఫకీరును చూచినంతనే బాబాజీ ముఖమున నొక మందస్మితము కానవచ్చెను. ఆ దరహాసమందొక విధమైన ధైర్యము కన్పట్టుచుండెను. బాబాజీని చూచిన తరువాత నా ఫకీరచటినుండి కంజరి మ్రోగించుకొనుచు నెడలిపోయెను.

అనంతరము కిలేదారు బాబాజీతో — "సరే - నీ దురదృష్టమునకు నేనేమి చేతును? ఇప్పటికైనను ఆలోచించుకొనుము." అని యచటనుండి వెడలిపోయెను. సైనికులు మఱల తలుపులు మూసిరి.

ఫకీరును చూచినప్పటినుండియు బాబాజీ కొక విధమైన ఉల్లాసము జనించెను. ఆ సంతోషములో నాతనినోట కూనరాగములుగూడ వెడలెను. 'ఇక పరవాలేదు. ఒకటి రెండు దినములలో నన్ను తప్పక విడపింతురు.' అనుకొనుచు సంతోషించుచుండెను. ఇంతలో నతనికి మఱల నెవరో వచ్చుచున్న ధ్వని వినబడెను. కొంతసేపటికి సైనికులు తలుపులు తెఱచిరి. ఎదురుగ మహమ్మదీయ సర్దారు నిలువబడి యుండెను.

ఫతేఖాను(మహమ్మదీయ సర్దారు)రోషవీక్షణములతో బాబాజీ వంక చూచి ఉర్దూభాషలో తిట్టుచు తన సైనికులతో నా దుష్టుని బయటకీడ్చుకొని గమ్మని యాజ్ఞాపించెను. మహమ్మదీయ సైనికులకిక కావలసినదేమి? బాబాజీ నవమానించుటకై ముందునకు సాగిరి. ఇది చూచి బాబాజీముఖ మెఱ్ఱబారెను — "జాగ్రత్త! నాపై చేయివేసితిరా మర్యాద దక్కదు. మీ రోజులు దాపునకు వచ్చినవి. అందువలననే మీకీ విపరీతపు బుద్ధులు పుట్టుచున్నవి." అనెను.

ఈ మాటలు విని సైనికులు కొంచెము వెనుకకు తగ్గిరి. కాని ఫతేఖానున కగ్నియందాజ్యము బోసినట్లయ్యెను. "ఈ దుర్మార్గుని కాలుసేతులు బంధింపుడు. ఆంజనేయాలయమునందలి రహస్యమును బయటపెట్టునంతవఱకును వీనిని వదలను. రేపు రాత్రికి వీనిని కోటబురుజుపైనుండి క్రిందకు దొర్లింతును. ముందీతనిని బంధించి కోటలోని చీకటికొట్టులో నుంచుడు." అని యాజ్ఞాపించెను.

సైనికులు వెంటనే గొలుసులతో బాబాజీని బంధించి గొంపోయిరి. ప్రస్తుతము వీరి నెదిర్చి లాభములేదని బాబాజీ మిన్నకుండెను.

మరునాడు మఱల నా పకీరు కంజిరి ప్రయోగించుకొనుచు పురందరు దుర్గమందంతటనుతిరిగెను. నిన్నటివలె నా నితని ముఖమున సంతోషములేదు. అతని ముఖముజూడ నాతని మనోభీష్టము నెఱవేఱలేదని స్పష్టమగుచుండెను. అటు చీకటిగది

యందు లౌహశృంఖలలచే బంధింపబడిన బాబాజీ ముఖమున గూడ దుఃఖరేఖలు కానవచ్చుచుండెను. అతనికీనాడు కంజరి ధ్వని వినిపించలేదు. కంజరి ధ్వని వినిపించినచో కొంత సంతోషము కలిగెడిదేమో! దుర్గమంతయు తిరిగి వేసారి ఫకీరు చింతాక్రాంతుడై మఱలిపోయెను.



# ౧౦

అది మహారణ్యమధ్యము. సాయంకాల మైదుగంట లయ్యెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను. దుబ్బులలోనుండి యటు నిటు పరుగిడుచున్న కుందేళ్ళ చప్పుడు మాత్ర మప్పు డప్పుడు వినిపించుచుండెను. పొదలు దట్టముగ నుండెను. ఆ పొదలమధ్య నలుగురు వ్యక్తులు కూర్చుండి రహస్యముగ నేదియో మాట్లాడుకొనుచుండిరి. ఆ వ్యక్తు లెవరో పాఠకు లూహించియే యుందురు. వారాంజనేయాలయపు భూగృహ మున మనము చూచినవారే! అందు తేజస్వియైన నవయువ కుడు — శివాజీ. తన యనుచరుడైన యేసాజీ వైపుచూచి—.. "యేసాజీ! నీ వొనర్చిన ప్రతిజ్ఞ నెరవేఱలేదు. మూడు దిన ములనుండియు నీపై భారముంచి యున్నకుంటిమి. ఇంక లాభములేదు, శ్రీధరస్వామి విముక్తు నొనరించుటకై మన మేదైన నుపాయమాలోచింపవలసి యున్నది." అనెను.

ఈ మాటలు విని యేసాజీ లజ్జచే శిరము వాల్చెను. మిగిలిన మువ్వురును ఆలోచనా నిమగ్నులై యుండిరి. ఎవరును మాటాడుటలేదు. మొదటి పరిచ్ఛేదమున మనకు పరిచితుడైన మహారాష్ట్ర వీరుడు మాత్రము తన మనోగతాభిప్రాయమును వెల్లడించుటకు ప్రయత్నించుచున్నట్లాతని ముఖ వైఖరి తెల్పుచుండెను. యేసాజీ గ్లానిచే తలవంచుకొనియుండెను. అతని కనులు చెమ్మగిలెను. ఇదిచూచి శివాజీ — "యేసాజీ! ఇంతమాత్రముననే యధైర్యమా? జయాపజయములు దైవాధీనములు. ప్రయత్నను పురుషాధీనము. భవానీమాత కృప యున్నంతవఱకు మనకు పరవాలేదు. భావి కర్తవ్యమును యోచింపుడు." అనెను.

అంత నా మహారాష్ట్ర వీరుడు ముందునకు వచ్చి శివాజీతో— 'బాబాజీని విడిపించు భారము నాపై వదలుడు. ప్రాణములర్పించియైనను నేను స్వామిని విడిపింతున'నెను. కాని శివాజీ యందుల కంగీకరించలేదు—'సోదరా నీ సాహసము మెచ్చుకొనదగినది. నీ ప్రాణములంత తుచ్ఛములు కావు. నీకీ ప్రాంతము పరిచితమైనది కాదు. అందును పురందరు దుర్గము సుదృఢమైనది. ప్రత్యక్షముగ మన శ్రీధరస్వామిని విడిపించుటకు అవివేకమే యగును. బలముచే సాధించజాలని కార్యము నుపాయముచే సాధించుటకు ప్రయత్నింతము' అని యేదియో ఆలోచించి ప్రక్కన పొదలలో కట్టివేయ బడియున్న గుఱ్ఱములవద్దకు బయలుదేరెను. యేసాజీ తప్ప మిగిలిన యిరువురును శివాజీ ననుసరించిరి. మువ్వురును తమతమ యశ్వముల

నధిరోహించి యెచటికో బయలుదేరిరి. పిమ్మట యేసాజీగూడ లజ్జావనతుడై తన యశ్వము నధిరోహించుచుండ దూరమున నెవరో వచ్చుచున్నట్లగపడుటచే కొంచెమాగెను. యమాజీ పరుగుపరుగునవచ్చి —"యేసాజీ! శ్రీధరస్వామిని రాత్రికి కోట బురుజుపైనుండి పడద్రోయుదురట" అని యింకేమియో చెప్పబోవుచుండగనే యేసాజీ వానినిగూడ గుఱ్ఱముపై నెక్కించుకొని శివాజీని కలుసుకొనుటకై బయలుదేరెను. యేసాజీ వాయువేగమున శివాజీని సమీపించి యీ సంగతి నివేదించెను. ఈ మాట వినుటతో శివాజీముఖము క్షణ కాలము వివర్ణమయ్యెను. అందరును తమ యశ్వములనుండి దిగి మఱల నేదియో ఆలోచింప మొదలిడిరి.

సూర్యాస్తమయమయ్యెను. రెండవదినమున ఫకీరు కనిపించక పోవుటచే బాబాజీ కధైర్యము కలిగెను. సూర్యాస్తమయమగుచున్న కొలదియు నాతనికి నిరాశ యధికమయ్యెను. బాబాజీని కోటపైనుండి క్రిందకు బడద్రోసి చంపుటకిలే దారున కిష్టములేదు. తనకోటపై బ్రహ్మహత్య జరుగుచున్నం దుల కాతని మనము పరితపించుచుండెను. కాని బాబాజీని రక్షించుట కుపాయాంతరము లేకపోయెను. మహమ్మదీయుల కొక హిందూబ్రాహ్మణుని చంపు సదవకాశము లభించినందుల కమితానందము కలిగెను.

సాయంకాలమారుగంటలకు ముసలి దంపతులిరువురు గడ్డిమోపులను నెత్తిపై బెట్టుకొని బజారులన్నియు తిరిగి పురందరు దుర్గముక్రిందకు జేరిరి. వారియొద్ద నెవరును గడ్డి కొన

లేదు. గ్రామమంతయు తిరిగి తిరిగి పాప మావృద్ధు డలసి పోయెను. ఇంక నాతడొక యడుగైనను ముందునకు వేయు స్థితిలో లేడు. అతని భార్య మాత్రము దుర్గముపై కేగి, యచట గుఱ్ఱపుశాలయందు గడ్డి నమ్మవలెనని పట్టుబట్టుచుండెను. వృద్ధులందులకు సమ్మతించలేదు. ఇరువురకును ఈ విషయమున వాగ్వాదము చెలరేగెను. వృద్ధుడు—'ఏమైనను సరియె! నేను మాత్రము పైకిరాను. ఇచటనే పటేలునకీ గడ్డినిచ్చి తిండి తిని పడియుందును. నీవు పోదలచినచో పొమ్ము.' అని యచటనే నిలచిపోయెను. అతని భార్య భర్తను దూషించుచు— 'ఏమైనను సరియే! నేను పైకేగి యచటనే నాగడ్డి నమ్మెదను.' అని ముందునకు సాగిపోయెను.

వృద్ధుడు తన గడ్డిమోపు నెత్తుకొని పటేలు గృహమున కేగి గడ్డి తీసుకొని కూడుపెట్టవలసినదిగా ప్రార్థించెను. పటేలునకు గడ్డి యవసరములేదు. కాని ముసలినాడు కదలునట్లు లేడు. అందుచే పటేలు సమ్మతించి తిండిపెట్టెను. భోజన మొనర్చి యావృద్ధు డరుగుపై మేనువాల్చి కూనరాగము మొదలుపెట్టెను. అది విని పదిమంది ప్రోగయిరి. రాత్రి పదిగంటల వఱకును వృద్ధుడేవేవియో కథలు చెప్పి నిద్రించెను.

ముసలిది గడ్డిమోపు నెత్తుకొని పైకి బయలుదేరెను. త్రోవలో కాపలాదారు లామె నడ్డగించిరి. కాని చివరకామె యమంగళ సూచకములైన కూతలకును, అసభ్యమైన నోటికిని వెఱచి, ముసలిదని కనికరించి వదలిరి. ఆమె తిన్నగ నశ్వశాల వద్దకేగి యచటనున్న గడ్డివాములవద్ద తన మోపును దింపెను.

అశ్వశాలయందున్న సేవకులు ముసలిదానివద్ద గడ్డికొని యిచటకు పంపిరేమోనని యది యామెనేమియు ప్రశ్నింపలేదు. అంత నామె వారివద్దకేగి యారాత్రి కచట నిద్రించి యుదయమే లేచిపోదునని చెప్పి పండుకొనెను.

రాత్రి తొమ్మిది గంటలయ్యెను. బాబాజీ తన ప్రాణములపై నాశవదలుకొనెను. ఇప్పుడాతని ముఖమున విషాదము లేదు—శాంతభావ ముట్టిపడుచుండెను. ఆ విలక్షణమైన శాంతి యాతని ముఖమునకు మిక్కిలి యందమును చేకూర్చెను. ఇంతలో మహమ్మదీయ సర్దారగు ఫతేఖాను నలుగురైదుగురు మహమ్మదీయ సైనికుల వెంటపెట్టుకొని వచ్చి తలుపు తెఱచెను. లోన బాబాజీ నిశ్చల ధ్యాననిమగ్నుడై యుండెను. ఫతేఖాను తన యనుచరులకు— 'ఈ దుర్మార్గుని కోటబురుజుపైకి గొనిపొండు. నేటితో వీని ప్రాణములు సరి.' అని యాజ్ఞాపించెను. ఆజ్ఞను వినుటయే తడవుగ నా సైనికులు బాబాజీని బురుజుపైకి గొంపోయిరి. కొండ యంచున బాబాజీని దింపించి ఫతేఖాను బాబాజీతో — 'ఇప్పటికైనను ఆ గుడియందలి రహస్యమును చెప్పుము. శహాజీ కుమారుడైన యా దుర్మార్గుడెచట నున్నాడు? చెప్పితివా ప్రాణములు దక్కును. లేదా నా శక్తిని చూతువు' అనెను.

ఈ మాటలకు బాబాజీ యేమియు చలించలేదు. ఇంతలో పరితప్తుడై బ్రాహ్మణహత్యా పాతకమునకు వెఱచి, చివరిసారిగ బ్రతిమాలుటకై కిలేదారచటి కేతెంచి ఫతేఖానుతో—'సర్దార్జీ! నేనతనిని చాల పర్యాయము లడిగితిని.

కాని తనకేమియు తెలియదనుచున్నాడు. అట్టివానిని కేవల మనుమానపై వధించుట పాపము.' అనెను.

కలేదారు మాటలకు ఫతేఖాను — "నేను వీనిని వదలను. మీ మహారాష్ట్రులందరును కృతఘ్నులు. మిమ్ము లను నమ్ముటకు వీలులేదు. మీరందరును పరోక్షముగ కుట్ర దారులలో జేరినవారే!" అనెను.

కిలేదారు స్వామిభక్తుడు. సుల్తానునకుగల విశ్వాస పాత్రులలో నొకడు, తనశక్తి నంతయు సుల్తానుల క్షేమము నకై ధారవోసినవాడు. అట్టి స్వామిభక్తునకు ఫతేఖాను మాటలవలన గలిగిన దుఃఖమును మేము వర్ణించనక్కరలేదు. 'ఇన్నిరోజులనుండియు నేనొర్చిన సేవకిదియా ప్రతిఫలము. నా స్వామిభక్తిని వీరిట్లు పార్థ మొనర్చుకొనిరిగదా!' యని లోలోన దుఃఖించుచు నచటినుండి వెడలిపోయెను.

కిలేదారు వెడలిపోవుట తోడనే ఫతేఖాను తన యను చరులతో — 'ఈ కపటసన్యాసి కాలుసేతులు కలపికట్టుడు.' అని యాజ్ఞాపించెను. ఇంక నా తురకసైనికులకు కావలసిన దేమి? వెంటనే వారొక గొలుసుతో బాబాజీ కాలుసేతులు బంధించి కొండయంచునకు గొంపోయిరి. ఈ ఘాతుక కృత్య మును చూచి యచటకేతెంచియున్న కోమలహృదయములు జాలిగొన్నవి. కాని వారు చేయదగినదిలేదు. హహమ్మదీయుల ముందు వారి యాటలు సాగవు.

బాబాజీ నచటినుండి క్రిందకు దొర్లించి వధించుటకు సన్నాహములు పూర్తియైనవి. ఫతేఖాను నోటినుండి యాజ్ఞ

వెలువడుటకై యాతని యనుచరులు ప్రతీక్షించుచుండిరి. ఇంతలో నొక కోలాహలము వినవచ్చెను. ఆ కోలాహలము క్షణక్షణమునకును వృద్ధియగుచుండుటచే నందరును వెను దిరిగి చూచిరి. ఆశ్చర్యము! అశ్వశాలవద్దనున్న గడ్డివాము లన్నియు నంటుకొనెను. అగ్నిజ్వాల లాకసమున కెగయు చుండెను. కొలదిసేపటిలో చుట్టుప్రక్కలనున్న గృహములకు గూడ నా మంటలు వ్యాపించెను. అదేసమయమున కోటక్రింద నున్న పలేలు గడ్డివాములుకూడ తగులబడుచుండెను. ఇది చూచి బాబాజీ వధను దర్శించుటకై వచ్చిన వారందరును మంటల నార్పుటకై పరుగిడిరి. ఫతేఖానును, అతని నలుగు రైదుగు రనుచరులును మిగిలిరి. వారుకూడ నాశ్చర్యచకితులై మంటలవైపు జూచుచుండిరి. ఇంతలో కొండ వెనుకభాగమున నాలుగైదు కాగడాలు కనుపించెను. అవి మెల్లగ కొండపైకి వచ్చుచుండెను ఫతేఖా నాశ్చర్యముతో నాకాగడాలవైపు చూచుచుండెను. ఆ కాగడాల ప్రకాశములో నాతనికి పది మంది మనుష్యులు కనబడిరి. ఖాను వీరెవరై యుందురాయని యాలోచించుచుండగనే వారు గొండపైభాగమున కెక్కిరి. అచటినుండి పరుగుపరుగునవచ్చి ఖానును పట్టుకొనిరి. కొంత మంది ఖాను అనుచరుల నోటిలో గడ్డిని క్రుక్కి నేలపడవైచిరి. ఫతేఖాను కేకవేయబోయెను కాని యా యాగంతుకు లాతని నోటిలోగూడ గడ్డిని క్రుక్కుటచే వీలులేకపోయెను. ఆ నవా గంతుకులలోనున్న యొక తేజస్వియైన యువకుడు (శివాజీ) తన యనుచరులకు ముందుగ బాబాజీ బంధముల నూడదీసి

వారిని క్రిందకు గొంపోవుడని యాజ్ఞాపించెను, మరుక్షణముననే బాబాజీ బంధములూడినవి. ఇరువురు బలిష్ఠు లాతని నెత్తు కొని వెడలిపోయిరి. అనంతరము మిగిలినవారు ఖానును చంప బోయిరిగాని శివాజీ వారిని వారించి 'నిస్సహాయుని వధించుట హిందూధర్మమున నిషిద్ధము. వీనిని బంధించి వదలుడు. యుద్ధ క్షేత్రమున మనయెదట బడినప్పుడు వీని విషయము కను గొందము.' అనెను. వెంటనే అంతవఱకును బాబాజీ కాలు చేతుల నలంకరించిన గొలుసులతో ఖానును బంధించి వాని నచటనే వదలి వెళ్ళిపోయిరి.

అకస్మాత్తుగ కోటపైనను, క్రింద గ్రామమునందును గడ్డివాము లొక్కసారిగ నంటు కొనుట చూడ నాశ్చర్యముగ నుండెను. జనులా మంటల నార్పుటకు విశ్వప్రయత్న మొనర్చుచుండిరి. నాలుగైదు గంటలకా మంటలు చల్లారెను. అగ్ని రగుల్కొనుటకు గారణము పలువురు పలువిధముల జెప్పుకొనుచుండిరి గాని గడ్డి నమ్ముకొనుటకై వచ్చిన యా క్షుద్రజీవులవైపున కెవరి దృష్టియు పోలేదు. ఒకవేళ నాలు గైదు గంటల తరువాత నిప్పుడు వారికొఱకై వెదకినను లాభములేదు. వారాకోలాహలము రేగుటతోడనే పలాయన మంత్రము పఠించిరి.

అగ్ని రగుల్కొనిన వార్త కిలేదారునకు తెలిసెను. కాని బాబాజీ హత్యా విషయ మాతని మనసును కలవరపరచు చుండెను. అందుచే నాతడుబయటకైనను రాలేదు. అగ్ని నార్పుటకు సేవకులను మాత్రము పంపి మిన్నకుండెను. పది

పంౘెండు గృహముల నాహుతిగొని యగ్నిదేవుడు శాంతించి నాడను వార్త తెలిసిన తరువాత కిలేదారు బయటకువచ్చి బాబాజీ విషయమై తెలుసుకొనుటకు బయలుదేరెను. త్రోవలో నాతడు — 'ఈసరికి బాబాజీని క్రిందకు దొర్లించి యుందురు. నిష్కారణముగ మన కోటపై నొక బ్రహ్మహత్య జరిగినది. దానికి ఫలితముగ నగ్నిదేవుడు కుపితుడైనాడు. ఇంకేమి విపత్తులు రానున్నవో!' అనుకొనుచు నడచి బురుజుపై కేగెను. అచట నంతయు నిశ్శబ్దముగ నుండెను. ఆతడు బాబాజీ హత్యాకాండ సమాప్తమై యుండునని యెంచి మరి నాలుగడుగులు ముందునకు వైచెను. అతని కేదియో మూలుగు వినిపించెను. అది విని యాతడు త్వరత్వరగ నడచి యచటికి వెళ్ళి చూచుసరికి ఖాను బంధితుడై పడియుండెను. నోటిలో గడ్డి క్రుక్కబడియుండెను. సైనికులు నేలపైబడి దొర్లుచుండిరి. వెంటనే కిలేదారు ఖాను నోటిలోనున్న గడ్డిని తీసివైచెను. ఖాను నోరు స్వాధీనమునకు వచ్చుటతో నింత వఱకు లోన నణగియున్న కోపము పైకుబికినది. తన కోప మంతయు కిలేదారుపై చూపించుచు — 'ముందు నా బంధము లూడదీయుము. మీ మహారాష్ట్ర జాతియంతయు సంకరజాతి. మిమ్ములను ప్రాణములతో విడువరాదు. మీయంతు కనుగొని తీరుదును. పదిదినములలో నాంజనేయాలయమును నేలమట్ట మొనరించి యందలి రహస్యమును తెలుసుకొనజాలనిచో నేను మహమ్మదీయునకు జన్మించలేదని యెంచుము. అగ్ని

రగులొ్కనుటకు నీవే కారణము. నీ విషయమునుగూడ కను గొందును' అనుచు నోటికి వచ్చినట్లెల్ల వాగుచుండెను.

కిలేదారునకు ఖానుపై కోపమురాలేదు. బాబాజీని తాను రక్షింపజాలకపోయినను, ఎవరివలననైనను రక్షింపబడె గదాయని లోన సంతసించుచు ఖాను బంధముల నూడదీసెను. ఖాను లేచి గుడ్డలు దులుపుకొనుచు, మాటలలో మహారాష్ట్ర జాతిని నమలిమ్రింగుచు వెడలిపోయెను. కిలేదారు మిగిలిన సైనికులనుగూడ లేపి వారివలన జరిగిన యుదంతము తెలుసు కొని సంతసించెను.

ఇక బాబాజీని గొనిపోయి వారేమి చేయుచున్నారో తెలుసుకొందము. ఆ యిరువురును బాబాజీ నెత్తుకొని యొక మహారణ్యమధ్యమునకు జేరి తమ యనుచరుల రాకకై ప్రతీ క్షించుచుండిరి. కొంతసేపటికి మిగిలినవారుగూడ నచటికి జేరిరి! అంత శివాజీ యా వీరులను చూచి—'శబాస్! మీరొనర్చిన పని ప్రశంసనీయము. మీబోటి వీరులుండ నిక భయములేదు.' అనెను. ఈమాటలు వినినతనే యా మావలీ యువకుల సంతోషమునకు మేరలేదు. శివాజీ నోటివెంట 'శబాష్.' అను మాట వెలువడుటతో వారికి సామ్రాజ్యాధిపత్యమబ్బి నట్లుండెను. శివాజీ వారింగాంచి — 'నేటి పని ముగిసినది. మీరిక పొండు. ఎల్లుండి పూర్వనిశ్చిత ప్రదేశమునకు మరల రండు.' అనెను. ఈమాట విని మావలీ సైనికులు శివాజీకి నమస్కరించి వెడలిపోయిరి.

అంత శివాజీ తన యనుచరులైన యేసాజీ తానాజీలను మహారాష్ట్రవీరుని (నానాసాహెబు) బాబాజీని వెంటగొని బయలుదేరిరి. కొలదిసేపటికి వారాంజనేయాలయ భూగర్భమునకు జేరి భవానీమాతకు నమస్కరించి భావికర్తవ్యమును గూర్చి యాలోచించ మొదలిడిరి. శివాజీ తన యనుచరులతో— 'సోదరులారా! మన రహస్యస్థలము శత్రువుల దృష్టి నాకర్షించినది. నేడు పరాభూతుడైన ఖాను పగదీర్చుకొనుటకై మఱల నిచట కేతెంచును. అదియుంగాక మన యనుచరుల సంఖ్య నానాటికి వృద్ధియగుచున్నది. మనమిక దాగియుండుటసంభవము. కావున ప్రస్తుతము మనకొక కోట యవసరము. ముందు మనమొక కోటను హస్తగతమొనరించుకొని యిచట గల మన సాధన సంపత్తిని జేరవేయవలెను. మన నివాసమునకు, రక్షణకు, కార్యసాధనకు ననువైన కోట యేదియో ఆలోచించుడు' అనెను. శ్రీధరస్వామిగూడ శివాజీ మాటలను సమర్థించెను అందరును తమ తమ యాలోచనలయందు నిమగ్నులై యుండిరి. శివాజీ తీక్షణముగ నాలోచించుచు మధ్య మధ్య నానాజీ వంకకు సాభిప్రాయముగ చూచుచుండెను.

ఇట్లు కొంతకాలమైన తరువాత శివాజీ — 'నాకొక దుర్గము నచ్చినది. మీరుకూడ బాగుగ నాలోచించుడు. సుల్తానుగఢము మన కార్యమున కన్నివిధముల తగియున్నది. మన మిత్రు డీవిషయమున సాయమొనర్చినచో కృతార్థులము కాగలము.' అని నానాజీవంకకు చూచెను. అది విని నానాజీ—

'నాకును అదియే నచ్చినది. ఆ దుర్గపు రహస్యములన్నియు నేనెఱుగుదును. అచట మనకు సాయమొనర్చువారుగూడ చాలమంది కలరు.' అనెను.

ఇంతలో బయటినుండి యొక వ్యక్తి వచ్చి బాబాజీని బయటకు పిలచి చెవిలో నేదియో రహస్యము చెప్పెను. ఇది విని బాబాజీకి మొదట కొంత సంతోషము కలిగెను. కాని తరువాతి సమాచారముతో నాతనిముఖమున విషాదచ్ఛాయలు పొడసూపెను. బాబాజీ యావ్యక్తిని పంపివేసి లోనికేతెంచి శివాజీతో మెల్లగ నా రహస్యమును చెప్పెను. శివాజీ, బాబాజీలు విషాదముతో మాటిమాటికిని నానాజీవంక చూచుచుండుటచే నాతని హృదయమున నొక విధమైన యాందోళన బయలుదేరెను— 'స్వామీజీ! నా విషయమై మీరు దుఃఖించుచున్నట్లున్నది. ఏదైనను దుఃఖవార్త తెలియ వచ్చినదా? నాతో చెప్పుట కెందులకో సంశయించు చున్నారు. నేను దుఃఖింతుననియా? దుఃఖముతో కార్య విముఖుడ నగుదుననియా? దీనివలన మీరు నన్నింకను విశ్వ సించలేదని తెలియుచున్నది' అనెను.

ఇది విని బాబాజీ నానాజీతో—'వీరుడా! నిన్ను విశ్వ సించకపోవుట కాదు. ఈ దుఃఖవార్త నీ కెరింగించుటకు నోరు రాక మిన్నకుంటిని. నీవడుగుచున్నావుకాన చెప్పక తప్పదు. నీ తండ్రిని సకుటుంబముగ బంధించి తెచ్చుటకై సుల్తాను నొక సర్దారును పంపెనట. అతడు నీ తండ్రిని బీజపురము గొంపోవుచున్నాడట. ఈ విషయము దెలిసికొనిన నీ భార్య

యొక దినము ముందుగనే దాసినివెంటగొని యెటకో వెడలి పోయెనట' అనెను.

ఈ సమాచారమును వినుటతోడనే నానాజీ హృదయము కొంత చలించెను. అతని ముఖము విషాదాక్రాంత మయ్యెను. ఇది చూచి బాబాజీ—'దుఃఖింపకుము. నీభార్య వీరపత్ని. ఆత్మరక్షణార్థ మట్లుచేసినది. ఆమె యెచట నున్నదియు మూడు దినములలోపల నీకెఱింగింతును. దుఃఖింపకు ము.' అని యోదార్చెను. కొంతసేపటికి నానాజీ శోకోద్వేగము కోపముగ పరిణమించెను. పండ్లు పటపట గొరుకుచు — 'ఈ తురకలను సమూలము నాశనమొనరించినగాని హిందూజాతికి గత్యంతరములేదు. ఇఁక సుల్తాను గధమును హ స్తగత మొనరించుకొనుట కాలస్యము పట్టదు. దుర్మదాంధులైన యువకులు తమ చేతులతోడనే మూలోచ్ఛేదన మొనర్చుకొను చున్నారు' అనెను.

ఒక గంటసేపిట్లే గడచెను. తరువాత శివాజీలేచి భవానీమాత విగ్రహమునకు సాష్టాంగమొనర్చి ధ్యాన నిమగ్నుడయ్యెను.

# ౧౧

తన భార్యను వెంటబెట్టుకొని వెళ్ళుచు త్రోవలో శివాలయమువద్ద నొక మహమ్మదీయ సర్దారునకు చిక్కిన యువకుని విషయమును తెలుసుకొనుటకై మా పాఠకులు తొందరపడుచుందురని మేమెఱుగుదుము.

ఆ యువకుని చూచుటతోడనే సర్దారున కొకవిధమైన యాశ్చర్యము కలిగెను. అతడు యువకునితో సగౌరవముగ —'దయచేయుడు. ఇచట కూర్చుండుడు.' అని తన ప్రక్క నున్న యాసనము జూపెను. సర్దారు చూపిన గౌరవమున కా యువకుని కాశ్చర్యము కలిగెను. అతనికి సుభానుముందు తలయెత్తుటకు ధైర్యము చాలకుండెను. అతడు చేయునదిలేక కూర్చుండెను. అంత నా సర్దారు మఱల— 'తమ దేయూరు? తమరేమి చేయుచున్నారు? తమను చూచినంతనే తమతో స్నేహము చేయవలెనని బుద్ధిపుట్టుచున్నది. నన్ను పరాయి వానినిగ భావింపకుడు' అనెను.

ఇదివిని యా యువకుడు— 'అయ్యా! మా దిచటికి సమీపముననున్న చిన్నగ్రామము. నాకేమియు నుద్యోగము లేదు. నాభార్యతోగూడ నత్తవారింటి కేగుచుంటిని. త్రోవలో నాలయమున విశ్రమించి యుండగా నన్ను మీ సైనికులు మీ వద్దకు గొనివచ్చిరి. ప్రొద్దుబోవుచున్నది. మా కనుజ్ఞ నొసంగినచో వెళ్ళిపోదుము' అనెను.

"అంత తొందరపడెద రేమి? ఇచట మీ కెట్టి కష్టమును కలుగదు. నేను మిమ్ములను వదలియుండజాలను. నన్ను తమ స్నేహితునిగ భావించుకొనుడని మొదట నే ప్రార్థించితిని గదా! మీరు నాతోగూడ బీజపురము రండు. సుల్తానుతో జెప్పి మిమ్ము సర్దారు నొనరింతును. తమ భార్యను పంపవలెనన్నచో నా సైనికులు జాగ్రత్తగ పుట్టింటివద్ద దింపి వత్తురు. మీ కభ్యంతరము లేనిచో మీవెంట నుండ నిండు." అనెను.

యువకు డచటినుండి తప్పించుకొనుట కెంతయో ప్రయత్నించెను. కాని యాతని అనునయవినయములన్నియు విఫలమగుటయేగాక యువకుని అనునయ వినయవాక్యములా సర్దారును మఱింత యాకర్షించెను. అతడు కనురెప్ప వాల్చకుఁడ నాతనివైపునకే చూచుచుండెను. ఆ యువకుని వైపెంతసేపు చూచినను తనివితీరుటలేదు. అతనితో నెంతసేపు మాట్లాడినను తృప్తి కలుఁగుటలేదు. ఇఁక చేయునదిలేక యువకు డాతని ననుసరించుటకు సమ్మతించెను. అతఁడు సమ్మతించుటతో సర్దారున కమితానందము కలిగెను. వారికి

వలయు నేర్పాట్లు చేయుటకై సుభానును నియమించి తన సైనికులకు ముందునకు సాగుట కనుజ్ఞనిచ్చెను. సుభానున కిది యంతయు నాశ్చర్యముగ నుండెను. వీరి మూలమున తన ప్రాణములు దక్కెననియు, ఏదియో రూపమున వారివద్ద నుండు అవకాశమేర్పడెననియు సుభాను సంతసించెను.

మరునాడుదయము మఱల సైనికులు పయనమైరి. సర్దారు యువకునియొద్దకేతెంచి యాతని ప్రయాణములకు వలయు నేర్పాట్లొనరించెను. యువకునికంతయు నగమ్యగోచర ముగ నుండెను. ఇప్పుడు వీరివద్దనుండి తప్పించుకొని పారి పోవుట యసంభవము. మంచిమాటలతో ప్రార్థించినను లాభములేకుండెను. అతఁడు చేయునదిలేక సర్దారు చెప్పిన చొప్పున బయలుదేరెను. సుభాను యువకునిభార్య వెంట నుండెను.

సైనికులు సులతానుగఢము దిక్కునకే నడచుచుండిరి. యువకుఁడా విషయమును కనిపెట్టెను. సులతానుగఢము సమీ పించుకొలదియు నాతని హృదయము వేగముగ కొట్టుకొన దొడంగెను. సాయం సమయమునకు వారందరు సులతాను పురమును సమీపించిరి. ఊరిబయటనే గుడారములు వేయ బడెను. యువకునికొఱకొక ప్రత్యేక గుడారము నిర్మింపబడెను. సైన్యమంతయు విశ్రమించిన తరువాత,సర్దారు యువకునివద్ద కేతెంచి "మిత్రమా! నేను సుల్తానుపంపిన యాజ్ఞ నెఱింగించు టకై కిలేదారువద్దకు పోవుచుంటిని. నీవు నా యాంతరంగిక మిత్రుడవు. నీవుగూడ నాతోడ రమ్ము. పెద్దలతో పరిచయ

మగుటయేగాక రాచకార్యములుగూడ నలవాటగును. నిన్ను వదలి నే నొంటరిగ పోవుటకు మనసొప్పుటలేదు" అని ప్రార్థించెను.

అందులకాయువకుడు — "సర్దార్జీ! తమకు నాపై గల యాదరమునకు గృతజ్ఞుడను. నేను కిలేదారువద్ద కేతెంచుట మంచిదికాదు. మా యిరువురకును సరిపడదు. సాధ్యమైనంత వఱకు నేను కిలేదారు కంటబడకుండుటయే మంచిది. అన్యథా తలచక మీరు పోయిరండు." అనెను. సర్దారెంత ప్రాధేయ పడినను యువకుడు వినలేదు. చేయునదిలేక త్వరలో వత్తునని చెప్పి యాతడు బయలుదేరెను.

ఈ సర్దారు మిగిలిన మహమ్మదీయ సర్దారులవలె క్రూరుడుకాడు. వివేకము కలవాడు, మంచి రాజనీతిజ్ఞుడు. మంచితనముతో నెంతటి పనులైనను నిర్వర్తింపవచ్చునను విశ్వాసము గలవాడు. సులతానున కీతనిపై విశ్వాసము మెండు. బుద్ధిచాకచక్యముతో నెఱవేర్చవలసిన కార్యములం దీతనినే నియోగించుచుండును. ప్రస్తుతము సుల్తానీతనిని సుల్తాను గఢపు కిలేదారును సపరివారముగ బంధించి గొనిరమ్మని పంపెను.

సర్దారు కిలేదారువద్దకేగి సగౌరవముగ నమస్కరించి —"అయ్యా! నేను రాజాజ్ఞ కుబద్ధుడను. తమను సపరివార ముగ బంధించి గొనిరమ్మని సుల్తానునాజ్ఞ. మీరు నావెంట రండు. మీ పరివారమును మాత్ర మిచటనే యుంచుడు. త్రోవలోగాని, బీజపుర మేగినపిమ్మటగాని మీ గౌరవమున

కెట్టి భంగమును రానీయను. నామాటనమ్ముడు. మీరుగూడ నేదో రాజకార్యమునకై బీజపురమేగు చున్నట్లు ప్రయాణమై రండు. ఉదయమే బయలుదేరుదము.' అనెను. కిలేదారున కీ విషయము ముందుగ నే తెలియును. పరిస్థితిట్లు విషమించు నని యాతడెరుంగును. అందుచే గత్యంతరము లేక సమ్మతించెను.

సర్దారు తన శిబిరమునకు తిరిగివచ్చి యువకుని కొఱకు కబురంపెను. ఆసమాచారమునువిని యువకుడు సర్దారున్న శిబిరమున కేతెంచి నమస్కరించి నిలువబడెను. అంత సర్దారు —"మిత్రమా! నేనెంత హృదయమిచ్చినను నీవు నన్నన్యునిగనే భావించుచున్నావు. కూర్చుండుము' అని తాను కిలేదారునితో జెప్పినమాటలను వినిపించి ఉదయమే మన ప్రయాణము. బీజపురమేగినతోడనే మిమ్ము సుల్తానునకు పరిచయ మొనర్చి సర్దారు నొనరింతును. త్రోవలో కిలేదారునకు దుఃఖము కలుగకుండ మనమాతని వెంటనుండవలెను" అనెను.

యువకుడిదివిని—'సర్దార్జీ! మీ యాదరణకు గృతజ్ఞుడను. నాకు సర్దారు పదవి యవసరము లేదు. నేను కిలేదారు కంటబడకూడదని మీ కిదివఱకే చెప్పియుంటిని. ఆయన కుమారుడు పారిపోయిన విషయము తమకు తెలియును. నేనతని స్నేహితులలో నొకడను. ఆతడు పారిపోవుటకు నేను సాయమొనర్చితినని కిలేదారు నాపై మండిపడుచున్నాడు. నేను వారితో గలసి బీజపురము రాను. దయయుంచి నన్ను

వదలుము. ఇంటికి పోదును. లేదా, నాశిబిరమొక మజిలీ ముందుండునట్లేర్పాటు గావింపుడు.' అనెను.

యువకునితో గూడ ప్రయాణమొనర్చుట సర్దారునకు సరదాగా నుండెను. అతనిని జూడనిదే సర్దారునకు సమయము గడచునట్లులేదు. తాను కిలేదారు వెంట నుండవలెను. యువక మిత్రుని ఒక మజిలీముందుంచవలెను. ఈ మిత్రవియోగము సర్దారున కసహ్యముగ నుండెను. కాని చేయునదిలేక యంగీక రించెను.

అప్పటికే రాత్రి తొమ్మిదిగంటలయ్యెను. సర్దారువద్ద శలవుగైకొని యువకుడు తన శిబిరమున కేగి నిద్రించెను. ఒక సేవకుడువచ్చి సర్దారును భోజనమునకు పిలచెను. కాని సర్దా రాకలిలేదనిచెప్పి వానిని బంపివేసి నిద్రించుటకేగెను. అత డెంతయో ప్రయత్నించెను గాని నిద్రపట్టలేదు. రాత్రి పండ్రెండు గంటలయ్యెను. అతని బాధ చెప్పనలవిగాకుండెను. నిద్రాదేవి నాతడెన్నియోవిధముల నాహ్వానించెనుగాని యామె దఱిజేరలేదు. అంత నతఁడేమియు దోచక బయటకు వచ్చి యటునిటు పచారులు చేయుచు నాలోచించుచుండెను. అతఁడు మాటిమాటికిని యువకుడున్న శిబిరమువైపునకు జూచి నిట్టూర్పు పుచ్చుచుండెను. ఆలోచనానిమగ్నుడై తనకు తెలియకుండగనే యువకుని శిబిరమువైపునకు గొంత దూరమేగి మఱల ప్రకృతస్థుడై మఱలివచ్చుచుండెను. ఈతని చేష్టలన్నిటిని కాపలాకాయుచున్న అహమదు గ్రహించినాఁడు. అతడు మెల్లగ సర్దారుచెంతకేగి స్వామియనుగ్రహము

సంపాదింపగోరు సేవకుని విధముగ—"సర్దార్జీ! తామింత యర్ధ రాత్రియైనను నిద్రించలేదు. మీరెందులకో మనోవ్యాకులత నొందినట్లున్నారు. ఆయువకుని శిబిరమువైపునకు దృష్టిసారించి నిట్టూర్పుపుచ్చుచున్నారు.దీనికై యింత వ్యాకులత యేల? ఈ సేవకునికాజ్ఞ, నిచ్చినచో...'అనియింకేమియో మాట్లాడ బోవునంతలో సర్దారు—' ఛీ! నోరుమూయుము! నీవెవరితో మాట్లాడుచుంటివోగూడ నీకు తెలియకున్నది. 'హొమ్మ్.' అని గద్దించెను. కాని సేవకుడు తన మనోగతాభిప్రాయమును గ్రహించినాడని యాతని మనసులోని విచారము ముఖమున వ్యక్తమగుచుండెను. అహామదింకేమియూ మాటలాడక వెడలి పోయెను. సర్దారున కా రాత్రి యంతయు నిదుర లేదు. మరునాడుదయమే పూర్వ నిర్ణయానుసారము కిలేదారుని వెంటగొని పయనమై కతిపయదివసములకు బీజపురము జేరిరి.

ఇచట బీజపూరు సుల్తాను విషయమును, ఆనాటి పరి పాలనా పరిస్థితులను కొలదిగనైనను మా పాఠకుల కెఱుక పఱచు టవసరము. ఆ కాలమున బీజపురమును ఆదిల్షా పరిపాలించుచుండెను. అతని కాలమున బీజపుర మత్యున్నత స్థితియందున్నను నాతని కాలముననే రాజ్యావనతికి చిహ్న ములు బొడసూపెను. ఒకే చక్రవర్తి కాలమున రాజ్య మున్నతస్థితికివచ్చి యవనతికి బొల్పడు టాశ్చర్యము. ఆదిల్షా రాజ్యమునకు వచ్చునప్పటి కాతని వయస్సు పదిహేను సంవ త్సరములు మాత్రమే! పేరున కాతఁడు రాజైనను రాజ కార్యముల నన్నిటిని షాజీ, భోన్సలే, మురారిపంతు, మున్నగు

విశ్వాసపాత్రులైన సర్దారులు నిర్వహించుచుండిరి. స్వామి భక్తి పరాయణులైన యా వీరులు రాజ్యమును సుదృఢ మొనరించుటతోబాటు రాజ్యమును బాగుగ వ్యాపింప జేసిరి. ఆ కాలమున బీజపూరు రాజ్యమును కబళించవలెనని మొగలు లెన్ని ప్రయత్నము లొనరించినను పై జెప్పిన వీరులు వారి యాటలను సాగనీయలేదు.

ఆదిల్‌షా పెద్దవాడైన నాటినుండియు పరిస్థితులు మారి పోయినవి. అతడసమర్థుడు. పరిపాలనా వ్యవహారములం దాతని కాసక్తి యున్నట్లు తోచలేదు. షాజీ మున్నగు సర్దారుల కయిష్టులైన కొంతమంది మహమ్మదీయ సర్దారులు సుల్తానును వశపఱచుకొనిరి. సయ్యదుఖాను మున్నగు నీచు లనేకములగు ప్రలోభనములజూపి రాజ్య పాలనమును హస్తగత మొనరించుకొనవలెనని ప్రయత్నించు చుండిరి. తమ యెడల నౌదాసీన్యము జూపుచుండుటచే షాజీ, మురారు పంతు మున్నగువా రధికజోక్యము కల్గించుకొనుట మానివేసిరి. అవసరమైనప్పుడు మాత్రము తగిన సలహా లిచ్చుచుండిరి. ఉచ్ఛృంఖలులైన మహమ్మదీయ సైనికు లొనర్చు దుండగములకు ప్రజ లసంతుష్టులై యుండిరి.

సుల్తానునకు భోగవిలాసములే పరమావధి. ఈమధ్యనే సయ్యదుఖాను రంభావతి యను నొక మహారాష్ట్ర యువతిని గొనివచ్చి సుల్తానునకు సమర్పించి విశ్వాసపాత్రు డయ్యెను. మొదట సామాన్య సైనికుడైన ఖానీపరాక్రమ ప్రదర్శనముతో రాజుగారి మన్ననలకు పాత్రుడై సర్దారయ్యెను.

సర్దారైన నాటినుండియు నాతడు సుల్తాను గఢమును హస్తగత మొనరించుకొని కిలేదారు కావలెనని యాలోచించుచుండెను. అంతియగాక నానాసాహేబు ధర్మపత్నియగు పద్మాబాయి నెట్లైనను వశపఱచుకొనవలెనని తలచుచుండెను. అందుకై అతడు సులతాను గఢముపై గొంతమంది గూఢచారుల నియమించి యచటివిషయము లెప్పటికప్పుడు తెలుసుకొనుచుండెను. ఆ గూఢచారులలో ముఖ్యుడు సర్ఫోజీ. ఖానొకనాటి రేయి సర్ఫోజీతో రహస్యముగ సంభాషించుటయు, రాముడు సుభాషలు వినుటయు మా పాఠకు లెఱుంగుదురు.

ఖానునకు ముఖ్యులలో ప్యారేఖానొకడు. అతడు సూర్యాజీ భార్యనెట్లైనను, పొందితీరవలెనని నిశ్చయించుకొనెను. అందులకై యాతడు ధారాగ్రామమున పటేలు గృహమునకేగి ఘాతుక కృత్యములొనరించుటయు, చివఱకు బాలుని చేతిలో మరణించుటయు మా పాఠకులిదివఱలో చదివి యుండిరి. పాపము ఖాను మిత్రవియోగమునకై చాల చింతించెను. తన మిత్రుడు సఫలుడై తన ప్రియురాలిని వెంట గొని వచ్చుననియు, కొలది దినములలో దానుగూడ తన ప్రేయసిని (నానాజీ భార్యను) పొందవచ్చుననియు నువ్విళ్ళూరెను! కాని యన్నియు నాతని యాలోచనలకు వ్యతిరేకముగనే జరిగెను. మిత్రుడైన ప్యారేఖానచటనే మఱణించెను. రంగారావును గొనివచ్చుటకు ఖానునుపంపకుండ సుల్తాను రణదుల్లాఖాన్‌ను పంపెను. దీనితో సయ్యదుఖానునకు చాల దుఃఖము కలిగెను. కాని 'రణదుల్లాఖాను కిలేదారును సపరివారముగ బంధించి

గొనివచ్చునుగదా ! ఇచటికి వచ్చిన పిమ్మట మన పని నెఱ వేరున'ని యెంచెను. కాని యదియు నతనికి విరుద్ధముగనే జరిగెను. రణదుల్లాఖాను సుల్తానుగఢ మేగి కిలేదారును సగౌరవముగ గొనివచ్చెను. ఇంతకంటెను కిలేదారు పరివారమును గొనిరాకపోవుట — ముఖ్యముగ పద్మాబాయిని గొనిరాక పోవుట ఖానున కెక్కువ విచారమును కలిగించెను.

ఖాను స్వయముగ సులతానుగఢ మేగుట కుబలాటపడెను. అచటికేగి తానొనర్పదలచిన ఘనకార్యములను ముందుగనే నిర్ణయించుకొనెను. కాని సరియైన తరుణములో సుల్తాను రంగప్పరావును గొనివచ్చుటకై రణదుల్లాఖానును బంపెను. అట్లని సుల్తానునకు ఖానుపైకంటె రణదుల్లాఖానుపై విశ్వాసమెక్కువ యని తలచరాదు. ఖానున కంతకంటె బాధ్యతతో గూడిన పని యొప్పగింపఁబడెను. అదియునుగాక మురారు పంతు సయ్యదును సుల్తానుగఢమునకు పంపుట యుక్తముకాదని సులతానుత ' చెప్పెను.

ఇది యిట్లుండ పురందరుదుర్గ ప్రాంతములందు శివాజీ తన యనుచరులతో గూడి యల్లరి చేయుచున్నాడని యెఱిగి, ఆతని నణచుటకై మురారుపంతునకు అన్నకుమారుడైన శివదేవరావును పంపుచు నాతనికి తోడుగ మరియొక మహామ్మదీయ సర్దారును పంపెను. వారిరువురివిషయమును బాబాజీని బంధించిన పరిచ్ఛేదమందు తెలుసుకొనియుంటిమి. ఆ మహామ్మదీయ సర్దారు సయ్యదుఖానుకు పరమభక్తుఁడు. అతడు బాబాజీని బంధించుటయు, ఎవరో కొందరు వచ్చి తన్ను బంధించి

బాబాజీని విడిపించుకొని వెళ్ళుటయు, శివదేవరావు విప్లవకారులతో కలిసి తనకు సాయమొనర్పలేదనియు సయ్యదుఖానుతో జెప్పెను. తన యనుచరునకు సంభవించిన కష్టములకు ఖాను చింతించి తగిన ప్రతీకార మొనర్పుటకై వేచియుండెను. అతనికి శివదేవరావు, మురారిపంతు, రణదుల్లాఖానులపై ద్వేషమధికమయ్యెను. ఎట్లయినను సుల్తానుతో జెప్పి యీ మువ్వురిపైనను సుల్తానునకుగల యభిమానమును తొలగించి తాను పలుకుబడిని సంపాదింప యత్నించుచుండెను.

# ౧౨

రాముడు చెప్పిన సమాచారమును విని వృద్ధుడొక నల్లని బలిష్ఠుడైన యువకుని సూర్యాజీ భార్యను రక్షించుటకై పంపుటయు, అతడామెను మంటలలోనుండి రక్షించి కొనివచ్చుటయు పాఠకులకు గుర్తుండి యుండును. ఆ వృద్ధుడు వారికొఱకై కుటీర మొకదానిని నిర్మింపజేసెను. రాముడును ఆ నల్లని యువకుడును వారికి సపర్యలు చేయుచుండిరి. వృద్ధుడు మాత్రము తన పూర్వపు కుటీరములో నటునిటు పచారులు చేయుచు తనలో తానేదిగో ఆలోచించుచుండెను—"ఎంతటి వారికైనను విధితప్పించుకో వశముకాదు. నా జీవితమున నెంత మార్పు వచ్చినది! వెనుకటి జీవితమునకును నేటిజీవితమునకును పోలికలేదు. సర్వస్వము నాశనమైనది. ఇంక నేనెందులకు బ్రతికియుంటినో తెలియదు. ఆ దుర్మార్గులు నా సర్వస్వము నపహరించిరి. పిల్లయైనను సుఖముగ జీవితము గడపుచున్నది గదాయని సంతసించి యీ యరణ్యమున నజ్ఞాతవాస మొనర్చు

చుంటిని. ఆ దుష్టులామాత్రపు సుఖమునైనను చూడజాల రైరి. ఆమె సంసారమును నాశనమొనర్చిరి ఆ దుష్టులను సంహరించి తగిన ప్రతీకార మొనర్పవలెనని ప్రాణముల నిల బెట్టుకొంటిమి. లేనిచో మా యిరువురకును ప్రపంచముతో నిక పనేమి? ఎన్ని దినములు గడచినను ప్రతిజ్ఞ నెఱ వేరుటలేదు. నా సర్వనాశనమునకు గారకుడైన వానిని వధిం చినగాని నా మనసునకు శాంతిలేదు. నా ప్రతిజ్ఞను నిర్వ హించగలనను యాశ సన్నగిలుచున్నది. ఈ యజ్ఞాతవాసమున పరివారము వృద్ధియగుచున్నది. ఈ బాలు డెవడనుండియో వచ్చినాడు. సూర్యాజీభార్య, కుమారుడు... పరివారము వృద్ధియగుచున్నది. ఇకలాభము లేదు.” అని యేమేమో యాలోచించు చుండెను.

ఇంతలో రాముడువచ్చి— “దాదా! ఆమె పిచ్చి ధోరణి తగ్గలేదు. పిల్లవానిస్థితి ప్రమాదముగ నున్నది. ఒక పర్యాయ మచటకురమ్ము.” అనెను. ఇదివిని యా వృద్ధుడు రాముని వెంట బయలుదేరి యచటకు గొలదిదూరమున పొదల మాటుననున్న కుటీరమునకేగెను. కుటీరమంతయు నిశ్శబ్దముగ నుండెను. ఒకమూల మంచముపై సూర్యాజీభార్య చైతన్యహీనయై పడియుండెను. ఆమెను దగ్గరగ నామె కుమా రుడు మరణాసన్నుడై యుండెను. వేరొకమూల మరియొక వ్యక్తి గాయములవలన బాధపడుచు మూల్గుచుండెను.

వృద్ధుడు కుటీరములోనికేతెంచి వెంటనే శిశువు నెత్తు కొనెను. ఆబాలుని వైఖరిచూడ బ్రతుకునట్లులేదు. శరీర

మంతయు చల్లపడుచుండెను. అతికష్టముపై శ్వాస వెడలు చుండెను. వృద్ధుడు చింతాక్రాంతుడై బాలునిజూచి దుఃఖించుచుండెను. ఇంతలో నెచటినుండియో మనకు పూర్వపరిచితుడైన నల్లని యువకుడేతెంచెను. అతని జూచినంతనే వృద్ధుడు—'రాణోజీ! ఈ బాలుని యంత్య సమయ మాసన్నమైనది. ఇక మన మీతనిని రక్షించజాలము. విధి మనకు ప్రతికూలమై యున్నది.' అనుచుండగనే వృద్ధుని చేతిలోని బాలుడు కనులు తేలవైచెను, శరీరము కట్టెయై పోయెను. ఇంతలో ప్రక్కనున్న మంచముపై నుండి సూర్యాజీ భార్య యకస్మాత్తుగ లేచి— 'నా బిడ్డడేడి? ఆ దుర్మార్గుడు మెడ పిసికినాడా? నేను నా బిడ్డను చావనివ్వను.' అనుచు మరల ప్రక్కపై బడెను. రాణోజీ వెంటనే యామెవద్దకేగి యామెను పరుండబెట్టి వృద్ధునివద్దకేతెంచెను. వేరొక మంచముపై మూల్గుచున్నవ్యక్తి 'దాహము, దాహము' ని కేకవేసెను. రాముడాతనివద్దకేగి మంచినీ రందించెను.

వృద్ధుడు దుఃఖాక్రాంతుడై—"రాణోజీ! ఇక మనము బ్రతుకుట వ్యర్థము. మన ప్రతిజ్ఞ నెఱవేరుటకల్ల. మన మిట్లెన్ని దినములు చోరులవలె దాగియుందుము? ఛీ! ఈ బ్రతుకేల? మన బ్రతుకు మహారాష్ట్రజాతికే కళంకము! సూర్యాజీ వంశాంకురమునైన నను రక్షించలేకపోతిమి. ఈమె లేచి 'నాబిడ్డడేడి?' యని యడిగినచో నేమి సమాధాన మిత్తును?" అనెను.

'దాదాజీ! మీరు దుఃఖించవద్దు. నేను ప్రతిజ్ఞ నెఱ వేర్చి తీరుదును. మన సర్వనాశనమొనరించిన యావ్యక్తి

వక్షస్థలము చీల్చి స్నానమూడెదను. మూడు నెలలలోపల నా ప్రతిజ్ఞ నెఱవేర్తును. నేనిపుడే బయలుదేరిపోవుచున్నాను. నేటికి సరిగ మూడు నెలలలోపల వానిని వధించి వాని రక్తముతో మీ పాదముల దడుపుదును. లేనిచో మీకీ ముఖము జూపను. మీరు మాత్రము నేటికి మూడవ నెల చివరిరోజు వఱకును నాకై ప్రతీక్షించుడు. ఆనాటికి చేను ప్రతిజ్ఞానిర్వహణ మొనరించి మగిడి రానిచో నేను లేనట్లే భావించుకొనుడు. ఈ శిశుశవమును నాకిండు. దీని నెచటనైనను ఖనన మొనరించిపోదును.' అని యాశవమును గైకొని బయలుదేరెను. రాముడుగూడ వాని ననుసరించెను.

వృద్ధుని నోటివెంట మాటరాలేదు. నిశ్చేష్టుడై నిలువబడియుండెను. అతని మస్తిష్కమునసేవో యాలోచనలావిర్భావతిరోభావములనందుచుండెను. కొంతసేపటికిరాముడు తిరిగి వచ్చెను. వానిని జూచి వృద్ధుడు ప్రకృతస్థుడై — 'రామూ! రాణోజీ యేమనినాడు? ఎచటకేగినాడు?' అని ప్రశ్నించెను. రాముడు — "దాదాజీ! శిశుశవమును త్రోవలో పూడ్చివైచి తానెచటికో బయలుదేరిపోయెను. వెళ్ళునప్పుడు నాతో 'దాదాజీని మూడునెలలు మాత్రము నాకై ప్రతీక్షించుమని చెప్పుము' అని చెప్పి వెడలిపోయెను" అనెను.

ఇంతలో సూర్యాజీ భార్య — 'రమ్ము నాయనా రమ్ము! పాలుత్రాగుము. ఆ దుర్మార్గుని చంపుదువులే! అయ్యో! నా పిల్లవానిని చంపుచున్నాడు. రక్షించుడు.'

అనుచు పిచ్చికేకలు వైచుచు లేచెను. ఇది విని వృద్ధుడామె వద్దకేగి మెల్లగ పరుండబెట్టుచుండగనే మరియొక మూలనున్న క్షతగాత్రుడు — 'అయ్యో! చచ్చితిని! బాధ! దాహము' అనుచు కేకవేసెను. రాముడాతనియొద్దకేగి మంచినీరందించెను. ఇట్లు వారిరువురకును రోగుల సేవజేయుటలో సమయమంతయు గడచుచుండెను. నిర్జన ప్రదేశము. అజ్ఞాతవాసము - రోగులు! వారికి శుశ్రూషచేయు టెంత కష్టమో పాఠకులకు తెలియనిది కాదు.

కొంతసేపైన తరువాత రాముడు వృద్ధునితో — "బాబాజీ! మనము వీరికి సేవచేయజాలము. మా యమ్మను గొనివత్తును. ఆమె చాల మంచిది. ఈ విషయము తెలిసి నంతనే మారుమాటాడక పరువెత్తుకొనుచు వచ్చును. రెండు రోజులలో మా యమ్మను గొనివత్తును." అనెను.

ఇది విని యా వృద్ధుడు — "వలదు. ఇచట మన పరివార మెక్కువగుచున్నది. మీతల్లిని నే నెఱుగకబోలేదు" అని నాలుక కొఱుకుకొనెను. నా తల్లి నీత డెట్లెఱుగును? మా తల్లి ముసలివాని విషయమై యెన్నడును నాతో జెప్పి యుండలేదే! ఒక పర్యాయము మాత్ర మెప్పుడో తన పూర్వపు యజమాని చాల దయా స్వభావుడనియు, నాతని పరిస్థితి చెడిపోయెననియు మాత్రము చెప్పి యున్నది. ఆత కాదుగదా!' యని లోలోన నాలోచించుకొనుచు — "దాదాజీ! పరవాలేదు. ఆమె వచ్చినచో మనకష్టములు గట్టెక్కును. వెంటనే గొనివత్తును." అనెను. వృద్ధుడిక

బాలునిమాట కాదనజాలక పోయెను. రాముడు వృద్ధుని యనుజ్ఞ గొని బయలుదేరెను.

ఆ రాత్రి యంతయు వృద్ధు డారోగులవద్దనే కూర్చుండి గడపెను. మరునా డుదయమే యాతడు తన పూర్వకుటీరము వద్ద కేగెను. కుటీరమువైపు చూచినంతనే వృద్ధున కేదియో యనుమానము కలిగెను. అతఁడొకింత వెనుకకు తగ్గి కుటీరపు వెనుకభాగమున కేగి కిటికీ సందులోనుండి తొంగి చూచెను. అతనికి లోన నెవరో కన్పించిరి గాబోలును, మెల్లగ నచటి నుండి మఱలిపోయెను. ఆనాటి సాయంకాలముననే రాముడు తన తల్లిని వెంటగొనివచ్చెను. కాని యాతఁడు వచ్చునప్పటికి కుటీరమంతయు ఖాళీగా నుండెను. రామున కేమి చేయ వలెనో తోచలేదు.

రాముని కింక ర్తవ్యతా మూఢస్థితియందు వదలి మన మొకసారి శివాజీ విషయ మాలోచించవలసి యున్నది. శివాజీని భవానీమాత ముందు ధ్యానమగ్నుడై యుండగా వదలివేసితిమి. ఇప్పు డాతని విషయ మించుక తెలుసుకొనుట యుక్తము.

శివాజీ యట్లు ధ్యానావస్థితుడై యుండెను. అతనికి బాహ్యస్ఫురణ లేదు. బాబాజీ మాత్రము శివాజీ ముఖము వంక కుతూహలముతో జూచుచుండెడు. యేసాజీ, తానాజీ, నానాజీలు తమతమ యాలోచనలందు నిమగ్నులై యుండిరి. ఇట్లొక ఘడియకాలము గడచినంతనే అకస్మాత్తుగ శివాజీ నోటివెంట "ధైర్యముతో ముందునకు సాగుము. కార్య

సాఫల్యమగును, కాని కార్యాచరణయందు బహుజాగరూకు డవై యుండుము. జయము నిశ్చయము." అను వాక్యములు వెలువడెను. బాబాజీ యీ వాక్యముల కొఱకే ప్రతీక్షించు చుండెను. ఈ మాటలు వినినంతనే శ్రీధరస్వామి ముఖము వికసించెను.

నాలుగైదు నిముసములైన పిమ్మట శివాజీ లేచి కూర్చుండి బాబాజీ వైపె ప్రశ్నసూచకములగు చూపుల నిగిడ్చెను. అదిగాంచి బాబాజీ—'శివా! భయములేదు. ధైర్యముతో ముందునకు సాగుము. కార్యసాఫల్య మగును. కాని కార్యాచరణయందు బహుజాగరూకుడవై యుండుము. జయము నిశ్చయము. ఇది భవానీమాత యాదేశము. లెమ్ము. జాగరూకుడవై కార్యక్షేత్రమున నడుగిడుము." అనెను. ఈ మాటలువినినంతనే శివాజీ కమితానందము కలిగెను— 'స్వామీజీ! భవానీమాతకు మనపై పరిపూర్ణమైన దయ యున్నది. ఇంక సుల్తానుగఢము చేజిక్కినట్లే!'

"శివా! దేవివాక్కులలో 'కాని కార్యాచరణమునందు బహు జాగరూకుడవై యుండుము.' అను వాక్యము సదా జ్ఞప్తియందుంచుకొన దగినది. కిలేదారును గొనిపోవుటచే దుర్గము మన స్వాధీనమగుటలో సందేహములేదు. కాని ముందుగ మన మాప్రాంతపు జనులను మనవైపున కాకర్షించు కొనవలెను బహుశః కొలదిదినములలో సయ్యదుఖాను కిలేదా రగును. అతడు హిందువులను హింసించకమానడు. అతని హింసలజూచి ప్రజలు మహమ్మదీయ పరిపాలన సేవగించు

కొందురు. అప్పుడు మన జయము సుస్థిరము కాగలదు. ప్రజల సానుభూతిలేని జయము క్షణికము. ఈ లోపుగ మనము బీజపురమేగి యచటిపరిస్థితులను తెలుసుకొన వలసియున్నది. ఏమైనను మూడు నెలలలోపలదుర్గమును హస్తగత మొనరించుకొనవలెను. ముందు కిలేదారు నెచటదాచిరో గ్రహించి బంధముక్తు నొనరింపవలెను. అట్లగుచో వారుగూడ మన పక్షమున జేరవచ్చును. అప్పుడు మనపని సులభముగ నెఱవేరును. మన యేసాజీ తానాజీలు మారువేసముల బీజపురమేగి యచటి సమాచారముల దెల్పుచుందురు. తరువాత మన కార్యక్రమమును నిర్ణయించుకొందము.” అనెను.

ఈ మాటల కందరును సమ్మతించిరి. శివాజీయాజ్ఞ ప్రకారము యేసాజీ తానాజీలు బీజపురము పయనమైరి. నానాజీగూడ శివాజీ యనుజ్ఞగొని వారి వెంట బయలుదేరెను. వారి నందరను పంపివేసి శివాజీ విశ్రమించుటకేగిన పిమ్మట బాబాజీ యేదియో ఆలోచించుచు కూర్చుండెను.

కొంతసేపటికి బాబాజీ స్వప్నమునుండి మేల్కాంచిన వానివలె కండ్లు తెఱచి — ‘ఏమి యీ సాక్షాత్కారము! ఎంత పొరపాటు జరిగినది. గురూజీకి కబురంపుటయే మఱచితిని. అందువలననే యిట్టి సాక్షాత్కారమైనది.’ యనకొని మనసులో గురువైన రామదాసునకు నమస్కరించి ఆలయ ప్రాంగణమున నున్న నూతివద్దకు వచ్చెను. బాబాజీవంటి వేరొక సాధుపుంగవుడా నూతియొద్ద కూర్చుండియుండెను. బాబాజీ యాతనింజూచి పరుగునబోయి కౌగిలించుకొని

'శ్రీచరణములవద్దనుండి సందేశమేమైననున్నదా ?' యని ప్రశ్నించెను. ఆ నూత్న సన్యాసి తన సంచిలోనుండి యొక కమ్మదీసి బాబాజీ చేతియందుంచెను. బాబాజీ దాని తన కన్నులకద్దుకొని తెఱచి చదివి మఱల సంచిలో దాచెను. తరువాత కొంతతడ విరువురును సంభాషించుకొనిరి. బాబాజీ యొక తాళపత్రము గొనివచ్చి దానిపై — 'శ్రీచరణములకు నమస్సులు. దాసుని యపరాధమును క్షమింప ప్రార్థన. పనులన్నియు సుముఖముగనే యున్నవి. యువకుడు శ్రీచరణదర్శనమునకై తొందరపడు చున్నాడు. సుల్తానుగఢమును జయించిన పిమ్మట దర్శనభాగ్యము ప్రసాదింప ప్రార్థన. లేనిచో నిరుత్సాహియగును.' అని వ్రాసి యా సాధువునకిచ్చి పంపివేసెను.

మనము పూర్వాపర విషయములను సమన్వయ మొనరించుకొనవలసి యున్నది గాన వీరి నిట వదలి బీజపుర మేగి యచటి పరిస్థితుల నరయుదము సయ్యదుఖానునకు మురారు పంతు, రణదుల్లాఖానులపై నీర్ష్య యేర్పడిన విషయము పాఠకు లెరుంగుదురు. సయ్యదు అనుచరులకు వాటిల్లిన విపత్తులను, పరాభవములను పాఠకు లెఱుంగక పోలేదు. మురార్జిపై కంటె రణదుల్లాఖానుపై సయ్యదునకు కోప మధికమయ్యెను. నానాజీ భార్యనుగూడ గొనిరాకపోవుటయే దానికిగల కారణము. రణదుల్లాఖానుపై నేరములుమోపి, వాటిని రుజువుచేసి సుల్తానును కీలుబొమ్మవలె నాడించవలెనని

ఖాను తలంపు. అత డందుకు తగిన తరుణమునకై వేచి యుండెను.

తఱచు సుల్తాను మద్యమును సేవించుచుండును. ఒక్కొక్కనా డధికముగ సేవింతురు. ఆనాడు బయటకు రారు. ఎవరికిని దర్శన మీయరు. కొంద రాప్తులైనవారు మాత్రము (సయ్యదువంటివారు) లోనికేగి సుల్తానును దర్శింతురు. అట్టి వారికి తమ పనులు నెఱవేర్చుకొనుట కదియే మంచి సమయము. ఆ నాడు సుల్తా నధికముగ మద్యసేవనం బొనర్చియుండుటచే లోనికేగుటకు వీలులేదు. అట్టిసమయమున సయ్యదు మెల్లగ సుల్తానున్న భవనమున కేగెను. తన రాకను పరిచారికా ముఖమున సుల్తానున కెఱుకపఱచెను. సుల్తాను మొదట నిరాకరించియు మఱల నేదియో ఆలోచించి సయ్యదును లోనికి రమ్మనెను. కొలది దినములనుండియు సయ్యదుపై సుల్తానున కాదరాభిమానములు మెండయ్యెను. సయ్యదు విశ్వప్రయత్న మొనరించి సౌందర్యవతి యగు రంభావతిని గొనివచ్చి సుల్తానునకు సమర్పించుకొని తన స్వామిభక్తిని వెల్లడించుకొనెను. సుల్తానున కంతకంటె కావలసిన దేమి? ఆ నాటినుండియే సయ్యదుపై సుల్తానునకు ప్రత్యేకాభిమానము కలిగెను. సయ్యదునకుగూడ వశీభూత మొనరించుకొంటిమను ధైర్యము కలిగెను.

సయ్యదు లోనికేగి సుల్తానునకు నమస్కరించి నిలువబడెను. అతనింగాంచి సుల్తాను — "ఏమిటిపని? ఏదియో చెప్పదలచినట్లుంటివే? త్వరగా చెప్పుము." అనెను.

"ప్రభూ! తమతో నొక విషయము మనవి చేయదలచి తిని. ఆలస్యమైనచో ప్రమాదము వాటిల్లునని యెంచి మీ యేకాంతమును భంగమొనర్చితిని. క్షమింపుడు. స్వామిహితము గోరు సేవకుడు విధ్యుక్తమున జాగుచేయజాలడు. తాము కోపగించనిచో మనవి యొనర్తును."

"మాకేమియు కోపము లేదు. త్వరగా చెప్పుము."

"నేనొక రహస్యము చెప్పనెంచితిని. నే చెప్పిన విషయములను దేవరవారికి రుజువుచేసి చూపుదును. నా మాటలపై విశ్వాసముంచుడు. నాపై కినుక వహింపకుడు." అని మెల్లగ దగ్గఱకేగి సుల్తానునకేదియో రహస్యము జెప్పెను. అది వినుటతోడనే సుల్తాను ముఖము క్రోధముతో నెఱ్ఱబాఱెను. "నేను విశ్వసింపను. సయ్యద్! నీకు పదిహేను దినములు గడువిచ్చుచున్నాను. నీ మాటలను రుజువుచేసి చూపవలసియున్నది. జాగ్రత్త!" నీ మాటలసత్యములైనచో ...నీ జాగ్రత్త!" అని హెచ్చరించెను. సయ్యదు 'చిత్త' మని శెలవు గైకొని బయలుదేరెను. అతడు గుమ్మము దాటిన వెంటనే సుల్తాను — "ప్యారీ! రంభావతీ! ఇటు రమ్ము" అని కేకవేసెను.

సయ్యదటనుండి బయలుదేరి రంభావతియున్న మందిరమున కేగెను. తన కార్యమున రంభావతి తోడ్పడగలదని సయ్యదు నమ్మకము. తా నామెను రాణినిచేసినాడు. ఆయుపకారమున కామె తప్పక ప్రత్యుపకారమొనర్చునని యాతని విశ్వాసము. అందుచే నామెయొద్దకేగి రణదుల్లాఖానుపై

సుల్తానున కవిశ్వాసము కల్గించుటకై తాను పన్నిన పన్నాగ మును వివరించి అందు తనకు సహాయ మొనర్పవలసినదిగ ప్రార్థించెను. రంభావతి సయ్యదుతో నవ్వుచు మాట్లాడును ఆమె కతనిపై ద్వేషమున్నను పైకి వ్యక్తము కానీయదు. ఆతడొనర్చిన నీచపువనికి, తనజీవితమును నాశనమొనర్చినందుల కామె లోలోన మండిపోవుచుండెను. అందుకు తగిన ప్రతీకార మొనర్చుటకై యామె వేచియుండెను. కాని యామె యాంత రంగిక విషయము సయ్యదునకు తెలియదు. ఆమె బాహ్య వర్తనను జూచి భ్రమించినాడు. సయ్యదు మాటలను చిరు నవ్వుతో విని రంభావతి తగిన సమాధాన మేమియు నివ్వ లేదు. సుల్తానుగారు పిలుచుచున్నారు. త్వరగా పోవలెనని యచటనుండి వెడలిపోయెను. సయ్యదుకూడ నికముందు తా నొనర్పవలసిన కార్యముల కొక స్వరూపమును కల్పించు కొనుచు క్రిందికి దిగి వచ్చెను.

సయ్యదు క్రిందకు వచ్చి తన మేనాలోనెక్కి కూర్చుం డెను. నలుగురువాహకులా మేనాను మోయుచుండిరి. కొంత దూర మేగినంతనే వాహకుల కేదియో కోలాహలము వినిపిం చెను. ఆ కోలాహలమును విని వారు నిలబడిపోయిరి. మేనాను క్రింద దింపి వారు కోలాహలము వినవచ్చుచున్న దిక్కునకు చూడసాగిరి. అచటికి గొలది దూరమున కొందరు పోట్లాడుకొనుచుండిరి. నలుగురైదుగురు మహమ్మదీయులొక గోవును బంధించి నడివీథిలో దానిని జంప యత్నించుచుండిరి. వారినొక నల్లని యువకుడు (రాగోజీ) యడ్డగించెను. వారిరు

పురకును గలహము ప్రారంభమయ్యెను. మాటలు దాటి పరిస్థితి దెబ్బలాటవరకు వచ్చెను. రాణోజీ యా నలుగురైదు గురు మహమ్మదీయులను ఎదుర్కొని పోరాడుచుండెను. మహమ్మదీయులాతని నెదుర్పజాలకుండిరి. ఇంతలో సమీప గ్రామము నుండి మరికొంతమంది హిందువు లటకేతెంచిరి. వారిని జూచినంతనే మహమ్మదీయ సైనికులు గోవును వదలి వేసిరి. ఇంతలో సయ్యదు తన వాహకులను వెంటగొని యట కేతెంచెను. సయ్యదుతోపాటు మరినలుగురు మహమ్మదీయు లను చూచుసరికి పరాజితులైన మహమ్మదీయులకు మరల నుత్సాహము కలిగెను. దానికదోడు సయ్యదు మహమ్మదీ యుల నుత్సాహపఱచుచు ముందునకు వచ్చెను. ఇది చూచి రాణోజీ కత్తి చేతపట్టి సయ్యదు వద్ద కేతెంచెను. రాణోజీని చూచినంతనే సయ్యదు ప్రాణము లెగిరిపోయెను. అతని ముఖము వెలవెల బోయెను. అతఁడు మెల్లగ వెనుకకు తగ్గి మేనాను సమీపించి దానిలో జేరి కూర్చుండెను. రాణోజీ కూడ వానిని వెంబడించి మేనా తలుపు సందులోనుండి తల దూర్చి లోపలనున్న సయ్యదుతో — "గుర్తించితివా? జాగ్రత! నీ ప్రాణములు తీయుటకింకను బ్రతికియున్నాను. కత్తి బట్టి యుద్ధమునకు దిగినచో నీపాటికే చచ్చియుందువు. ఏమైనను నా చేతిలో నీ చావు తప్పదు జాగ్రత్త!" అనెను. సయ్యదు శరీర మామాటలు వినుచుండ వణకిపోయెను. రాణోజీ యచటినుండి వెడలిపోవువఱకును అతని నోట మాట రాలేదు. పిమ్మట వాహకులకు ముందులకు సాగిపో సనుజ్ఞ నొసంగెను.

# ౧౧

పూర్వ నిర్ణయానుసారము నానాజీతోఁ గూడ యేసాజీ తానాజీలు బీజపురము జేరిరి. వారచటి పరిస్థితుల దెలుసుకొనుటకై మారు వేసముల దాల్చి బజారులవెంట తిరుగజొచ్చిరి. ప్రథమ దివసమున వారు వార్తాసేకరణకై పూనుకొనక కేవలము బీజపురవీథులను, సర్దారుల భవనములను, రాజప్రసాదములను తిలకించుటకై బయలుదేరిరి. వారంతకు బూర్వము బీజపురమెన్నడును వచ్చియుండలేదు. వారు వీథివెంట బోవుచుండగా నొక పెద్ద భవనము కనుపించెను. నానాజీ యా భవనమువంకకు చూచెను. ఆ భవనమున రెండవ యంతస్తు కిటికీనుండి నానాజీ కొక యువకుని మోము కన్పించెను. అతనిం గాంచినంతనే నానాజీ యాశ్చర్యముతోఁ నిలువబడిపోయెను. అతడు మఱల పరీక్షించి చూడ నెంచెనుగాని యా యువకుడు కిటికీవద్దనుండి తొలగిపోవుటచే నానాజీ యాశనిరాశయయ్యెను. ఆ యువకునిఁజూచిన క్షణము

నుండియు నానాజీ హృదయమున నశాంతి యధికమయ్యెను. ఆ యువకుని విషయమై జిజ్ఞాస మెండయ్యెను. ప్రక్కనున్న తానాజి యేసాజీల కాతని పరిస్థితి వింత గొల్పెను. వారాతని యశాంతికిని, జిజ్ఞాసకును కారణమడిగిరి. కాని, నానాజీ యేమియు సమాధాన మీయలేదు. నానాజీ త్రోవన వెళ్లువాని నొకని నడిగి యా భవనము రణదుల్లాఖా నను సర్దారునిదని తెలుసుకొనెను. అప్పటికే సూర్యాస్తమయమగుటవలన వారిక తిరుగుట చాలించి వెనుకకు మఱలిరి.

ఆనాడు సుల్తాను వేటకై సమీపారణ్యమున కేగి యుండెను. అందుచే నేడు రంభావతికి విశ్రాంతి లభించెను. కాని నేడామె మనసు సరిగలేదు. మాటిమాటికి కిటికీవద్ద కేగి తొంగి చూచి నిరాశతో తిరిగి వచ్చుచుండెను. ఆమె వైఖరి చూడ నెవరికొఱకో ప్రతీక్షించుచున్నట్లుండెను. ఆమె పరిస్థితిని చూచి దాసీలు సుల్తాను దగ్గఱ లేకపోవుటయే యామె యశాంతికికారణమనుకొనుచుండిరి. సూర్యాస్తమయమయ్యెను. రంభావతి యిట్లే మాటిమాటికిని కిటికీవద్ద కేగి యెవరికొఱకో ప్రతీక్షించుచుండెను ఆమె ప్రతీక్షించుచున్న వ్యక్తి కనుపించకపోవుటవలన నామె యశాంతి మఱింత హెచ్చెను. యింతలో నొక దాసి దీపము వెలిగించుటకై వచ్చెను. కాని రంభావతి యా దాసిని నేడు దీపము వెలిగించ నక్కరలేదు. పొమ్మని పంపివేసెను. క్షణక్షణమామె హృదయోద్వేగ మెక్కువగుచుండెను. 'ఇంతవఱకును దాసి రాకపోవుటకు గారణమేమి? ఆమె కా వ్యక్తిజాడ తెలిసెనో లేదో' యని యాలోచించుచుండెను.

నలుమూలల చీకటి వ్యాపించెను. రంభావతిభవన మంతయు నంధకారమయమై యుండెను. ఇంతలో నకస్మాత్తుగ నొక వ్యక్తి గదిలోనికి ప్రవేశించి తలుపు గడియవైచెను. ఆ వ్యక్తిని గాంచి రంభావతి 'ఎవరువారు ?' అని ప్రశ్నించెను. కాని సమాధానము లేదు. భయముతో రంభావతి శరీరము వణకిపోవుచుండెను. ఆ వ్యక్తి మెల్లగా రంభావతిని సమీపించి కత్తి పై కెత్తి — "నేటితో నీ యాయుర్దాయము సరి. నీ విచట భోగవిలాసములతో కులుకుచుంటివా ? నీవు పరపురుషునితో గూడి భోగవిలాసము లనుభవించుటకు సిగ్గు లేదా ? నీ సిగ్గుమాలినబ్రతుకు నేటితో తీరిపోవును." అనెను.

రంభావతి యా పురుషుని గుర్తించినది — "ప్రభూ ! నేను భోగవిలాసములలో బడి మిమ్ము మఱువలేదు. ఆ తుచ్ఛుడు మిమ్ముల నంతమొందించినానని చెప్పినాడు. చేయునదిలేక ప్రతీకారమునకై వేచియున్నాను. ఆ తుచ్ఛుని వధించుటే నా జీవిత పరమావధి. మీరు జీవించియుండుటవలన నా భారము తగ్గినది. ఆ పనిని మీరే నెఱవేర్పుడు. మీ చేతులతో మీ చరణసన్నిధిని ప్రాణములు వీడుటకన్న నాకు కావలసిన భాగ్యములేదు." అని యాతని చరణములపై వ్రాలెను. ఆ పురుషున కేమి చేయవలెనో తోచలేదు. అతడు — 'ఈమె మాటలు యదార్థములేనా ? నిజముగ నీమె ప్రతీకారముకై జీవించియున్నదా ? ఇప్పు డీమెను వధించుటయా ?' యని యాలోచించుచుండగనే యెవరో తలుపు తట్టిరి. రంభావతిమాత్రము చైతన్యహీనయై యాతని పాద

ములపై వ్రాలియుండెను. ఎవరో తలుపుతట్టుటచే నాతఁడు మెల్లగ గడియతీసి తలుపువెనుక దాగెను. బయటి వ్యక్తి లోని కేతెంచుటతోడనే యాతడు మెల్లగ గదినుండి బయట కేగి గబగబ మేడమెట్లు దిగుచుండెను. త్రోవలో నొక పహరా నిచ్చువాడు — "మాల్వీజీ! త్వరగా వెళ్ళిపోవుచున్నా రేమ"ని ప్రశ్నించెను. అందులకా వ్యక్తి — 'సుల్తానుగారి యాజ్ఞ ప్రకారము బేగం సాహిబాకు కురానులోని కొన్ని సూక్తులను వినిపించి వెళ్ళుచున్నా'నని సమాధాన మిచ్చి బయట తా నెక్కి వచ్చిన మేనాలో కూర్చుండెను. ఆ మేనా యొక మసీదుముందఱ నాగెను. అందున్న వ్యక్తి మసీదులోని కేగి దొడ్డిత్రోవగుండ బయటకేగి యూరి వెలుపలనున్న జీర్ణగృహ మును ప్రవేశించి తాను ధరించియున్న గడ్డమును, మీసమును తీసివైచెను. ఆశ్చర్యము! అతడు రాణోజీయే. తలుపువైచి లోన పచారులు చేయుచు తనలో తా నేదియో యాలో చించుచుండెను.

ఇంతలో నెవరో బయటనుండి గట్టిగ తలుపుతట్టిరి. ఆధ్వని వినినంతనే యాతని యాలోచన కంతరాయము కలి గెను. అతఁడు తలుపు తెఱచుటకనుమానించుచుండగనే మఱల బయటనుండి తలుపుకొట్టిరి. అతడు కొంత తడవాలోచించి తలుపు తెఱచెను తలుపు తెఱచినంతనే నలుగురు బైరాగు లాతనికి ప్రత్యక్షమైరి. అతడు ప్రశ్నింపకపూర్వమే యందొక బైరాగి— "బాబాజీ! మేము బైరాగులము. దేశాటన మొనరించుచు బీజపురము చేరితిమి. ఈ పట్టణము మాకు

క్రొత్త. నాలుగుదినములుండి మరలిపోదుము. ఇది బైరాగు లుండు మఠమని తెలుసుకొని యిటకేతెంచితిమి." అనెను. ఇదివిని రాణోజీ వారిని లోనికిరమ్మనెను. వారు లోనప్రవే శించి తమ సంచులను, కమండలములను మూలనుంచి విశ్ర మించిరి. రాణోజీ వారిని గుర్తించలేదు. నిజముగ వారు బైరాగులే యని యాతడెంచెను. వచ్చిన నలుగురు బైరాగులలో ముగ్గురు మాత్రము బడలియుండుటచే నిద్రిం చిరి. ఒకడు మాత్రమేదియో యాలోచించుచు ఇటునటు పచారులు చేయుచుండెను. రాణోజీ యాతనింగాంచి తన వద్దకు పిలచెను. దీపపు క్షీణకాంతి యాతని మోముపైబడు టచే రాణోజీకి కలిగిన యాశ్చర్యమునకు మేరలేదు. బైరాగి వేషమున నున్నను రాణోజీ యాతనిని పూర్తిగ గుర్తించెను. ఆ బైరాగినిగాంచినంతనే రాణోజీ కమితానందము కలిగెను.

ఆ బైరాగి సమీపమునకువచ్చి కూర్చుండినపిమ్మట రాణోజీ— "స్వామీ! తమదేయూరు? తామిచటికెందుల కేతెంచితిరి? మీరేదియో యాలోచించుచున్నారు. ఆ యాలో చనకు కారణమేమి? నన్ను న్యూనిగనెంచకుడు." అని యడిగెను. అందులకాబైరాగి— 'అయ్యా! బైరాగుల కొక గ్రామ మేమిటి? దేశమంతయు దిరుగుచుందుము. బీజపురమే తెంచు టకు కారణమేమున్నది? దేశాటనమొనరించుచు నిటకేగు దెంచితిమి. నాలుగుదినములపాటు పట్టణముజూచి పోదుము.' అనెను. అతని మాటలలో స్వాభావికతయున్నను అతనిని పూర్తిగ గుర్తించియున్న కారణమున రాణోజీ కాతని మాట

లకు నవ్వువచ్చెను. అతడు మెల్లగ నాతనివద్దకేగి చెవిలో—"నీవు నానాజీవి. నిన్ను చూచుటతోడనే గ్రహించితిని. నీవెంటవచ్చిన తానాజీ యేసాజీలనుకూడ గుర్తించితిని. నీవు చెప్పకున్నను మీరిటకేతెంచిన కారణము నేనెఱుంగుదును. నీవు నన్ను నీయాప్తునిగ నెంచుకొనుము. నీకొఱకై నేనెన్ని కష్టములనైన నెదుర్కొన సిద్ధముగనున్నాను. ఉదయమే నేనిటనుండి వెడలిపోదును. అప్పుడప్పుడు వచ్చి నిన్ను కలుసుకొందును. నన్ను విశ్వసింపుము.' అని మెల్లగననెను. ఈ మాటలు వినుటతో నానాజీ ముఖము కాంతివిహీనమయ్యెను. 'ఇతడెవడు? ఇతడు నన్నెట్లు గుర్తించినాడు? నాపై నీతని కింత యభిమానముకలుగుటకు కారణమేమి?' యని యాలోచింప మొదలిడెను. కాని యాతని యాలోచన యెక్కువ కాలము సాగలేదు. కిటికీలోనుండి యాతడు చూచిన యువకుని చిత్రము హృదయపటలముపై బాగుగ నంకితమైయుండెను. మస్తిష్కమంతయు నా పూర్వ స్మృతులచే నావరింపబడీ యుండెను. అందుచే నా పూర్వస్మృతియందు ప్రస్తుత భావములు విలీనమైనవి. అతడింకేమియు మాటలాడక కొంతసేపట్లే యాలోచించి నిద్రించెను.

మరునాడుదయము లేచి చూచుసరికా నల్లనియువకుడు నానాజీకి కనుపించలేదు. రాత్రి చెప్పినట్లాతడచటినుండి వెడలిపోయి యుండుననని సమాధానపడి తన మిత్రులతో నాతని విషయము జెప్పెను. కాని యాతని విషయమై యాలోచించుటకు వారికి సమయము లేదు. బీజపురమున వారొనర్ప

వలసిన పని చాల గలదు. అందుచే కాలకృత్యముల నెరవేర్చు కొని, వేషముల దాల్చి మజిల బయలుదేరిరి. వీధులవెంట నడచుచు వారు రణదుల్లాఖాను భవనమువద్దకు చేరిరి. నానాజీ దృష్టి మజిల కిటికీవైపునకు పోయెను కాని నిన్నటి యువకు డాతనికి కనుపించలేదు. ఆ యువకుని చూచుటకై యాతని హృదయము తొందరపడుచుండెను. అతడా భవనము ముందఱ అటునిటు నాలుగైదు పర్యాయములు పచారులు చేయుచు కిటికీవైపునకు చూచుచుండెను. ఇతరులెవరైన తన్ను నుమానింతురని గూడ నాతనికి తోచలేదు. ఎన్ని పర్యాయ ములు తిరిగినను అతని కోరిక ఫలించలేదు. ప్రక్కనున్న తానాజీ యేసాజీ లతని చేష్టలజూచి మందలించిరి. అంతటితో నాతడు వారల ననుగమించెను.

సాయంకాలమువఱకు పట్టణమంతయు దిరిగి వారు మఠము జేరిరి. నానాజీ మనసు మనసులో లేదు. ఆ యువ కుని దర్శనము కాకపోవుటచే నాతని మనసు వ్యాకులపడు చుండెను. 'ఆ యువకు డెవడు? రణదుల్లాఖానున కాతనితోడి సంబంధ మెట్టిది? అతడు నిజముగ పురుషుడేనా? అతని విషయము తెలుసుకొను టెట్లు?' అని చాలాసేపు చింతించెను. చివఱ కాతడు—"నిన్న రాత్రి మనతో కలసిన నల్లని యువ కునివలన నీ విషయము తెలిసెడిదేమో! ఈ పర్యాయమాతడు కనుపించినచో తప్పక కనుగొనవలసినదే! అతడు నాకేవిషయ మందైనను సాయమొనర్తునని చెప్పియున్నాడు గదా! ఈవిష యమున నాతని సహాయ మవసరము. ఏమైనను అతనిని లుసుకొనవలసినదే!" అని నిశ్చయించుకొనెను.

మఠమునకు చేరినంతనే తానాజీ తన వేషమును పరిత్యజించి నానాజీతో—"నానాజీ! నీ పద్ధతిం జూడ నీవు మన ప్రస్తుత కర్తవ్యమును మఱచినట్లున్నావు. శివాజీవద్ద నుండి వచ్చి బీజపురమున మనమొనర్చిన పనియేమి? ఈనాటి వఱకును పట్టణమైనను పూర్తిగ చూడలేదు వారచట మన వద్దనుండి వార్తలకై యెదురుచూతురు. నీవు చూడ నా భవనము చుట్టును ప్రదక్షిణ మొనర్చుచున్నావు. ఆ యువకు డెవడు? అతనిని చూచుట కెందులకంత తహతహ లాడు చున్నావు" అని తన కోపమును వెలిబుచ్చెను. కాని నానాజీ కీమాటలు వినిపించలేదు. అతని మనసు తానాజీ మాటలపై లేదు. ఆ నల్లని యువకునికొఱకై యాతని మనసు తొందర పడుచుండెను. ఇక లాభము లేదని మిగిలినవారు పోయి శయనించిరి. నానాజీకి మాత్రము నిద్దుర రాలేదు. అతడు బయటకువచ్చి వరండాలో నిటునిటు పచారులుచేయ మొదలు పెట్టెను. ఇంతలో నెవరో మఠమువైపునకు వచ్చుచున్న ట్లాతనికి గోచరించెను. క్రమక్రమముగ నా వ్యక్తి సమీపించు చున్న కొలదియు నానాజీకి 'ఆ నల్లని యువకు డెవడై యుండు ను' ను భావము దృఢపడెను. చీకటిలో నానాజీ కాతని మోము కనుపించలేదు. చీకటికి తోడాతని ముఖము వస్త్రా చ్ఛాదితమై యుండెను. ఆ వ్యక్తి మెల్లగ మఠము వెనుక కేగెను. నానాజీయు కుతూహలముతో నాతని వెనుకనే బయలుదేరెను. ఆ వ్యక్తి యొక కాగితముం కిటికీలో నుంచి పరుగుపరుగున వెడలిపోయెను. నానాజీ కిటికీవద్దకేగి కాగితము చేతగొని దీపమువద్దకు తెచ్చి తెఱచి చూచెను. అందు—"నీవు

నావలన సహాయము కాంక్షింతువేని యీ మూలనున్న వట వృక్షము వద్దకు రమ్ము. అచట నన్ని విషయములు మాట్లాడ వచ్చును." అని యుండెను. ఆయుత్తర మెవరు వ్రాసిరో తెలియదు. చివరకు సంతకమైనను లేదు. నానాజీ మనసులో నంతవరకు 'నల్లని యువకుని'కి సంబంధించిన యూహాలే యుండెను. అందుచే నతడా నల్లని యువకుడే (నానాజీకాతని పేరు తెలియదు) వ్రాసియుండునని యెంచి యీ యుత్తరము నచటనే పారవైచి యీ వటవృక్షము వద్దకు బయలుదేరెను.

మనసులోని కుతూహలము తొందరపెట్టుచుండ నాతడు నిరాయుధుడై గబగబ నడచి వటవృక్షమును సమీపించెను. ఆ యంధకారమున నాతని కెవరో వచ్చుచున్నట్లు తోచెను. వా రెవరై యుందురా యని యాలోచించుచుండగనే నలుగు రైదుగురు వ్యక్తు లాతని చుట్టుముట్టి బంధించిరి. కాలు సేతులే కాదు, కండ్లకుగూడ గంతలుకట్టి యిరువు రాతని నెత్తుకొని యెచటికో బయలుదేరిరి. ఆ నిస్సహాయస్థితియం దేమి చేయ వలెనో నానాజీకి తోచలేదు. నిరాయుధు డేమిచేయగలడు?

వా రట్లాతని నెత్తుకొని చాలదూర మేగిరి. వా రెచటికి గొనిపోవుచున్నదియుగూడ నానాజీకి తెలియుటలేదు. వా రాతని దృష్టినిసైతము బంధించిరి. తన్ను బాధించినవా రెవరో యాతనికి తెలియలేదు వారి మాటలనుబట్టి గుర్తింతమన్న వా రేమియు మాట్లాడక నిశ్శబ్దముగ నడచుచుండిరి. కొంత సేపటికి వా రొక భవనమువద్ద కేతెంచిరి. అం దొకడు తలుపు

ఫాతిమా!' యని కేక వేసెను. అది విని లోపలినుండి——

'ఎవరు వారు? అహమ్మదా?' యనుచు నెవరో తలుపు తెఱచిరి. వారులోన ప్రవేశించుటతోడనే మఱలద్వారము బంధింపబడెను. వారు నానాజీని గొంపోయి యొక చీకటి కొట్టునందు బంధించి తాళమువైచి ఫాతిమాను జాగ్రత్తయని హెచ్చరించి వెడలిపోయిరి.

నానాజీ యా చీకటికొట్టులోబడియుండి తన్ను బంధించిన శత్రువెవరై యుండునా? యని యాలోచించుచు బంధములనుండి ముక్తుడగుటకై కాలుసేతులు కొట్టనారంభించెను. కొంతతడవట్లు ప్రయత్నమొనరింప బంధములూడినవి. కనులు తెఱచి చూడనంతయు నంధకారముగనుండెను. తప్పించుకొనుటయెట్లు? ఇంతలో నెవరో తాళము తీయుచున్నట్లు శబ్దమయ్యెను. మఱునిముసముననే తలుపుతెఱచుకొని యొక వ్యక్తి లోన బ్రవేశించెను. ఆ వ్యక్తిని, గాంచి నానాజీ యాశ్చర్యచకితుడయ్యెను. ఆమె యొకస్త్రీ. బహుశః ఈమెయే ఫాతిమాయైయుండ వచ్చునని యాతడూహించెను. ఇంతలో నామె మెల్లగ నానాజీని సమీపించి — "అయ్యా, తమ నిచటకు గొనివచ్చినందులకు క్షమింపుడు. నేనెంత వలదనినను వాడు వినలేదు. తమకొఱకొక మహారాష్ట్రి యువతిచే ఆహారము దెప్పింతును. స్వీకరింపుడు." అని ప్రార్థించెను.

ఈ మాటల కాతని యాశ్చర్యము మఱింత యధికమయ్యెను. అతడామెను— "నన్నిచటికి గొనివచ్చిన వారెవరు? ఇట్లు బంధించి తెచ్చుటకు కారణమేమి? నీవు నాకేమైన సాయమొనర్పగలవా?" యని ప్రశ్నించెను. అందుల కామె

యాతని చెవిలో నేదియో రహస్యము జెప్పి— 'నేను మిమ్ముల విడిపించుటకై విశ్వప్రయత్న మొనరింతును. నన్ను విశ్వసింపుడు. మీకెట్టి ప్రమాదమును రానీయను. కాని, మిమ్ము విడిపించుట యీనాడు కానిపని.' అని సమాధానమిచ్చెను. నానాజీ చేయునది లేక మిన్నకుండెను. కొంతసేపటి కాతడు— 'ఫాతిమా! నీకు నాపై నభిమానమున్నచో నాకొక సాయము చేయుము. నేనొక యుత్తరము వ్రాసియిత్తును. దానిని గొంపోయి నా స్నేహితులకిమ్ము. వారున్న తావు నీకెఱింగింతును' అనెను. అందుల కామె సమ్మతించి, మఱల వత్తునని చెప్పి వెడలిపోయెను.

రెండు మూడు గంటలు గడచిపోయెను. నానాజీ ఫాతిమా కొఱకై ప్రతీక్షించుచుండెను. ఫాతిమాకు తనపై నింతటి యభిమానమునకు గల కారణమాతనికి బోధపడుట లేదు. ఫాతిమా చెప్పిన రహస్యము విన్నప్పటినుండియు రణదుల్లాఖానుపై నతనికి కోపమెక్కువయ్యెను. —'ఎంత నీచుడు! నా తండ్రి కత్యంత విశ్వాసపాత్రునివలె నటించి మోయసనే గాక నన్నుకూడ బంధించినాఁడు. నేనిచటినుండి ముక్తుఁడ నగుటయే తటస్థించినచో వాని విషయము కనుగొందును.' అనుకొనుచు పండ్లు పటపట కొఱుకుచుండెను. ఇంతలో ఫాతిమా వచ్చి తలుపు తెఱచెను. ఆమె వెనుక నొక మహారాష్ట్ర వనిత యాహారముచు గొనివచ్చి నానాజీ ముందుంచి వెడలిపోయెను. నానాజీ మొదట భుజించుటకు సంశయించెను కాని యాఁకలి వేధించుటచే తప్పనిసరియై భుజించెను. పిమ్మట

ఫాతిమా యుత్తరము వ్రాయుటకై వలయు పరికరముల నాతని ముందుంచెను. అంతనాతడు తన స్నేహితులకొక యుత్తరమును వ్రాసి దానిని ఫాతిమా చేతి యందుంచి మఠమునకు గుర్తులు చెప్పి పంపివేసెను.

ఇటు తెల్లవారినంతనే నానాజీ కనబడకపోవుటచే తానాజీ మున్నగువారికి భయము కలిగెను. అతని కొఱకై మఠమునకు చుట్టుప్రక్కల వెదకిరి. కాని వారి కాతని జాడ తెలియలేదు. చివఱకు వారికి మూలనున్న దీపమునద్ద నానాజీ వదలి వెళ్ళిన యుత్తరము కానవచ్చెను. దానిం జూచి వారు నానాజీ నెవరో మోసగించి గొనిపోయిరని నిశ్చయించుకొనిరి. ఇక తానాజీ దుఃఖమునకు మేరలేదు. "ఇక చేయవలసినదేమి? వచ్చిన పని నెఱ వేఱ లేదు. ఇంతలో నిది యొక విపత్తు వచ్చినది. శివాజీ కేమని వార్త పంపుదును. బహుశః నానాజీని మోసగించినవాడాసల్లని యువకుడై యుండుః"నని భావించి శివాజీ కిచటి విషయములను విపులముగ నొక లేఖ వ్రాసి తన యనుచరుని కిచ్చి పంపివేసెను. తానాజీ యేసాజీలు మాత్రము మిగిలిరి. వారు నానాజీ జాడ తెలుసుకొనుటకై పట్టణములోనికి బయలుదేరిరి. బహుశః నానాజీ యీ యువకుడున్న భవనమున కేగెనేమోయని తలచి యచట కేగెను. పహరా యుండుటచే లోనికేగుటకు వీలులేకుం డెను. వారు మాటిమాటికిని భవనముచుట్టును తిరుగుచుండుటచే వారల ననుమానించి — "మీ రెవరు? మీరిచట కెందులకు వచ్చితిరి? మీ వేషమును జూడ నెవరో గూఢచారులవలె

నున్నారుగాని మామూలు బైరాగులవలె లేరు." అనెను. తానాజీ 'బాబా! మేము బైరాగులము. భవన సౌందర్యమును తిలకించుచుంటిమి. నీవు అదృష్టవంతుడవు. నీ ముఖమే చెప్పుచున్నది. నీ చేయి చూపుము!' అని యాతడు వలదనుచున్నను తానాజీ యాతని యుజ్వలమైన భవిష్యత్తును కనులకు గట్టినట్లు వర్ణించుచుండెను. అంత నా సేవకుడు మొత్తబడి నోరు తెఱచి వినుచుండెను. ఇంతలో నొక సేవకుడేతెంచి "బాబుగారీ బైరాగిని వెంటగొని రమ్మని యాజ్ఞాపించినారు" అని తానాజీతో—'రమ్ము! నీ యదృష్టము పండినది. అయ్యగారు పిలచినారు.' అనెను. తానాజీ లోలోన సంతోషించుచు యేసాజీ నచటనే వదలి సేవకుని వెంట బయలుదేరెను.

తానాజీ లోనికేగి యట సుఖాసీనుఁడై యున్న యువకునికి నమస్కరించి నిలువబడెను. ఆ యువకుడు బైరాగి వేషమున నున్న తానాజీనిగాంచి— 'ఓయీ! మీరలెవ్వరు? ఎచ్చటినుండి వచ్చితిరి? నిన్న నీతోగూడ నున్న నీస్నేహితుడేమైనాడు? అతనిదేయూరు?' అని ప్రశ్నించెను. తానాజీ యాప్రశ్నలకు సంసిద్ధుడైలేడు. అందుచే తొట్రువడుచు "బాబా! మా బైరాగులకొక గ్రామమేమిటి? దేశమంతయు మాదే!" యనెను. నానాజీవిషయమడుగుటచే నాతని నీ యువకుడే బంధించి యుంచెనని తానాజీ కనుమానము కలిగెను. తానాజీ సమాధానము విని యాయువకుడు చిరునవ్వుతో— "నావద్ద దాపరిక మనవసరము. మిమ్ములను

నేను గుర్తించలేదని యెంచకుము." అనెను. ఇది వినుటతో తానాజీ యనుమానము దృఢమయ్యెను. ఈ యువకుడే నానాజీని బంధించియుండునని నిశ్చయించుకొని దీనముగ— "ప్రభూ! బైరాగులమైన మమ్మనుమానించి మాస్నేహితుని బంధించుట న్యాయముగాదు. మీపాదములపైబడి వేడెదను. అతనిని విడువుడు." అని ప్రార్థించెను.

తానాజీ మాటలు వినినంతనే యా యువకుడు సంభ్రమాశ్చర్యములతో— 'ఏమి? ఆతనిని బంధించిరా? ఇది నిజమేనా? ఎవరు బంధించిరి?" అని ఖిన్నవదనుడై దుఃఖింప మొదలిడెను. ఆ యువకుని మాటలతో నానాజీ నాతడు బంధించలేదనువిషయము తానాజీకి స్పష్టమయ్యెను. కొంత తడవున కాయువకుడు— 'మీ మిత్రునిజాడ కనుగొందును. రేపు మఱలరమ్ము.' అని చెప్పి తానాజీని పంపివేసెను.

తానాజీ యేసాజీలు ఖిన్నవదనములతో మఠమునకు దిరిగి వచ్చిరి. అప్పటికే సూర్యాస్తమయమయ్యెను. వారి కేమియు దోచుటలేదు. కనుచీకటిగనుండెను. ఆ కనుచీకటిలో నొకవ్యక్తి ముసుగువైచుకొని మఠముదెస కేతెంచుచుండెను. మొదట తానాజీ యావ్యక్తినిఁగాంచి యా నల్లని యువకుడని భ్రమించి భావి కర్తవ్యమాలోచించుచుండెను. ఇంతలో నావ్యక్తి తానాజీని సమీపించెను. ఆమె ఫాతిమాయే! ఆస్త్రీనిచూచి తానాజీ తమ్ము మోసగించుటకై శత్రువులు పన్నాగముల బన్నుచున్నారని తలచి యామెను లోనికి రానీయక — 'నీవెవరవు? ఇచ్చటి కెందులకేతెంచితివి?' అని

యడిగెను. అందులకు ఫాతిమా 'నేను మీ స్నేహితునివద్ద నుండి వచ్చినాను. మీకొక యుత్తరమును గొనివచ్చినాను. నన్ను లోపలకు రానిండు. ఎవరైనను చూతురు' అనెను. తానాజీ మాత్రమామెను లోపలకు రానీయలేదు. ఆయుత్తరముఁగొని లోనికేగి చదివి బయటకు వచ్చెను. అతడు ఫాతిమావలన జరిగిన యుదంతమంతయు తెలుసుకొనెను. ఫాతిమా తానాజీతో— 'మీరాతనికై చింతించకుడు. అతనిని విడిపించు భారము నాది.' అని చెప్పి వెడలిపోయెను.

తానాజీ తనలోదాను— "ఈ రణదుల్లాఖానెంతటి విశ్వాసఘాతకుడైనాడు! అతడు పయోముఖ విషకుంభమని నేటితో తేలిపోయినది. వానిసంగతి కనుగొనవలసియున్నది. ప్రస్తుతము మిత్రుని విడిపించుటెట్లు? మనము ప్రయత్నించుటయా? లేక ఫాతిమా మాటలపై నాధారపడియుండుటయా?" యని యాలోచించుచుండగనే యా నల్లని యువకుడు లోనికేతెంచెను. అతనిఁజూచినంతనే తానాజీ మండిపోయెను. "మామిత్రు నెచటికి గొంపోయి బంధించితివి? మమ్మునుగూడ మోసగింపవచ్చితివా? నావద్ద నీయాటలు సాగవు. జాగ్రత్త!" యని హెచ్చరించి కత్తిచేతబట్టెను.

రాణోజీ కిది బోధపడలేదు. 'ఏమి? మీ మిత్రుని బంధించిరా? ఎవరు? బంధించిన దుర్మార్గుని పేరు చెప్పుము.

చాలును. మూడుదినములలో నాతని నిచటకు గొనివత్తును.' అని కొంతసేపాలోచించి— 'ఓహో! అర్థమైనది. నీవు చెప్పకున్నను పరవాలేదు. మీరీ మూడుదినము లిచటనే యుండుడు. తప్పక వియుక్తునొనరించి గొనివత్తును.' అని వేగముగ పరుగిడిపోయెను. తానాజీ నిశ్చేష్టుడై నిలువబడి యుండెను.

# ౧౨

ఆట శివాజీ యుదంతము నెఱుంగుటకు మా పాఠకులు కుతూహలపడుచుందురని మేమెఱుఁగుదుము. శివాజీ నాలుగైదు దినములు బీజపురము నుండి వార్తకొఱకు ప్రతీక్షించెను. నాలుగైదు దినములైనను వార్త రాకపోవుటచే నాతఁడుద్విగ్నుడయ్యెను. సుల్తానుగృహము వశపఱచుకొనుట కాతడు తొందర పడుచుండెను. శ్రీధరస్వామి యాతనితో బీజపురము నుండి వార్త వచ్చిన పిమ్మట కార్యక్రమమును నిర్ణయించుకొందమని చెప్పి యాపెను.

ఆనాడు బీజపురము నుండి తానాజీ పంపిన లేఖ శివాజీకి చేరెను. అందు తాము బీజపురమున నొనర్చిన పనియు, నానాజీ యదృశ్యుడగుటయు వ్రాయబడియుండెను. దానితో బాటు బీజపురపు సుల్తాను, రాజ్య వ్యవహారముల సరిగ చూచుటలేదనియు, సయ్యదుల్లా శ్రేణికి జెందిన నీచ సర్దారుల ప్రభావ మెక్కువగ నున్నదనియు, సుల్తానుగృ

ముపై మనము దండెత్తినను పరవాలేదనియు వ్రాసి యుండెను. ఈ విషయములు శివాజీకి సంతోషమును కలిగించినను నానాజీ నెవరో బంధించి గొనిపోయిరను వార్త మిక్కిలి వేధింప జొచ్చెను. తన మిత్రుని విపత్తు నుండి రక్షించుటకై బీజపురమేగుట కుద్యుక్తు డయ్యెను. కాని శ్రీధరస్వామి యందుల కంగీకరించలేదు— "శివా! నీ వీ పరిస్థితియందు బీజపుర మేగుట తెలివితక్కువ పని. మన యనుచరులను వారు గుర్తించియుందురు. అందువలననే నానాజీని బంధించియుందురు. ఇట్టి సమయమున నీవచటి కేగినచో ప్రమాదము వాటిల్లవచ్చును. నీవిచటనుండియే ప్రతివిధాన మాలోచింపవలెను." అనెను. ఇది విని శివాజీ— "స్వామీ! ప్రాణతుల్యులైన యనుచరు లచట విపత్పరంపరలకు లోనగుచుండ నేనిచట నేమియు ప్రయత్నింపక చేతులు నలుపుకొనుచు కూర్చుండజాలను. విపత్తు నుండి రక్షింపజాలని యజమాని యుండిననేమి? చచ్చిననేమి? నా నాయకత్వము వలన వారికి కలిగిన లాభమేమున్నది? వారి నెట్లైనను రక్షింపక తప్పదు." అనెను.

ప్రస్తుతమునకు శివాజీ విషయ మింతటితో నాపి బీజపుర మేగుదము. అహమ్మదు రణమల్లా సేవకుడని మా పాఠకు లెఱుగుదురు. రణమల్లా యా మహారాష్ట్ర యువకుని ప్రేమించి సర్దారు నొనర్తునని గొనివచ్చుటయు, అహమ్మదు తన యజమాని యా యువకుని ప్రేమించుటలోగల రహస్యమును గుర్తించినట్లును మన మిదివరలో చదువుకొని

యున్నాము. నానాజీ రణదుల్లా భవనమున కిటికీలోనుండి యొక యువకుని చూచుటయు, నాతనిని మఱల చూచుటకై యటునిటు పచారు లొనర్చెననియు మన మెఱుగుదుము.

అట్లు పచారు చేయుచున్న సమయమున అహమ్మదచటనే యుండెను. నానాజీపై నాతని కనుమానము కలిగెను. కాని అహమ్మదు తనను చూచుచున్నాడని నానాజీకి తెలిసెను. నానాజీపై అహమ్మదున కనుమానము పెఱిగిపోయెను బహుశః తన యజమాని కీతడడ్డు తగులునేమో! లేక రణదుల్లా గొనివచ్చిన వ్యక్తి కీతడుస్వామియై యుండవచ్చును. అందుచే మన మీతనిని రహస్యముగ బంధించి యజమాని యభిమానమును చూఱగొందమని తలచెను. తరువాత నాతడు నానాజీ నెట్లు మోసగించి బాధించినదియు పాఠకులకు విదితమే

మఱునాడుదయమే అహమ్మదు రణదుల్లాఖాను వద్దకేగి సలామొనరించి భయవినయము లుట్టిపడ—"ప్రభూ! తమతో జెప్పకుండ ఈ సేవకు డొకపని చేసినాడు. అందులకు సేవకునిపై గినియకుడు. తామాయువకుని ప్రేమించిన విషయము నే నెఱుంగుదును. ఆ వ్యక్తి నెట్లైనను తమకు దక్కునట్లు చేయుట నా ధర్మము. ఆ సేవక ధర్మమునే పాలించితిని. మన్నించుడు," అనెను. రణదుల్లా కాతని మాటకర్థము కాలేదు. అందుచే— 'అహమ్మదూ! నీవు చెప్పదలచినదేదియో స్పష్టముగ జెప్పుము. నీ వెప్పుడు నిట్లే యనవసర కార్యములందు జోక్యము కలిగించుకొనుచుందువు. నా స్వభావము నీ వెఱు

గుదువు. నీవేదైన దుష్టకార్యమొనర్చియున్నచో క్షమించుట కల్ల. నీ వొనర్చిన పనియేమో స్పష్టముగ జెప్పుము.” అనెను.

అందులకు సమాధానముగ నహమ్మదు భయమును బ్రదర్శించుచు—“ప్రభూ! మీరుగొనివచ్చిన వ్యక్తి సంబంధించిన వాని నొకనిని చూచితిని. బహుశః అతడా వ్యక్తికి స్వామియై యుండనోపును. అతఁడు జీవించి యున్నంతకాల మా వ్యక్తిపై తామధికారమును పొందజాలరు. అందుచే మీ మార్గమును నిష్కంటక మొనర్చుటకై నే నాతనిని బంధించి తమ చీకటి కొట్టునందుంచితిని. యజమాని క్షేమముకొఱకై నే నొనర్చిన యపరాధమిదియే!”

ఈ సమాచారము వినినంతనే రణదుల్లాకు కోపము వచ్చెను. అతడు అహమ్మదును—“ఏమీ? నా నా జీ ని బంధించితివా? నీ కెన్ని పర్యాయములు చెప్పినను బుద్ధిలేదు. నేనంత నీచుడవనుకొంటివా? నీ వొనర్చిన పనికిఁదగిన శిక్ష ననుభవింతువుగాక!”యని కోపగించెను. అంతట నహమ్మదు భయమును నటించుచు—“ప్రభూ! స్వామి హితమునకై నే నొనర్చిన పనికి కోపగించవలదు. ఇప్పుడేపోయి యాతనిని వదలి వేతును.”అని బయలుదేరబోయెను.

రణదుల్లా పాపభీతిగలవాడనియు, ధర్మదృష్టిగలవాడనియు మన మెఱుఁగుదుము. మహారాష్ట్ర యువకుని గొని వచ్చునప్పుడాతని మనసున నీచభావము లేదు. ఆ యువకుని రహస్య మాతనికి పూర్తిగ తెలియును. ఇన్నిదినముల నుండియు నాతని సాంగత్యమునందున్నచు పాపవాసనలాతని

మనమున స్పృశించలేదు. మాటిమాటికిని అహమ్మదు పాప వాసనలకు ప్రేరేపించుటచే రణదుల్లా సద్భావములకు గొంత యాటంకము కలిగెను. అతని మనసును మోహమావరించెను. మనసున దుష్టభావము జనించనేకూడదు. జనించినచో నది మనమున ప్రబలమై సద్భావముల నణంచును. రణదుల్లా క్షణిక మోహమునకు వశుడై అహమ్మదుతో— "ఇప్పుడా తనిని వదలనక్కరలేదు. రేపు ఉదయమాతనివిషయమును నిర్ణయింతును." అనెను. యజమాని మనసుమారినదని గ్రహించి సంతోషముతో నహమ్మదచటినుండి వెడలిపోయెను.

తన యజమాని చిత్తవృత్తి మారినదని అహమ్మదూహించెను. కేవలము సౌజన్యతను ప్రదర్శించుటకై ముందు వెనుకలు చూచుచున్నాడేగాని తన ప్రతిద్వంద్వియగు నానాజీ నంతమొందించుట రణదుల్లా కిష్టమేయనియు అహమ్మదెంచెను. అందుచే నాతడు తన యజమాని ప్రశంసకు పాత్రుడగుటకై రణదుల్లా యనుజ్ఞ లేకుండగనే రాత్రికి నానాజీ నంతమొందించవలెనని నిశ్చయించుకొనెను. ఈవిషయమున 'ఫాతిమా' తనకు తోడ్పడగలదని యాతని విశ్వాసము.

ఇక రణదుల్లావిషయమాలోచింతము. అతడు సజ్జనుడనుటలో సందేహములేదు. కాని యాతని మనమున నొక దుష్టభావముత్పన్నమయ్యెనని చదివియుంటిమి. అతని మనమున నిప్పుడు పరస్పరవిరుద్ధభావములకు సంఘర్షణ జరుగుచుండెను. "ఇన్నిదినములనుండియు సత్ప్రవర్తనగలిగియుంటివి. క్షణికోద్వేగమునకు లోనై పాపకార్యమొనరింపకుము. అప్పు

సాహబు నీమిత్రుడు. నానాజీ నీయాప్తుడు. నీవు నీచపుపనుల కొడిగట్టినచో వారియెడల విశ్వాసఘాత మొనరించినవాడవగు దువు. ఇంతవఱకును నీకుగల ప్రశస్తి మట్టిలోగలసిపోవును." అని యాతని సద్భావములు బోధించుచుండెను. "శోభితమైన వస్తువును జాఱవిడచుట తెలివితక్కువ. ఇందు తప్పేమున్నది? ఒక వస్తువు ననుభవింపవలెనని కోరుట మానవునకు సహజము. ఆమెకొఱకై నీవు ప్రయత్నమొనరింపలేదు. భగవంతుడే నీవద్దకు గొనివచ్చినాడు. అవకాశమును జాఱవిడువకుము." అని దుష్టభావము ప్రేరేపించుచుండెను. పాపమాతని కేమి చేయుటకును తోచుటలేదు.

అహమ్మదచటనుండి తిన్నగ ఫాతిమావద్దకేగి—"ప్యారీ! ఫాతిమా! ఈరాత్రికి నానాజీని వధించితీరవలెను. యజమానికీవిషయము నివేదించితిని. ఆయన కొంత మెత్తబడినాడు. పైకి చెప్పుటలేదుగాని లోపల నిష్టమే! ముందుగనె పని నెఱవేర్చినచో మనము యజమాని యభిమానమునకు పాత్రుల మగుదుము. నీ వీవిషయమున సాయమొనర్పుము." అనెను. అహమ్మదు సంకల్పించిన పైశాచిక కృత్యమును విని ఫాతిమా నిలువెల్ల కంపించెను. ఆమె యెన్నియో చెప్పి వారింపనెంచెనుగాని అహమ్మదు వినలేదు. చేయునదిలేక ఫాతిమా యటనుండి వెడలిపోయెను.

రాత్రి పదిగంటలైనది. అహమ్మదు చేత గత్తిపట్టి లోనికేతెంచెను. అతని కైలైనను రణదుల్లా యభిమానమును చూఱగొనవలెనని తలంపు. నానాజీని వధించి యాతని

మార్గమును నిష్కంటక మొనర్చుట కంటె వేరు మార్గ మాతనికి కానరాలేదు. అందును హిందువును వధించుట! ఇంతకంటె నిహపరసాధన మింకొకటిలేదు. అతడు ఫాతిమాను పిలచి దీపము గొనిరమ్మనెను. ఫాతిమా చేయునది లేక దీపము గొనివచ్చెను. అహమ్మదు తలుపు తెఱచి లోనికేగి— "ఓరీ! పశువా! ఇచట పడియుంటివా? మీ హిందువులకు సిగ్గులేదు. నీ భార్య మా సర్దారుతో జేరి కులుకుచున్నది. నీవొక పీరునివలె తిరుగుచున్నావు. నీవేనా మహారాష్ట్ర రాజ్యమును స్థాపించునది? శివాజీతో చేరితివట. గాజులు ధరించిన బాగుండెడిది. నీ భార్య పురుష వేషము దాల్చి మా సర్దారువద్ద నున్నది. నీవు స్త్రీ వేషమును ధరించిన బాగుండును." అని నోటికివచ్చినట్లెల్ల ప్రేలెను. అహమ్మదు నోటివెంట వెలువడిన ప్రతిశబ్ద మొక్కొక బాణమువలె నానాజీ హృదయమున నాటెను. కోపముతో నాతని ముఖ మెఱ్ఱబాఱెను. అత డీపరిస్థితియందు లేనిచో నహమ్మదు శరీర మీపాటికి ముక్కలుముక్కలై యుండెడిది. అతని నిస్సహాయ స్థితిని చూచియే అహమ్మదు ధైర్యము చేసినాడు — "ఓరీ! కాఫర్! నీ భార్య యట్లు మరియొకనితో నుండుట కనులార చూచుచు జీవించియుండుట సిగ్గులేని నీకే తగిపోయినది. మఱి యొకడైనచో నీపాటికి ఆత్మహత్య చేసుకొని యుండును. నీ చేతగాకపోయిన నేనే నీ జీవితము నంత మొందింతును." అనుచు కత్తి నెత్తెను. ఇఁక నానాజీ కోపము హద్దుమీఱినది. అతడొక్కమాఱుగ అహమ్మదుపైకి లంఘించి రెండు చేతుల

తోడను అతని నడుము పట్టుకొనెను. పరిస్థితి యిట్లు విష మించునని అహమ్మ దూహించలేదు. నిశ్శస్త్రుడైన వాడు సశస్త్రుడైన తన్నేమియు జేయజాలడని యాతని నమ్మకము. అహమ్మదు వెంటనే నానాజీని పొడుచుటకై కత్తి నెత్తెను. ఆశ్చర్యము! వెనుకనుండి యెవరో యాతని కత్తి లాగుకొనిరి. వెనుదిరిగి చూచుటకైనను వీలులేకుండెను. అంత నానాజీ యాతనిని క్రింద పడవైచి బొమ్మున పొడువసాగెను. ఫాతి మాయే వెనుకనుండి కత్తిలాగి తనను మోసగించెనని యహ మ్మదు తలచెను. నానాజీ దెబ్బలకు తాళలేక అహమ్మదు మూర్ఛనందెను. అంత నానాజీ మృతప్రాయుడైన అహమ్మ దును వదలి లేచి చూచుసరి కెదురుగ నల్లని యువకుడు (రాణోజీ) చిరునవ్వుతో ప్రత్యక్షమయ్యెను. దీపము గొని వచ్చిన ఫాతిమా యచట లేదు.

రాణోజీని చూచి నానాజీ యాశ్చర్యచకితుడయ్యెను. అంత రాణోజీ — "నానాజీ! ఆశ్చర్యపడుట కిక సమయము లేదు. మన మిచటనుండి వెంటనే తప్పించుకొనవలెను. రమ్ము." అని నానాజీని వెంటనిడుకొని ద్వారమువద్ద కేతెంచినంతనే రణదుల్లాఖా నెదురయ్యెను. రణదుల్లాఖా నిదియంతయు వెనుక నుండి చూచుచునే యుండెను. రణదుల్లాను చూచి కోపో ద్రిక్తుడై నానాజీ "రణదుల్లా! నీవంటి విశ్వాసఘాతకుడు వేఱొక డుండడు. నీ వొనర్చిన నీచకృత్యమునకు దగిన ఫలమనుభ వింతువు. ఈపాటికే నిన్ను వధించియుండవలసినది. ఇది తరు ణము కాదని మిన్నకుంటిని." అని పండ్లు పటపటకొఱుకు

చుండెను. అంత రాణోజీ—"రణదుల్లా! నీవు పయోముఖ విషకుంభమవు. పైకి కిలేదారుతో స్నేహముగనుండి నీవొనర్చిన నీచకార్యములను మేము గ్రహించితిమి. కిలేదారు వంశము నప్రతిష్ఠపాలొనర్చితివి. మే మిచటనుండి వెడలిపోవు చున్నాము. నీవు మమ్ముల నడ్డగించుచో మర్యాద దక్కదు. జాగ్రత్త!" అనెను. రణదుల్లా యేమియో చెప్పబోవు చుండెను—"నేనేమియు తప్పుచేయలేదు. ఆమె నిర్దోషి..." అని యింకేమియో చెప్పబోవుచుండగనే వా రిరువురును గబ గబ ముందునకు సాగిపోయిరి. చేయునదిలేక రణదుల్లా గూడ వెనుకకు తిరిగెను. అతడు వెనుదిరిగినంతనే యాతని సోదరియగు హామీదా తన దాసియైన ఫాతిమాతో గూడ ప్రత్యక్షమయ్యెను. "ఈ యర్థరాత్రి సమయమున హామీదా దాసిని వెంటగొని వచ్చుటకు కారణమేమి?" రణదుల్లా కేమియు తోచలేదు.—"సోదరీ! హామీదా! నీ వింతటి యర్థ రాత్రి సమయమున నిచటికి వచ్చుట బాగుండలేదు." అనెను. ఇదివిని ఫాతిమా సమయస్ఫూర్తిగలదగుటచే—"ప్రభూ! ఆమహా రాష్ట్రుని వధింతునని అహమ్మదు నాతో జెప్పినాడు. నేను వలదని వారించినను వినలేదు. బహుశః అతని వధకు తామాజ్ఞ నిచ్చియుండరని తలచితిని. తమవద్దకువచ్చి విన్న వించుటకు సమయములేదు. అందుచే నెట్లైన మన భవనమున నీపాపకార్యము జరుగకుండ నాపించుటకై బేగంసాహిబాను ప్రతిమాలి గొని వచ్చితిన'ని చెప్పెను. ఈమాటలు వినుటతో హామీదాబేగమునకు తన దాసియొక్క సమయస్ఫూర్తికి

సంతోషము కలిగెను. రణదుల్లాకును తన సోదరిపై జనించిన యనుమానము దూరమైపోయెను.

రాణోజీ నానాజీ లటనుండి బయలుదేరి తమ యనుచరుల జేరిరి. రాణోజీకిని నానాజీకిని గాఢస్నేహమేర్పడెను. సమాన దుఃఖితుల స్నేహమట్లే యుండును. నానాజీ బంధవిముక్తుడై మఱలి వచ్చినందులకు తానాజీ, యేసాజీ లానందభరితులైరి. వారేపనికై బీజపుర మేతెంచిరో ఆపని పూర్తియైనది బీజపుర దర్బారునందలి విషయముల నామూలాగ్రమవగత మొనర్చుకొనిరి. తాము సేకరించిన సమాచారములను శివాజీకిగూడ పంపియుండిరి. ఈ మధ్యలో నానాజీ యదృశ్యుడగుటయే సంభవించకుండినచో నాలుగైదు దినములకు పూర్వమే శివాజీయొద్ద కేగియుండెడివారు. నానాజీ విషయము బీజపురమున వెల్లడియైనది. ఇక తామచట నుండుట శ్రేయస్కరముగాదు. అందుచే తానాజీ తన స్నేహితులను ప్రయాణమునకు సిద్ధపరచెను.

నానాజీకి మాత్రము రణదుల్లాపై పగదీర్చుకొనకుండ తిరిగి వెళ్లుట ఇష్టముగలేదు. అతడు తన మనోగతాభిప్రాయమును తానాజీకి వ్యక్తపరచెను. అదివిని తానాజీ—"పిచ్చివాడా! నీవు బీజపురమునను న్నట్లు పట్టణమంతయు తెలిసినది. బహుశః నిన్ను బంధించుట కనేకులు ప్రయత్నించుచుండవచ్చును అదియునుగాక నీవు రణదుల్లా యెదుట నీ ప్రతిహింసాభావమును వ్యక్తపరచితివి. అందుచే నతడు జాగరూకుడై యుండును. కొంతకాలమైన తరువాత నీవు మఱల

బీజపురమేతెంచి నీ ప్రతిజ్ఞను నిర్వహించుకొనినచో బాగుం డును." అనెను. నానాజీకీ మాటలు నచ్చినవి. కాని తన తండ్రి నొకపర్యాయము కలుసుకొనవలెనని యాతని హృద యము కోరుచుండెను. రణదుల్లా ఘొనర్చిన విశ్వాస ఘాత మును, అతడు తనవంశమునకు తెచ్చిన కళంకమును తండ్రికి విపులముగ నెరుకపరచినచో నాతనిహృదయమందలి స్వామి భక్తి క్షీణించి మహమ్మదీయులపై ద్వేషము జనించుననియు అందువలన శివాజీ తలపెట్టిన కార్యమునకు మిక్కిలి యను కూలత చేకూరునని తలచెను. తానాజీ, యేసాజీలు వారించి నను వినక ఆ రాత్రికే రాణోజీ సాయమున తనతండ్రిని కలుసు కొనవలెనని నిశ్చయించుకొనెను.

రాణోజీ ముందుగనే తండ్రి కొడుకుల సమాగమము నకు వలయునుపాయమును పన్నెను. రాత్రి పదిగంటలయ్యెను. కాపలాదారులందరు కునికిపాట్లు పడుచుండిరి. అప్పాసాహెబు గాలికొఱకై బయట వరండాలో నటు నిటు తిరుగుచుండెను. అట్టి సమయమున నానాజీ మెల్లగ తండ్రిని సమీపించి మోకరించి నమస్కరించెను. నానాజీని చూచి కిలేదారు నిలు వెల్ల మండిపోయెను — "ఛీ! దుర్మార్గుడా! నా సమక్షము నుండి లేచిపొమ్ము. నీ కళంకితమైన మోము నిక చూపకుము. నా వంశమునంతను అప్రతిష్ఠపాలొనర్చితివి. నీ ముఖము చూచిన పాపము వచ్చును." అనెను.

"తండ్రీ! మన వంశమునకు కళంకము తెచ్చినది, మీ స్వామిభక్తియే. మన వంశము నప్రతిష్ఠపాలొనర్చినది

నేనుకాదు. మీకు విశ్వాసపాత్రుడుగ నటించుచున్న రణదుల్లా ఖాను. మీ స్వామిభక్తికి వారిచ్చిన పురస్కారము ననుభవించుచుంటిరి గదా ! నేటికి మీరు రణదుల్లాను నమ్ముచున్నారు. ఆ నీచుడొనర్చిన పనిని మీరు వినినచో—" అని మెల్లగ తండ్రితో నేమియో చెప్పెను. నానాజీ రహస్యముగ చెప్పిన మాటలు వినుసరికి కిలేదారు ముఖమెఱ్ఱబారెను. క్రోధముతో నాతని యధరములు కంపించెను. శరీరమంతయు వణికి పోవుచుండెను. ఎట్లో మాట తెచ్చుకొని "రణదుల్లా యట్టి నీచ కార్యమొనర్పడు. నేనిది నమ్మజాలను. ఇదియే నిజమైనచో రణదుల్లా చావు నిక్కము." అనెను.

"రణదుల్లాను మీరు వధించనక్కర లేదు. అతనిని వధించుటకు నేను ముందుగనే ప్రతిజ్ఞ యొనర్చితిని. ఇంతయైనను రణదుల్లాపై మీ విశ్వాసము తగ్గను." అని యింకేమియో చెప్పబోవుచుండగనే వెనుకనుండి 'మీరనుకొనునది యబద్ధము నే నంతటి నీచుడనుకాను. నా ప్రవర్తనను రుజువు చేయగలను. అను శబ్దములు వినవచ్చెను. వెనుదిరిగి చూచుసరికి రణదుల్లా పశ్చాత్తప్తుడై నిలువబడియుండెను. నానాజీయాతని గాంచి ,యసహ్యముతో' ఛీ, 'దుష్టుడా! నీతో మాటలాడుట కూడ పాపము.' అనుచు గబగబ వెడలిపోయెను.

నానాజీ వెడలిపోయిన తరువాత సుమారొక గంట వరకును కిలేదారు నోటవెంట మాటరాలేదు. రణదుల్లా కూడ మట్టిబొమ్మవలె పశ్చాత్తాపముతో శిరము వంచి నిలువబడి యుండెను. కొంతసేపటికి కిలేదారు "రణదుల్లా! నానాజీ

చెప్పిన మాటలు నిజమేనా. నీవట్టి నీచకార్యమున కెంతమల కొడిగట్టితివో తెలియుకున్నది. సుల్తానువద్ద నున్న మహామ్మదీయ సర్దారులలో నీవంటి విశ్వాసపాత్రుడును, ధార్మికుడును, సత్ప్రవర్తకుడును అయిన సర్దారు మఱియొకడు లేడని నావిశ్వాసము. నేటితో నా నమ్మకము పోయినది. ఇక నిన్నేమిచేయవలెనో తెలియుకున్నది." అనెను.

ఈ మాటలు వినుటతో రహిముల్లా కనుల నుండి రెండశ్రుకణములు రాలెను. "కిలేదార్జీ ! నేనొనర్చిన యపరాధమును మీకు విన్నవింతును. దానిని విని మీరు నాపై కోపగింతురు. నన్ను వధించుటకు గూడ బయలు దేరవచ్చును. అయినను జరిగినది జరిగినట్లు తమ సమక్షమున నివేదించి నేనొనర్చినయపరాధమునంగీకరింతును. ఆ విషయము చెప్పుటకు పూర్వమొక ప్రియ సమాచారము చెప్పెదను. నా ప్రార్థనను మురార్జీ ప్రార్థనను మన్నించి సుల్తాను మఱల మిమ్ములను సుల్తాను గఢమునకు కిలేదారుగ నొనర్చుటయేగాక మరికొన్ని విశేషాధికారముల గూడ నొసంగియున్నారు. నాలుగైదు దినములలో మీ ప్రయాణము సాగును. ఇక నేనొనర్చి యపరాధమును వినుడు. మిమ్ములను బంధించి గొనివచ్చుటకు మొదట సయ్యదుల్లా బయదేరెను. అతడు మిమ్ములను పరాభవించుననితలచి సుల్తానుతోజెప్పి నేనేస్వయముగబయలుదేరితిని. సయ్యదుల్లాపాపదృష్టినీకోడలైనపద్మబాయిపై బడెనని నేనెరుగుదును. అందువలననే నేను సయ్యదుల్లాను పంపుట కంగీకరించలేదు. సయ్యదుల్లా వచుచ్చుచున్నాడని తలచి పద్మాబాయితన

మానప్రాణముల రక్షించుకొనుటకై దాసిని వెంటగొని పుట్టి నింటి కేగెనని మీకును తెలియును. నేను సులతాను గథ మే తెంచుచుండ నా కొక యువకుడును, యువతియు గన్పించిరి. ఆ యువకుని రూపము నన్ను మోహించెను. నేనా యువకుని సర్దారుగ నొనర్తునని నావెంట నుంచుకొంటిని. పాప మత డెన్నో పర్యాయములు నా కుద్యోగ మక్కర లేదనియు నన్ను పోనిండనియు బ్రతిమాలెను. కాని మోహపాశమున జిక్కిన నా మనసందుల కంగీకరించ లేదు. అతనిని గొనివచ్చి బీజ పురము నందొక ప్రత్యేక భవనమున నుంచితిని. మనస్సంతు ష్టికై ప్రతిదినము నాతనితో కొంతసేపు మాట్లాడుచుందును. నా నాజీని బంధించిగొని వచ్చుట నాకేమియు తెలియదు. అది నా సేవకు డొనర్చిన పని. నేను వెంటగొనివచ్చిన యువకుని విషయము తెలిసికొన మీరు కుతూహలపడుచుండవచ్చును. ఆమె సయ్యదుల్లా బారినుండి తప్పించుకొనుటకై పురుష వేషము దాల్చి దాసితో నేగుచున్న పద్మాబాయియే. నేటి వఱకు నావలన జరిగిన యపరాధమును మన్నింపుడు. ఆమహా సాధ్వి నాకు తల్లితో సమానము. ఆమె పాతివ్రత్యమున కెట్టి లోటును రాలేదు' అనెను.

ఈ మాటలు వినునప్పుడు కిలేదారు కోపముతో బొడ్లు పటపట కొరుకుచుండెను. చివరకెట్లో తన కోపమును నిగ్ర హించుకొని రణదుల్లా నీ వొనర్చిన పని కడు హేయమైన దైనను చివరకు పశ్చాత్తాపపడి నా తల్లితోసమాన మనుటచే నిన్ను క్షమించితిని. ఇక పొమ్ము. ప్రయాణమునకు వలయు యేర్పాట్లు గావింపుము." అనెను.

రణదుల్లా యచటనుండి జరిగిన దానికై విచారించుచు ఆ యువకుని క్షమాపణ వేడుటకై యాతడున్న భవనమునకే తెంచెను. కాని యింతకు పూర్వమే యువకవేషమునందున్న పద్మాబాయి సమయము చూచి తన దాసిని వెంటగొని పారిపోయెను. ఈ వార్త వినుటతో రణదుల్లా దుఃఖము మరింత హెచ్చెను. "తానొకటి తలచిన దైవమొకటి తలచును. పద్మాబాయిని ప్రార్థించి కిలేదారు యెదుట నేను నిరపరాధినని రుజువుచేసుకొన దలచితిని. ఇప్పుడు పద్మాబాయి లేకుండుటచే నామెను నేనే మరియొకచోట దాచియుంటినని కిలేదారనుమానపడును. ఆతని యనుమానమును దీర్చుటెట్లు?" అని కొంతవడి చింతించి పద్మబాయిని వెదకుటకై కొంతమంది సేవకులను బంపెను.

# ౧౩

నానాజీ తండ్రిపై కోపగించి మరల తన యనుచరులను కలుసుకొనుటకై యూరివెలుపలనున్న మఠమునకు బయలుదేరెను. అతడు పట్టణమునకు దూరముగ నిర్జన ప్రదేశమునబడి నడచిపోవుచుండెను. ఇట్లు పోవుచుండగా దూరమున చెట్టుక్రింద నెవరో యిరువురు వ్యక్తులాతనికి గాన్పించిరి. వారెవరైయుందురా యని నానాజీకొంత తడవు చింతించి యట్లే ముందునకు సాగెను. వారిని సమీపించిన కొలదియు నానాజీ హృదయోద్వేగ మెక్కువగుచుండెను. నానాజీని చూచినంతనే చెట్టుక్రిందనున్న యాయిరువురి ముఖములును వెలవెలబోయెను ఆ యిరువురి యందును నానాజీనిగూర్చి స్త్రీ కంటె పురుషుడే మిక్కిలి భయపడుచుండెను.

కొంతసేపటికి యువకుని వెంటనున్న స్త్రీ నానాజీ యొద్ద కేతెంచి నమస్కరించి "అయ్యా! ఆ పురుషవేషమందున్న వారిని మీరు గుర్తించి యుండవచ్చును. మానరక్ష

ణార్థము రాణిగారి వేషము దాల్చినారు. మీరదృశ్యులైన నాటినుండి మిమ్ముల గలసుకొనుటకై యీ వేషమున ననేక యిడుముల బడితిమి ఇకనైనను కరుణింపుడు" అని ప్రార్థించెను.

ఈ మాటలు వినునప్పుడు నానాజీ కోపముతో తన్నుతామరచిపోయెను. దాసి మాటలాపుట నాపినంతనే "ఛీ, మీ పాపపు ముఖములనిక నాకుచూపవలదు. ఇన్ని దినముల నుండియు వేరొక తురకవానితోనుండి యీ నాడు మరల నాకు ముఖము జూపుటకెట్లు సాహసించితిరి. మీ హృదయమందు పాపవాసనలు లేకున్నను, మిమ్ముల బాధించినవాడు కామోద్రిక్తుడై యున్నప్పుడు మీరు జీవించి యుండుట మహారాష్ట్రజాతికే కళంకము. నేడు నేను నీ ధర్మపత్నినని నా యెద్ద కేతెంచుటకు సిగ్గులేదా! నిజమునకు ధర్మపత్నివేయై యుండినచో తురకలచే నిట్లవమానింపబడుటకు పూర్వమే ప్రాణముల వీడియుండెడిది. నేను నాభార్య చనిపోయినదనియే భావించుచున్నాను. ఈ కళంకితమైన ముఖమును నాకిక చూపవలదు." అని చెరచెర ముందునకు సాగిపోవుచుండెను. నానాజీ మాటలు దాసి హృదయమును కలంచివైచెను. ఆమెకు తన యజమానిరాలిపై నభిమానము మెండు. తన స్వామిని నీ విధముగ ననుమానించి యవమానించుటయామె సహించలేక పోయెను. అందుచే నామె నానాజీతో "సరే కానిండు. ఆమె నిర్దోషియని మీకు తోచిననాడే స్వీకరింతురుగాక. ఆనా

డైనను మీరు పశ్చాత్తాపపడక తప్పదు” అని హెచ్చరించి తన యజమానురాలి యొద్దకేగెను.

నానాజీ యావేశముతో ముందునకు నడచిపోవుచుండెను. అతని చెవులలో దాసియనినమాటలే ప్రతిధ్వనించుచుండెను. కొంతసేపటి కాతడు తన యనుచరులను చేరుకొనెను. మరునా డుదయమే వారందరును ప్రయాణము నిశ్చయించుకొనిరి.

పూర్వమువలెనే వారందరును బైరాలగు వేషముదాల్చి యరణ్యమార్గమునబడి పోవుచుండిరి. మూడు నాలుగు దినములు ప్రయాణము సాగించిన పిమ్మట వారాంజనేయాలయ సమీపమునకు జేరిరి. అంత తానాజీ అందరు నొక్కసారిగ నచటికేగుటకంటె ముందుగ తమ యాగమనవార్తను శ్రీధర స్వామికిని, శివాజీకిని తెలియబరచి పిమ్మట నేగుట యుచితమని యెంచెను. కారణమేమన సుమారొక నెల దినముల నుండియు నిచటి పరిస్థితులు తానాజీ మున్నగువారలకు తెలియవు. అందుచే యేసాజీని యాలయమువద్దకు బంపి తామొక చెట్టునీడను విశ్రమించిరి.

యేసాజీ యాంజనేయాలయమువద్దకేగెను. అచటి పరిస్థితులందేమియు మార్పు కానరాలేదు. వెనుకటివలెనే గుహాముందరిభాగమున పహరాయుండెను. వారి నడుగగా శ్రీధర స్వామియు, శివాజీయును కలసి యెచటికో వెళ్ళియుండిరనియు నేటివరకును తిరిగి రాలేదనియు తెలిసెను యేసాజీ తిరిగి వచ్చి తానాజీకీవార్త నెరింగించెను. తానాజీ తన బుద్ధినంతయు

నుపయోగించి, శివాజీ యెచ్చటికేగి యుండునాయని యాలో చించెను. చివరకాతడు బహుశః నానాజీ బంధింపబడినవార్త విని రక్షించుటకై బీజపురమున కేగియుండునని నిశ్చయించు కొని తన యనుచరులతో 'మనము రెండు మూడు దినముల వరకిచటనే యుండుదమ'నెను. వారును అందుల కంగీకరించిరి.

శ్రీధరస్వామి శివాజీల విషయమై తెలిసికొనుటకు మా పాఠకులు తొందరపడుచుందురు. శివాజీ నానాజీని విడిపించు టకై బీజపుర మేగుట కుద్యుక్తుడైనవిషయమును, శ్రీధర స్వామి వానిని వారించుటయు మా పాఠకు లిదివరలో చదివి యున్నారు. ఎంత వారించినను శివాజీ బీజపుర మేగుటకు తొందరపడుచుండెను. తన ప్రాణస్నేహితుడు విపత్తునం దున్నప్పుడాతనిని రక్షించుటకై ప్రయత్నించక కూర్చుండుట ఆతని ప్రకృతికి విరుద్ధము. శ్రీధరస్వామి కిది యిష్టములేదు. అందుచే శివాజీ మనసు నెట్లయినను మఱియొకవైపునకు త్రిప్పనెంచి శ్రీధరస్వామి "శివా! నీ యాశ్రితవాత్సల్యము కొనియాడదగినదే! కాని సమయాసమయములను గూడ పరికింపవలెను. సామాన్య సైనికుని సైతము రక్షించుభారము ప్రభువుపైనుండును. అట్లని యొక సామాన్య సైనికునికొఱకు ప్రాణముల నర్పించుటయు నీతికాదు అట్లగుచో రామదాస స్వామి తలపెట్టిన ఈ మహత్కార్యమునకే ముప్పు వాటిల్లును. నీపై స్వామికి సంపూర్ణమైన యనురాగమున్నది. నీవలన హిందూ ధర్మ ముద్ధరింపబడునని యెన్నియో కలలుగనినారు. నీ వింతవరకును వారిని జూచియుండ లేదు. నీకు వారి దర్శన

భాగ్యము కలిగింపవలెనని యున్నది." అనెను. ఈమాటలు శివాజీ హృదయమును కొంత ప్రభావిత మొనర్చెను. అతని హృదయము చిరకాలమునుండి స్వామిదర్శనముకై యువ్విళ్లూరుచుండెను. ఇదివరకెన్నిపర్యాయములు శ్రీధరస్వామిని రామదాసస్వామి దర్శనభాగ్యమును ప్రసాదింపుమని కోరినను లభింపించలేదు. నేడప్రయత్నముగ శ్రీధరస్వామి కరుణించి దర్శన భాగ్యము కలుగజేతుననుచున్నారు. అందుచే శివాజీ సంతసించి, ఆయనవెంట బయలుదేరెను.

శ్రీధరస్వామి శివాజీని వెంటనిడుకొని యరణ్యమార్గమునబడి పోవుచు త్రోవలో తమ గురువైన రామదాసస్వామి మహాత్మ్యమునుగూర్చియు వారి యాశయములను గూర్చియు విపులముగ నెరుకపరచెను. శ్రీధరస్వామి చెప్పిన ప్రతిమాటయు శివాజీకి రామదాసుపైగల భక్తినిను మడింప జేసెను. వారట్లు చాలదూరమేగి యొక నదియొడ్డున నున్న వృక్షచ్ఛాయను దిగిరి. శ్రీధరస్వామి శివాజీ నచటనే యుండుమనిచెప్పి తాను ప్రక్కనున్న గ్రామమునుండి భోజన పదార్థముల గొనివచ్చుటకై వెళ్ళెను. శివాజీ వృక్షచ్ఛాయను గూర్చుండి రామదాసస్వామి మహాత్మ్యమును మననము చేయుచుండెను. ఇంతలో నది కావలి యొడ్డున నెవరో బిగ్గరగ కేకలిడుచున్న ధ్వనివినవచ్చుటచే నటు చూచెను. ఒక బ్రాహ్మణుడు నదిలో స్నానమాచరించి చెంబుతో నీరుగైకొని మెల్లిక్క వెళ్ళుచుండెను. వెనుకనుండి మరియొకవ్యక్తి పరుగునవెళ్ళి యాతనిపై నుమిసెను. బ్రాహ్మణుడు కోపము పట్ట

జాలక తిట్టుచు మఱల నదిలోనికిదిగి స్నానమాచరించి మఱల బయలుదేరెను. నాలుగైదు మెట్లెక్కుటతోడనే వెనుకటివ్యక్తి మఱల చేతులనిండ నేదియో గొనివచ్చి బ్రాహ్మణుని శరీరముపై వైచెను. పాపము బ్రాహ్మణుడు కనులవెంట కన్నీరు గార్చుచు నాతనిని తిట్టుకొనుచుండెను. శివాజీ యిది యంతయు చెట్టుకిందనుండి చూచుచుండెను. బ్రాహ్మణుని బాధించుచున్న యావ్యక్తి మహమ్మదీయుడై యుండునని యెంచి వెంటనే నదిలోనికిదుమికి యీదుకొనుచు నావలి యొడ్డునకు జేరెను. శివాజీ యనుమానము నిజమయ్యెను. అతఁడు మహమ్మదీయుడే! శివాజీ యొడలెల్ల మండిపోయెను. వెంటనే యా మహమ్మదీయుని పట్టుకొని కత్తితో నొక్క పోటు పొడిచెను. ఆ కత్తిపోటుతో నాతుఁడు నేలఁగూలెను. అంత శివాజీ యా బ్రాహ్మణునివద్దకేగి నమస్కరించి జరిగిన యుదంతమేమియో చెప్పుడని ప్రార్థించెను. అంతనా బ్రాహ్మణుడు—"అయ్యా! నేను స్నానమునకై వచ్చుచున్నాను. త్రోవలో వీడొకగోవును వధించుచున్నాడు. నేనది చూచియు చేయునదిలేక నదిలోనికిదిగి స్నానము చేయబోవుచున్నాను. ఇంతలో వాడు తనచేతి కంటిన రక్తమును నా శరీరమునకు తుడిచెను. నాకు కోపమువచ్చి తిట్టితిని. అంత వాడు నేను స్నానముచేసి వెళ్ళుచుండగా నాపై నుమిసెను. నేను మఱల స్నాన మొనర్చి వెళ్ళునప్పుడు తాను చంపిన ఆవుప్రేవులు గొనివచ్చి నాపై విసరినాడు. ఇంతలో తాము దయ చేసితిరి." అని చెప్పెను. ఈ మాటలకు శివాజీ కంటివెంట కన్నీరు

కొల్చెను. ఇంతవరకు నాతడు తురకల యత్యాచారములను వినుటయేగాని కనులతో జూడలేదు. నేడు ప్రత్యక్షముగ జూచి నాఁడు. తురకలపై నాతని కోపము మితిమీరిపోయెను. బ్రాహ్మణు నో దార్చి పంపివేసి తాను మఱల నదిదాటి చెట్టు క్రిందకు వచ్చెను. కొంతసేపటికి శ్రీధరస్వామియు వచ్చిచేరెను. ఇరువురును భోజనమొనర్చి మేనువాల్చిరి. శివాజీ తాను చూచినవిషయము శ్రీధరస్వామికి చెప్పుచుండెను. శ్రీధరస్వామి వినుచు శివాజీకి మహమ్మదీయులపై కోపమినుమడింపజేయుట కనేకవిషయముల మధ్యమధ్య చెప్పుచుండెను. ఇట్లు కొంత సేపు వారిరువురును మాట్లాడుకొనుచు నిద్రించిరి.

శివాజీ గాఢ నిద్రయందొక స్వప్నముఁ జూచెను. శివాజీకి స్వప్నమందొక బ్రాహ్మణుడు ప్రత్యక్షమై — "వీర యువకుడా! నీ వొనర్చిన పనికి రామదాసస్వామి సంతోషించినారు. నీవు వారి దర్శనమునకై తొందరపడుచున్నావని వారెఱుంగుదురు. నీవు మహమ్మదీయులనుండి యొక్క దుర్గమైనను జయించకుండ స్వామివారితో సంభాషించుట యసంభవం. నీవు వారిని దర్శింపదలచినచో నుదయమే యిచటికి తూర్పున రెండుమైళ్ళ దూరముననున్న కొండగుహావద్దకేగుము. ఆ గుహయందు స్వామి రామనామమును పునశ్చరణ చేయుచుండును. నీకు వారి దర్శనభాగ్యమబ్బును. వారు నీతో నేమియు మాట్లాడరు. కేవలము దర్శనము మాత్రమిత్తురు. ప్రస్తుతమున కంతటితో దృప్తిజెందుము." అనెను. ఈ స్వప్నముంగాంచి శివాజీ పరమానందభరతుడయ్యెను. అతడారాత్రియంతయు నేవేవో కల్పనలందు మునిగిపోయెను.

తెల్లవారుజామున శ్రీధరస్వామికి జెప్పకుండగనే శివాజీ లేచి తూర్పుదిక్కునకు పయనమయ్యెను. గురుదర్శనా కాంక్షతో త్వరత్వరగ నడచి స్వప్నమున వృద్ధబ్రాహ్మణుడు చెప్పిన గుహావద్దకు చేరెను. నలువైపులను కలయజూచి యాప్రశాంత వాతావరణమునకు లోన నలరుచు గుహాలోనికేగి చూచెను. అందొక వ్యక్తి సన్యాసివేషమున ధ్యాననిమగ్నుడై యుండెను. ముఖమున శాంతరసము ట్టిపడుచుండెను. నోటినుండి రామ నామము వెలువడుచుండెను. నేటికి శివాజీతపస్సు ఫలించెను. స్వామి కరుణించి దర్శన మొసంగెను. శివాజీకి స్వామిపైగల భక్తి యినుమడించెను. అతడు స్వామిచెంత సాష్టాంగపడి— "స్వామీ! శిష్యుని కరుణింపుడు. నేటికి జన్మ సార్థకమైనది. ఇకముందు నే నేమి చేయవలెనో సెలవిండు." యనుచు తన్మ యుడై తన్ను దామఱచిపడియుండెను. ఆ తన్మయావస్థయందు రామదాసస్వామి శివాజీతో — "వత్సా! హిందూధర్మము నుద్ధరించి స్వరాజ్యస్థాపన మొనర్పవలెను. ఈ పవిత్ర కార్య నిర్వహణకే నీ వవతరించితివి. నేను నిమిత్తమాత్రుడను. ఇంత వఱకును నీవు సాధించిన విజయము లేదు. నీ విట్టింకులకు పే క్షించుచుంటివో తెలియకున్నది. లెమ్ము. ముందునకు సాగుము. నీపై భవానీమాత కరుణాకటాక్షమున్నది. ముందే దైన నొకదుర్గమును జయించుము. ఆలస్యమువలదు. ఆ ప్రథమ విజయావసరమున మఱల దర్శన మిత్తును" అనెను.

శివాజీ సంతోషముతో కనులు తెఱచి చూచెను. ఎదుట నెవరునులేరు. అచటినుండి లేచి మఱల శ్రీధరస్వామిని కలుసుకొనుటకై బయలుదేరెను.

## ౧౪

తానాజీ మున్నగువారు శివాజీ రాకకై ప్రతీక్షించుచు నాంజనేయాలయమునకు కొలదిదూరమున విడిసి యున్నారని చదువుకొని యుంటిమి. రెండుమూడుదినములలో శివాజీ జాడ తెలియునని వారి యూహ. అందుచే తానాజీ యచటనే యుండుటకు నిశ్చయించెను. కాని నానాజీకి మాత్ర మేమియు దోచుటలేదు. అతనికి మాటిమాటికిని తన భార్య జ్ఞప్తికి వచ్చుచుండెను. ఆమెతోబాటు దాసి యనిన మాట లాతని మస్తిష్కమున ప్రతిధ్వనించుచుండెను. రణదుల్లా యెడల గల ప్రతిహింసా భావము ద్విగుణీకృత మగుచుండెను. ఇచట పనిలేకుండా కూర్చుండుట నానాజీకి నచ్చలేదు. తన తండ్రి సుల్తానుగఢమునకు రాకపూర్వమే తా నచటి కేగి యచటి పరిస్థితులు తెలుసుకొని వత్తునని తానాజీతో చెప్పి బయలుదేరెను.

త్రోవలో ననేక మజిలీలు చేయుచు నానాజీ సుల్తాను గఢమునకు పోవుచుండెను. ఒకనాటి రాత్రి యాత డొక చెట్టుక్రింద విశ్రమించియుండెను. అట్టి సమయమున నాతని కొక మధురగానము వినవచ్చెను అతడా మధురగాన మెవరిదై యుండునా యని యాలోచించుచు వినుచుండెను. ఇంతలో నా మధురగాన మాక్రందనముగ మారిపోయెను. నానాజీ కేమియు బోధపడలేదు. అతడాధ్వని వినవచ్చిన దిక్కునకు బయలుదేరెను. అట్లు కొంతదూర మేగినంతనే యాతని కా యరణ్య మధ్యమున నొక కుటీరము కాన్పించెను. అందుండియే గానము వెలువడుచుండెను. మరుక్షణముననే గానము రోదనములోనికి మారుచుండెను. ఏత్పాతో బాటు వెంటనే నవ్వులుగూడ వినవచ్చుచుండెను. ఆమె యెవరో యున్మాదినియై యుండునని యెంచి నానాజీ కుటీరమువద్ద కేగి తలుపు తట్టెను. లోపలినుండి—"ఎవరు?" అను ప్రశ్న వినిపించెను. నానాజీ—"అయ్యా! నేనొక బాటసారిని. తలుపు తీయుడు. ఈరాత్రి కిచట నాశ్రయమిండు. ఉదయమే వెడలిపోదును." అనెను.

ఈ మాటలకు లోపలినుండి — "బాటసారివైనచో గ్రామము సమీపముననే యున్నది. గ్రామములోనికి పొమ్ము. ఇచట వీలులేదు." అని సమాధానము వచ్చెను. నానాజీ కా మాటలు పరిచితములైన వానివలె తోచెను. అందుచే నాతడు—"బాబూ! నాకు త్రోవ తెలియదు. మీకు పుణ్యముండును. నన్నీ రాత్రి కిచట పడియుండనిండు." అని దీనముగ

ననెను. ఈ మాటలు విని లోపలనున్న వ్యక్తి విసుగుకొనుచు తలుపు తెఱచెను. నానాజీ లోన ప్రవేశించి — "అయ్యా! ఇచట నెవరో పాటలు పాడుచున్నారే!" యనెను. ఆ వృద్ధుడు—"నా కుమార్తెయే! ఆమెకు పిచ్చి యెత్తినది. అట్లే పాడుచు, యేడ్చుచు నవ్వుచుండును." అనెను. ఈవృద్ధుని చూచిన జ్ఞాపక మున్నదిగాని నానాజీకి గుర్తువచ్చుట లేదు. అత డాలోచించుచుండగనే బయట గుఱ్ఱపు డెక్కల చప్పుడు వినఁబడెను. వృద్ధుఁడు బయటకేగెను. అతని వెనుకనే నానాజీ కూడ గుమ్మమువద్ద కేగి తొంగిచూచెను. ఒక యశ్వారూఢు డైన వ్యక్తి వృద్ధునితో మాట్లాడుచుండెను. వా రిరువురి సంభాషణయు తనకు సంబంధించినదే యని నానాజీ గ్రహించెను. కొంతసేపటి కా యశ్వముపైనున్న వ్యక్తి నానాజీ యొద్ద కేతెంచెను. అతనిం జూచినంతనే నానాజీ యాశ్చర్య చకితుడై యాతని కౌగలించుకొని "సూర్యాజీ యెన్ని దినములకు నిన్ను చూడగలిగితిని" అనెను.

ఇచట మా పాఠకుల కొక యనుమానము కలుగవచ్చును. వారు సూర్యాజీ చనిపోయెనని తలచి యుందురు. కాని యాతడు చనిపోయినట్లు మేమెచటనూ చెప్పియుండలేదు. బాలుడైన రాముడు మాత్రము సూర్యాజీ చనిపోయెనని భావించి హనుమప్ప నాయకునితో జెప్పియుండెను. సూర్యాజీ చనిపోవుటయందాశ్చర్యము లేదుకాని బ్రతికిబయట పడుట మాపాఠకులకేగాక మాకును ఆశ్చర్యముగనేయున్నది. రాముడు చెప్పిన వార్తనుబట్టి వృద్ధుడు నల్లని స్థూలకాయు

నొకని బంపుటయు, నాతడగ్నిజ్వాలనుండి సూర్యాజీ భార్యను రక్షించి గొనివచ్చుటయు పాఠకులెరుంగుదురు. ఆమెను గొని వచ్చిన పిమ్మట వృద్ధుడు వఃఅల నా కృష్ణకాయుని బంపి 'సూర్యాజీ శవము నిటకు గొనిదెమ్ము. మన చేతులతో నంత్య క్రియలొనర్చుకొందము!' అని చెప్పి పంపెను. అతడట్లే సూర్యాజీని కొనివచ్చెను. వృద్ధుని కుటీరమునకు తీసు కొని వచ్చునప్పటికింకను సూర్యాజీ ప్రాణములు పోలేదు. వృద్ధుడు రాముని సాయమున నాతనికి శుశ్రూష యొనరించిన విషయము మా పాఠకులకు విదితమే వృద్ధుని తపస్సుఫలించి నది. సూర్యాజీ బ్రతికినాడు.

సూర్యాజీ యారోగ్యవంతుడైననాటినుండియు మహ మ్మదీయ సామ్రాజ్యమును సమూలముగ నాశనమొనర్చుటకై ప్రతినబూని మహమ్మదీయుల బంధించుటయు, దోచుకొను టయు తన కార్యక్రమముగ నిర్ణయించుకొనెను. కాని మధ్య మధ్య తన భార్య యున్మాదస్థితి జూచినప్పుడాతనికి దుఃఖము కలుగుచుండెను. ఆ దుఃఖము వెన్వెంటనే మ్లేచ్ఛులపై కోప ముగ పరిణమించుచుండెను.

సూర్యాజీ తన దుఃఖగాథ నంతయు నానాజీ కెరుక పరచి, రాము డొనర్చిన సాయమును వేనోళ్ళ నుతించెను. మహా రాష్ట్ర రాజ్యస్థాపనకై యతడొనర్చిన ప్రయత్నముల విశదీకరించి తాను సేకరించిన ధనమును ఆయుధములను చూపెను. ఆంజ నేయాలయమునయున్న సామగ్రికంటె నివి చాల తక్కువ. ఐనను సూర్యాజీ యొక్కడే యింతటి ఘనకార్య మొనర్ప

గలిగినందులకు నానాజీ కాశ్చర్యము కలిగెను. అతడు మాత్రము సూర్యాజీతో తన విషయమేమాత్రమును చెప్ప లేదు. తాను ప్రస్తుతము సుల్తాను గఢమునకు పోవుచున్నా నని మాత్రము చెప్పెను. సూర్యాజీ యందులకు, "నీవు సుల్తానుగఢ మేగుటకంటె మఱియొకనిని బంపుట యుత్తమము. మన రాముడిందులకు తగినవాడు. వాడచటి విషయముల నన్నిటిని తెలుసుకొని రాగలడు." అని నానాజీ, నచటనే యాపి రాముని బంపెను.

రామునికంతకంటే కావలసినదేమున్నది? వానికెల్ల ప్పుడేదో యొక పని యుండవలెను. పనిలేనిచో వానికితోచదు. అందును నానాజీ, సూర్యాజీలకు సంబంధించిన పని. వానికి రెక్కలు వచ్చినట్లయ్యెను. వాడు సుల్తానుగఢమునకు ప్రయా ణమైపోవుచు త్రోవలో భోజనము చేయుటకై యొక నూతి యొద్దకేగెను. అచటజేరి మూటవిప్పి భోజనము చేయుచుండగా దూరమున నాతని కెవ్వరో కన్పించిరి. కుతూహలపూర్ణమైన వాని దృష్టి వారిని గుర్తించుటకై చాల ప్రయత్నించెను. వారు మరికొంతదగ్గరకు వచ్చిన పిమ్మట రాముడు వారలను గుర్తించెను. వారును రాముని గుర్తించిరి. అందు దాసియగు రుక్కి రాముని సమీపించి — "రామూ! చూచితివిగదా! ఈమె రాణి పద్మాబాయి. నానాజీ యిపుడెచటనున్నారు?" అని ప్రశ్నించెను. అంత రాముడు సంతోషముతో "నానాజీ యిచటికి సమీపముననే యున్నారు. నాతోడ రండు. వారి యొద్దకు గొనిపోవుదును" అనెను. ఇది విని దాసి 'వలదు. నానాజీకి

మేము కనుపించిన విషయముకూడ చెప్పవద్దు. మేము రహస్యముగ సుల్తానుపురమునకు దగ్గరగనుండవలెను. ఇందుకు మీయమ్మ తగిన సాయమొనర్పగలదని విశ్వసించుచున్నాను. నీవు నీ తల్లిని గొనిరమ్ము' అనెను. రాము డందులకు సమ్మతించి వారిని సుల్తానుగఢమునకు సమీపమందున్న నొక కుగ్రామమున నొక యింటికి జేర్చి తన తల్లిని గొనివచ్చుటకై బయలు దేరెను.



## ౧౫

రాముని బాల్య చాపల్యము మనకు పరిచితమే. అత డెల్లప్పు డేదో యొక వినోదమును వెదకుచునే యుండును. అల్లరిచేయుట కవకాశము లభించినచో నాతనికి తిండి తిప్ప లక్కఱలేదు అందును కొలది దినములనుండి సూర్యాజీ సాంగత్యమున నుండుటచే మహమ్మదీయుల నేడ్పించుటలో మంచి ప్రావీణ్యత సంపాదించెను.

పద్మాబాయి సంరక్షణకై తన తల్లి నటదింపి రాముడు మరల సుల్తానుపురమునకు బయలుదేరెను. త్రోవలో నాతని కొక యశ్వముపై నెక్కివచ్చుచున్న మహమ్మదీయుడొక డెదురయ్యెను. అతడు రాముని జూచి "ఓరీ, నీకు త్రోవలో నెదురైన నిరువురు స్త్రీలగుపించిరా" యని ప్రశ్నించెను.

"కనుపించిరి."

"స్త్రీలేనా ? ఇరువురు కదూ ?"

'అవునవును. అందొకతె బేగము, మఱియొకతె యామె దాసి' 'నీకెచట కనుపించిరి?' 'కొలదిదూరముననే కనుపించిరి. ఒకతె విలువ గలిగిన దుస్తులు ధరించినది. మఱియొకతె సామాన్యముగనున్నది. వారేనా?'

రాముని నోటినుండి ఈ మాటలు వినుసరికి మహమ్మదీయునికి కొంత యాశ జనించెను. వీనివలన మనకు కావలసిన విషయము తెలియగలదని యెంచి "అబ్బాయీ! నీవు సుల్తానుపుర మెఱుగుదువా? నానాజీ యెచటనున్నాడో తెలియునా? ఆ స్త్రీ లెటువైపునకు పోయిరి? నీవు నిజము చెప్పినచో చక్కని బహుమతి నిత్తును.' అనెను.

ఆ మహమ్మదీయుని తొందర రాముడు బాగుగ గుర్తించెను. వీని విషయము కనుగొనవలెనని యెంచి 'ఖాన్‌జీ! సుల్తానుగఢములో నే నెరుగనివారు లేరు. మీరు పాపమా స్త్రీలకొఱకు వెదకుచున్నారు కాబోలు. వారిని దొంగలు పట్టుకొని పోయిరి.' అనెను. ఈమాటలు వినుటతో నా మహమ్మదీయుని ప్రాణము లెగిరిపోయెను. తన ప్రియురాలి కింతటి విపత్తు సంభవించినందుల కాతని యంతరాత్మ చాల దుఃఖంచెను. అతడు రామునితో 'నీవు నాకా చోరులుండు స్థలమును చూపగలవా?' యని ప్రశ్నించెను.

'చూపగలను కాని మీరచటికేగి వారి నెదిరించ జాలరు. మహమ్మదీయులన్నచో వారి కమితమైన కోపము. నేనొక యుపాయము చెప్పెదను. నా సోదరండు. సుల్తానుపురమున దావూదను స్నేహితుడొకడు కలడు. అతనియింట

భోజనముచేసి తరువాత కార్యక్రమమును నిర్ణయించు కొందము.' అని వానిని వెంటబెట్టుకొని సుల్తానుపురమునకు వెలుపలనున్న యొక యింటియొద్ద కేగెను. మహమ్మదీయుని బయటనేయుంచి రాముడు లోనికేగి యొకవ్యక్తిని వెంటనిడు కొని వచ్చి "ఇతడే దావూదు. చాలమంచివాడు." అని పరి చయ మొనర్చెను. దావూదామహమ్మదీయుని లోనికి గొంపోయి సత్కరించి కూర్చుండ బెట్టెను.

భోజనమైన తరువాత ముగ్గురును భావి కర్తవ్యమును గూర్చి యాలోచింప మొదలిడిరి. దావూదునకా మహమ్మ దీయునితో మంచి పరిచయ మేర్పడెను. మహమ్మదీయునకు రాముని మాటలపై విశ్వాసము జనించెను. మాటల ధోర ణిలో దావూదుచనిపోయిన తన భార్యనుగూర్చియు, ఆమె ప్రేమనుగూర్చియు నతిరంజితముగ వర్ణించి కన్నీరు నింపు కొనెను. దావూదు ప్రేమగాథచూడ నామహమ్మదీయునకు తన ప్రియురాలు జ్ఞప్తికి వచ్చెను. అతని మనసు తన ప్రియురాలి యొద్ద కేగుటకు తొందర పెట్టుచుండెను. ఇదిచూచి రాముడు "ఖాన్‌జీ! మీరీ వేషమున వచ్చుటకు వీలులేదు. ఆ దొంగ లకు మహమ్మదీయులనిన ద్వేషము! స్త్రీలనుమాత్ర మేమియు ననరు. బాలురనుగూడ వారేమియు ననరు. బాధించినచో బంధింతురు గాక. కావున మీరు ఆడవేషమును ధరించి వచ్చి నచో మనపని నెరవేరును. నేను బాలుడనే గదా!" అనెను.

ఈ మాటలను మొదట నా మహమ్మదీయునకు కోపము వచ్చినను, విధిలేక యంగీకరింపక తప్పినదికాదు.

వెంటనే దావూదు పాతగుడ్డల మూటలోనున్న తన మృత పత్నివస్త్రముల దీసి కన్నీరు నింపుకొనుచు నాతని కందించెను. ఆ మహమ్మదీయుడు తప్పనిసరియై ప్రియురాలి ప్రేమ తొందరపెట్టుచుండ వాటిని ధరించి రాముని వెంట బయలు దేరెను. అతని ముఖమున బురఖా యుండుటచే రాము డెచటికి గొనిపోవుచున్నాడో తెలియుటలేదు.

కొంతదూర మేగిన పిమ్మట రాముడాతని నొక చెట్టు క్రింద నిలువబెట్టి దొంగ లేమిచేయుచున్నారో చూచివత్తునని వెళ్లెను. నాలుగైదు నిమిషములకు తిరిగివచ్చి "ఫరవాలేదు. రమ్ము. కాపలావానికి లంచమిత్తునని యాశగొల్పితిని." అని యాతని వెంటనిడుకొని యొక కుటీరముచెంత కేగెను.

ద్వారమువద్ద కేగినంతనే యొకడు ముందునకువచ్చి రాముని పట్టుకొని "ఎవడవురా నీవు?" అని గద్దించెను. రాముడు భయమును నటించుచు — "నేను... నేను...నా...నా...బీబీ..." యనెను. అంత నావ్యక్తి — "ఏమి! ఈమె నీ బీబీయా? ఎంత చక్కని చిన్న భార్యను సంపాదించుకొంటివిరా" యనుచు స్త్రీవేషముననున్న మహమ్మదీయునివద్ద కేగి ముసుగు తొలగించబోయెను. అతఁడు ఆఁ, ఆఁ యనుచు వెనుకకు తగ్గెను. రాముడాతనితో — "అయ్యా! పాపమామె సిగ్గుపడుచున్నది. ఆమె నేమియు ననకుడు. కావలసినచో మా యిరువురను మీ యజమానికడకు గొంపోవుడు!" అనెను. అందులకావ్యక్తి రాముని చెంపపై నొకటివేసి — "నీకు నీ భార్యపై నెంతటి ప్రేమయున్నది! ఇంత చక్కటి

భార్య నెచట సంపాదించితివి ?" అనెను. ఇంతలో మఱి నలుగురైదుగు రచటి కేతెంచిరి. వారికి చక్కని వినోదకారణము లభించెను, చివఱ కందొకడు ముందునకేగి ముసుగుతొలగించెను. మీసములు గడ్డము నల్లే యుంచుకొని స్త్రీల దుస్తులను ధరించినమహమ్మదీయుడుప్రత్యక్షమయ్యెను. అతనిరూపమునకు యందరును కడుపుబ్బ నవ్వుకొని యొక మంగలిని పిలిపించి యా మీసమును గడ్డమును తీయించి యాతని వేషమును పూర్తిచేసి సూర్యాజీవద్దకు గొంపోయిరి. రాము డాతని సమాచారము చెప్పుచుండ సూర్యాజీ కడుపు చెక్కలగునట్లు నవ్వుచుండెను. ఇంతలో నానాజీ యచటి కేతెంచెను, నానాజీని చూచుటతోడనే స్త్రీ వేషముననున్న వ్యక్తి ముఖమున నెత్తురుచుక్కలేదు. నానాజీ యాతనిం గాంచి — "అహమ్మదూ! నీ ప్రేయసియగు ఫాతిమాకొఱ కింతదూరము వచ్చితివా ? నీకును, నీ యజమానికిని ఒకే రోగము పట్టినది. మీ రోగములను కుదర్చుటకై కొలదిదినములలో నేనే వచ్చెడివాడను గదా !" యని తన సేవకులతో నీతని గొనిపోయి బంధించుడని యాజ్ఞాపించెను.

ఇంతలో నిరువురు సేవకు లేతెంచి సూర్యాజీతో నేదియో రహస్యముగ జెప్పెను. అంత సూర్యాజీ వారితో— "వారినిగూడ గొనిరండు. వేరొక గదియందు వారిని బంధించి యుంచుడు, వారిని మాత్ర మేవిధముగను అవమానపరుపవద్దు అని చెప్పి పంపెను.

ఆ క్రొ_త్తగ వచ్చినవారెవరో తెలుసుకొనుటకు పాఠకులు కుతూహలపడుచుండు. వారు మఱెవ్వరును కారు. రణదుల్లా సోదరియగు హమీదా, ఆమె దాసి యగు ఫాతిమా. హమీదా యిచటికే తెంచిన విధమునుగూడ మా పాఠకుల కెఱింగింతుము.

హమీదా మొదటిసారిగ నానాజీని చూచినప్పటి నుండియు నామెకొక విధమైన యాదరాభిమానములు జనించెను. ఆ యాదరాభిమానములు నానాటికి వృద్ధియై యామెను నానాజీని చూడజాలని-చో బ్రతుకలేని స్థితికి గొనివచ్చినవి. ఆమె తన యన్నయగు రణదుల్లాతో నేమి చెప్పెనో తెలియదుగాని రణదుల్లాగూడ కిలేదారును సుల్తానుగఢమున కొన్ని దినములపాటు తన సోదరియగు హమీదా యుండుటకేర్పాట్లు గావింపవలసినదిగ ప్రార్థించెను. అప్పాసాహ బందులకంగీకరించెను. అప్పాసాహబుతో బాటు హమీదా ప్రయాణముగూడ నిశ్చయింపబడెనుగాని యే కారణముననో కిలేదారున కెన్ని రోజులు గడచినను, సుల్తానుగఢమేగుటకు సుల్తానువద్దనుండి యాజ్ఞ రాలేదు. కిలేదారు ప్రయాణము రోజు రోజునకును వాయిదాలు పడుచుండెను. అందుచే హమీదా ముందుగనే సుల్తానుగఢమునకు పయనమయ్యెను.

ఆమె యచటినుండి సుల్తానుగఢమేగుటకు వఱియొక కారణముగూడగలదు. సయ్యదుల్లాఖాను కిలేదారును పదచ్యుతు నొనరించుటకు విశ్వప్రయత్నమొనర్చియుండెనని మనమెఱుంగుదుము. రణదుల్లా, మహార్జీల ప్రయత్నములవలన నాతని

యాటలు సాగలేదు. అప్పాసాహెబును మఱికొన్ని విశేషాధి కారములతో మఱల కిలేదారుగ నియమించుట జరిగెను. సయ్యదుల్లా దీనికి తగిన ప్రతీకారమొనర్పనెంచెను. సుల్తాను నెట్లయినను వశపఱచుకొనవలెను. అందుకాతడొక యుపాయమును పన్నెను. సుల్తానునకు రణదుల్లా సోదరియగు హమీదా సౌందర్యము ననేక పర్యాయములు వర్ణించిచెప్పి, యామె హాజూరు అంతఃపురముననుండ దగినదని సూచించెను. సుల్తానునకా సౌందర్యమూర్తిని చేపట్టవలెనని యున్నను విశ్వాసపాత్రుడును, శక్తిశాలియునగు రణదుల్లా యసంతుష్టుఁడగునని వెఱచుచుండెను. సయ్యదుల్లామాత్రము తన ప్రయత్నమాపలేదు. యీ విషయము హమీదాకును, రణదుల్లాకును తెలిసెను. అందువలననే హమీదా తన దాసియగుఫాతిమాను వెంటగొని సుల్తానుగృహమునకు బయలుదేరెను.

సుల్తాను వద్దనుండి యాజ్ఞకొఱకు అప్పాసాహెబు చాల దినములనుండి వేచియుండెను; గాని యాతనికెట్టి యాజ్ఞయు లభింపలేదు. కిలేదారునకు విసుగు జనించెను. విసుగు జనించుటేకాదు సుల్తానుపై కోపముగూడ వచ్చెను. తన స్వామిభక్తికి సుల్తాను చూపిన నిరాదరణ కాతనికి దుఃఖము కలిగెను. ఇట్టి యజమానులను గొలుచుట తనదే పొఱబాటని పశ్చాత్తాపపడెను. నేటి యుదయమునుండి కిలేదారు మనసులో చాల బాధపడుచుండెను. రెండునెలలు గడచినను తన విషయము తేలలేదు. ఏమి చేయవలెనో తోచక చింతించుచుండెను. ఇంతలో రణదుల్లాఖా నచటి

కేతెంచెను. అతనిని జూచి కిలేదారు—"రణదుల్లా! ఇట్టి సుల్తానుల సేవ జేయుటకంటె కాశికేగి విశ్వనాథుని సేవించుకొనినచో పుణ్యముండును. జన్మసార్థకమగును. ఇక నేనిచట నుండను. నాకీ కిలేదారు పదవి యక్కఱలేదు. రేపు ఉదయమే సుల్తానువద్ద శలవుగైకొని కాశికేగెదను. అని దుఃఖముతో ననెను.

కిలేదారు స్థితికి రణదుల్లాకుగూడ దుఃఖము కలిగెను. అప్పాజీ! నేనును, మరార్జియు చాల దినములనుండి మీ విషయము సుల్తానుతో జెప్పుచున్నాము. కాని, భోగలాలసుడైన యాతడు మా మాటలను పట్టించుకొనుటలేదు. నేడు పట్టుబట్టి మీ ప్రయాణమునకు ఆజ్ఞ, గొనివచ్చితిమి. ఉదయమే మీరు పయనమై సుల్తానుగృహమునకు పోవచ్చును. అనెను". ఈ మాటలను కిలేదారు పరమానంద భరితుడయ్యెను.



## ౧౬

సుల్తానుగఢమునకు సుమారొక మైలు దూరమున నందిగ్రామముగలదు. ఆనందిగ్రామమున నొకనాటి సాయంకాలమొక యశ్వారూఢుడైన మహారాష్ట్ర యువకుడు ప్రవేశించెను. అతడు తా నధిరోహించివచ్చినయశ్వమునుగ్రామము వెలుపలనున్న యాలయమువద్ద కట్టివేసి తాను పాదచారియై గ్రామమున బ్రవేశించెను. అతడాతిథ్యముకొఱకై గ్రామమంతయు దిరుగుచుండెను. అట్లు తిరుగుచుండ నాతనికొక కుటీరము కనుపించెను. ఆ కుటీరము వద్దకేగి యాతడచట నున్న వనితతో—"అమ్మా! నేను బాటసారిని. నాకీ గ్రామము క్రొత్త. నేనిచట రెండు దినములుండి దుర్గమును చూడవచ్చితిని. మీకేమైన నిచ్చుకొందును. నాకు భోజనము పెట్టి పరుండుటకు చోటిండు." అని ప్రార్థించెను. ఈ మాటలు విని యా స్త్రీ—"అయ్యో! మేము బీదలము. అయినను భోజనముపెట్టి డబ్బు పుచ్చుకొనుట మా పనికాదు.

మా కున్నంతలో మీ భోజనమునకు లోటు చేయము. దయ చేయుడు." అనెను. ఈమాటలకా యువకు డాశ్చర్యపడి— "అమ్మా! అట్లయిన సరియే! గ్రామము వెలుపలనున్న యాలయమువద్ద నా యశ్వమున్నది. నేను వెళ్ళి దాని యాహారము విషయ మాలోచించి వత్తున"నెను. ఇదివిని యామె—"అయ్యా! మీ యశ్వములనుగూడ నిచటికే గొని రండు. దొడ్డిలో కట్టివేయవచ్చును." అనెను. ఈమాటల కాతడు పరమానంద భరితుడై వల్లెయని బయలుదేరెను.

రాత్రి భోజనమైన పిమ్మట యువకుడు బయట అరుగుపై పరుండెను. అతని మస్తిష్కమేదియో యాలోచించు చుండుటచే నాతనికి నిద్రరాలేదు. ఇంతలో నాతనికి లోపలి నుండి యీక్రింది సంభాషణ వినవచ్చెను.

"పురుషు లేపనిచేసినను బాగుగనే యుండును. ఇల్లు వదలి వెళ్లునప్పుడు భార్యగతి యేమగునని యాలోచించ నక్కరలేదా?"

"వారికేమి? వారి తప్పునకుగూడ శిక్ష ననుభవించ వలసినది మనమే!"

"మంచి తెలివిగలవాడు. ఇదియే నా పరాక్రమము? భార్యపై పనికివచ్చుచున్నది. శివాజీతో జేరి స్వరాజ్యము సంపాదించునట! ఆ పరాక్రమమేమో చూతము. ఈ పర్యాయ మెదురుబడి యుద్ధ మొనర్చినప్పుడుగాని తనభార్య యెట్టిదో తెలియదు."

ఇంతకు మించిన సంభాషణ యువకునికి వినిపించలేదు. అతని మనసు వికలమగుట కీ సంభాషణ చాలును. ఉదయమే వీరి విషయమును తెలుసుకొనవలెనని యెంచి యువకుడు పరుండెను. అతనికి నిద్రపట్టలేదు. పగలంతయు సుల్తానుగఢపు పరిసరములనన్నిటిని జాగ్రత్తగ పరిశీలించి వచ్చినాడు. అయినను తృప్తికలుగలేదు. అందుచే మెల్లగ లేచి మఱల బయలుదేరెను. అత డాయంధకారమున దుర్గమునకు చుట్టుప్రక్కల నున్న ప్రదేశముల నన్నిటిని జాగరూకతతో పరిశీలించి మఱల యథాస్థానమునకు చేరునప్పటికి నాలుగుగంటలయ్యెను. అతడు వచ్చి యరుగుమీద కూర్చుండిన వెంటనే తలుపు తెరచుకొని లోపలినుండి యాతని కాతిథ్యమిచ్చిన స్త్రీ బయటకు వచ్చెను. అతడామెం గాంచి—"అమ్మా! మీ రెవరో గొప్పయింటివారి వలె నున్నారు. ఏవో విపత్తులకు లోనై మీరిట్టిడుమల బడుచున్నారని తలంచెద. మీ యథార్థ పరిస్థితిని తెలిపినచో నాచేతనైన సాయ మొనర్చెద"ననెను. ఆమాటలకా తరుణి—"అయ్యా! నా యజమానురాలిపై నామె భర్త నిష్కారణముగ కోపించి యామెను పరిత్యజించెను. అందుచే మరల నా స్వామినికి మంచిదినము లెప్పుడు వచ్చునాయని యెదురు చూచుచున్నాము. ఏనాటికైనను నాతని యనుయానము దూరమై నానాజీ తిరిగి నా స్వామినిని"......అని చెప్పుచు నాలుక నొక్కకొనెను. అంతకంటె నెక్కువ యామె చెప్పకున్నను యువకునకు కావలసిన విషయ మర్థమైనది. అందుచే నాతడు—"అమ్మా మీరు చింతింపకుడు. త్వరలో శుభ

దినములు రాగలవు. ఈ విషయమున నా చేతనైనంతవరకు సాయ మొనర్తు. మీరు నా కొనర్చిన నీ యుపకారమున కీ పారితోషికము గొనుడ”ని యొక సంచి నిచ్చి “దుర్గముపై నున్న దేవిని దర్శించవలెనని కుతూహలపడుచున్నాను. నే నొంటరిగ నచటి కేగినచో నన్ననుమానింతురు. అందుచే తోడుగ నెవరైన నా వెంట వచ్చువారు గలరా?” యని ప్రశ్నించెను.

అందుల కామె “ తెల్లవారిన తరువాత రాముడను శాలు డొకడు వచ్చును. అతని వెంట మీరు కొండపై కేగ వచ్చును. అతడు వెంటనున్నచో మిమ్మెవ్వరు నవమానింపరు.” అని యామె లోనికేగెను.

ఉదయమే యా యువకుడు రాముని వెంటగొని దేవి దర్శనమునకై పైకి బయలుదేరెను. త్రోవలో నాయువకుని గూర్చి రాముని ప్రశ్నించిరి. అతడు కొందరితో తన మామ యనియు, కొందరితో పినతండ్రి యనియు సమాధానము చెప్పుచు పైకి గొంపోయెను. యువకుడు దేవ దర్శన మొన రించి తాను చూడదలచుకొనిన విషయముల నన్నిటిని పరిశీ లించి క్రిందకు దిగివచ్చుచుండగ, రాము డా పురుషునితో— “అయ్యా! నేనుగూడ మీ యొద్దకు వత్తును. మా నానాజీ మీ యొద్దనే యున్నాడట.” అని ప్రార్థించెను. రాముని చురుకుదనమునకును, తెలివితేటలకును యువకుడు సంతసించి యీ పర్యాయము నిన్ను గొంపోదునని యాతనిని సమాధాన పరచి తా నెచటికో వెడలిపోయెను.

ఈ వచ్చిన యువకుడు శివాజీయని పాఠకులు గుర్తించి యుందురు. కిలేదారింకను, సుల్తానుగఢమునకు తిరిగిరాలేదు. ఈ లోపుననే దండయాత్రకు వలయు సర్వసన్నాహములను జేసికొని సుల్తానుగఢమును పరిశీలించుటకై శివాజీ స్వయముగ బయలుదేరెను. సుల్తాను పురమునకు చుట్టుప్రక్కల నున్న గ్రామములన్నిటిని తమ వైపున కాకర్షించు భారము సూర్యాజీ కప్పగింపబడెను. సూర్యాజీ తన పనియందు నిమగ్నుడై విధివిరామము లేక గ్రామీణులందరను మహమ్మదీయప్రభుత్వమునకు విముఖుల నొనరించుచుండెను. సూర్యాజీ తన ప్రచారమున కిలేదారు పైకి సుల్తాను పక్షమున నటించి నట్లున్నను, కార్యాచరణమును మమ్ములనే సమర్థించునని చెప్పుటకుగూడ వెనుదీయలేదు. గ్రామీణులందరును స్వరాజ్యస్థాపన కువ్విళ్ళూరుచుండిరి.

ఇటు శివాజీ తన యనుచరులవద్ద కేతెంచి తాను సంఘటితపరచిన నాలుగువందలమంది మావలీ యువకులను రప్పించి యాంజనేయాలయమున తాము సంగ్రహించిన యాయుధముల వారికి బంచియిచ్చి వారిని రెండు భాగములుగ విభజించి యొక భాగమునకు తానాజీని మఱియొక భాగమునకు నానాజీని నాయకులుగ నియమించెను. సుల్తానుగఢముపై దండయాత్ర కొక శుభముహూర్తమును నిశ్చయించి యా దినమునకు నాలుగుదినములు ముందుగనే నానాజీ, తానాజీలు తమ యనుచరులతోగూడ సుల్తానుగఢ ప్రాంతము

నకు జేరి రహస్యముగ దాగియుండవలెనని యాజ్ఞాపించెను. శివాజీ యాజ్ఞ ప్రకారము తానాజీ నానాజీలు తమ యనుచరులకు వలయు సలహాల నొసంగి నలుగురైదుగురు చొప్పున వారిని పంపివేసిరి.



# ౧౭

సుల్తానువద్ద సెలవు గైకొని అప్పాసాహెబు సుల్తానుగఢ మేతెంచెను. చిరకాలమునకు తమ కిలేదారును చూడగలిగిన ప్రజల యానందము వర్ణనాతీతము. మఱల తాము కిలేదారు పరిపాలనయందు సుఖముగ నుండవచ్చునని వారు భావించిరి. కిలేదారు మఱల పరిపాలనమంతయు సువ్యవస్థిత మొనర్చి జాగరూకుడై యుండెను.

అటు సయ్యదుల్లాకు హామీదా సుల్లానుగఢ మేగెనను వార్త తెలియుటతో నాత డెట్లైన సుల్తానుగఢ మేగి యామెను గొనిరావలెనని యెంచెను. కాని తనకోరికను కార్యరూపమున ప్రవర్తింపజేయుటకు ముందు రణదుల్లాను బీజపురమునుండి సుదూరప్రాంతమున కెచటికైనను పంపివేయుట యుత్తమమని యాలోచించి కర్ణాట ప్రాంతముననున్న యొక సుబేదారు వద్ద నుండి "యీ ప్రాంతమున నల్లరు లెక్కువగనున్నవనియు

వాటి నణచుటకై సమర్థుడైన సర్దారు నొకనిని తగిన సైన్య మిచ్చి పంపవలెన”నియు సుల్తానునకు వ్రాయించెను. ఆయుత్త రము సుల్తానునకు చేరిన తరువాత సయ్యదుల్లా స్వయముగ నేగి కర్ణాట ప్రాంతమందలి యుచ్ఛృంఖల పరిస్థితులను మఱింత వర్ణించి వాటిని స్వాధీనమునకు గొనివచ్చుటకు రణ దుల్లాయే తగినవాడని సూచించెను. అందులకు సుల్తాను సంతోషించి రణదుల్లాను పిలిపించి కర్ణాట ప్రాంతమున కేగి విప్లవకారుల నణచి రావలసినదిగ కోరెను. ప్రశాంతముగ నున్న కర్ణాట ప్రాంతమున నిట్టి విప్లవమెట్లు బయలుదేరెనో రణదుల్లాకు తోచలేదు. ఇదియంతయు సయ్యదుల్లా కుట్రయై యుండవచ్చునని యాతడూహించెను. అందుచే నాతడు సుల్తా నుతో ప్రస్తుతము కర్ణాట ప్రాంతమున నిట్టి యల్లరు లేవియు లేవనియు నేనచట కేగుటనవసరమనియు చెప్పెను. కాని సుల్తాను సుబేదారు వద్దనుండి వచ్చిన యుత్తరమును చూపు టతో రణదుల్లా మారు మాటాడలేకపోయెను.

రణదుల్లా కర్ణాట ప్రాంతమున కేగుటకు సమ్మతించి యింటికి వచ్చెను. ఎందులకైనను మంచిదని యాతడు తన విశ్వాస పాత్రులైన యేబదిమంది సైనికులను పిలచి “మీరు వెంటనే సుల్తానుగఢ మేగి యచట నా సోదరియగు హమీదా దాను రక్షించుచుండుడు. ఆమె కెట్టి విపత్తును రానీయ కూడదు. ఈ యుత్తరమును గొనిపోయి కిలేదారున కిండు. అచట మీకన్ని విధముల సౌకర్యములును చేకూరగలవు.”

అని చెప్పి వారిని పంపివేసి మరునాఁడుదయమే తాను ప్రయాణమయ్యెను.

తన పన్నాగము కొంతవరకు సఫలమైనందులకు సయ్యదుల్లా కమితానందము కలిగెను. బీజపురమునుండి రణదుల్లా వెడలిపోయిన మరునాఁడే సయ్యదుల్లా తన సైనికుల కొందరిని వెంటబెట్టుకొని సుల్తానుగఢము చేరెను. సయ్యదుల్లా సుల్తానుగఢమున కేతెంచుట యెవ్వరికిని యిష్టములేదు. కిలేదారుకూడ మొదట సయ్యదుల్లాను దుర్గముపైకి రానీయకుండుటకై యోచించెను. కాని యా నీచుడు బీజపురమేఁగి మఱల సుల్తానుతో నేమేమి చెప్పునోయని వెఱచి మిన్నకుండెను.

సయ్యదుల్లా సుల్తానుగఢమునకు వచ్చిన వెంటనే దుర్గపాలనాధికారమంతయు హస్తగత మొనరించుకొనెను. వెనుకటి కాపలావారలనందరను తొలగించితనకిష్టులైనవారలను నియమించెను. ఇదియంతయు కిలేదారున కసహ్యముగ నుండెను. కాని పాపమతడేమియు చేయజాలని పరిస్థితియందుండెను. సయ్యదుల్లాయంతటితో నాగక కిలేదారును పిలపించి రణదుల్లా సైనికులనిచటినుండి పంపివేయుడని చెప్పెను. అందులకు కిలేదారు "వారిని నేను పిలిపింపలేదు. తన సోదరి రక్షణార్థమై రణదుల్లా వారిని పంపినాడు. వారిని పంపివేయు నధికారము నాకులేదు." అని తప్పించుకొనెను. రణదుల్లా యా సైనికులను బిలచివారిచటనుండుటయనవసరము. బీజపురము తిరిగిపొండు.' అనెను. కాని వారాతని మాటలు వినలేదు. అయినను

సయ్యదుల్లా నిరాశజెందలేదు. వీరిని మోసగించియైనను హావిశా దాను గొనిపోవచ్చునని యాతని విశ్వాసము.

చీకటి పడెను. సయ్యదుల్లా తన భావికర్తవ్యము నాలోచింప మొదలిడెను. అతడొక బురుజుపైజేరి పడకకుర్చీ యందు పరుండి హుక్కా పీల్చుచుండెను. తన యాలోచన కంతరాయము కలుగకుండుటకై సేవకులందఱను దూరముగ బంపివేసెను. అతడట్లు సుమారుగ పది నిముషముల కాల మాలోచనయందు నిమగ్నుడై యుండెను. ఇంతలో నతని కెవరో వచ్చుచున్న యలికిడియయ్యెను. వెనుదిరిగి చూచి నంతనే దయ్యమువలె నొక నల్లనివ్యక్తి కాన్పించెను. ఆవ్యక్తి చేతియందొక ఖడ్గముండెను. వానింజూచినంతనే సయ్యదుల్లా ప్రాణము లెగిరిపోయెను. తన సేవకులను పిలచుటకు నోటి వెంట మాటకూడ రాలేదు. ఆ వ్యక్తి సయ్యదుల్లాను సమీపించి "దుర్మార్గుడా! ఇక రెండు దినములే గడువున్నది. ఈ రెండు దినములలో నీ పనులు పూర్తిచేసుకొనుము." అని చెప్పి మరల అదృశ్యుడయ్యెను. అతడు వెడలిపోయిన తరువాత చాలసేపటికిగాని సయ్యదుల్లాకు మాటరాలేదు. ఆరాత్రి యంతయు సయ్యదుల్లాను పీడకలలతోనే వెడలిపోయినది.

మఱునాడుదయమే యాతడు ఇక నాలసించిన లాభము లేదని త్వరలో తన పనులను నిర్వర్తించుకొన ప్రయత్నించు చుండెను. సయ్యదుల్లావద్దనుండి బయలుదేరి యా నల్లని యువకుడు క్రింద నందిగ్రామమున శివాజీ బసచేసి యుండిన స్త్రీల యింటికేతెంచెను. అతడు వచ్చునప్పటికి శివాజీ రాము

నితో నేదియో మాట్లాడుచుండెను. అతడు శివాజీని చూచి "అయ్యా! మీతో రెండు విషయములు మాట్లాడవలెను. దయ యుంచి నాతో గూడ రండు." అని ప్రార్థించెను. శివాజీకితడెవడో అర్థంకాలేదు. అయినను మారుమాటాడక నతనివెంట బయలు దేరెను. ఇరువురును గ్రామము వెలుపలనున్న దేవాలయములోని కేగిరి. అచటికేగిన తర్వాత నా నల్లనియువకుడు శివాజీతో— "అయ్యా! మీరు నన్నెరుగరు, కాని మిమ్ము నేనెరుంగుదును. మీ రొనర్చుచున్న ప్రయత్నములు సైతం నాకు తెలియును. మీరు తలపెట్టిన పనియందు కృతకృత్యులగుటకు నేనొక యుపా యము చెప్పెదను. మీ కిష్టమైనచో నా విధముగ చేయుడు. సయ్యదుల్లా రణదుల్లా సోదరియగు హమీదాను బలాత్కా రముగ గొనిపోవుటకై ప్రయత్నించుచున్నాడు. అతడు రణదుల్లా పంపిన సైనికులకు త్రాగినంత మద్యము పోయించి వారలను చైతన్యహీనుల నొనర్చి యీ రాత్రికే యామెను గొనిపోవలెనని సంకల్పించుచున్నాడు. అందులకై ప్రతి పహారావద్దను తన సైనికులనే నియమించెను. అంతియగాక నూర్గురు సైనికులను కోటక్రింద దాచియుంచి సరియైన తరుణ మునకు పైకెక్కి వచ్చున ట్లేర్పాటు చేసినాడు. మీరు సుల్తానుగఢమును సులభముగ హస్తగత మొనరించుకొన దలచినచో నే జెప్పినట్లు చేయుడు. నేటి రాత్రి పండ్రెండు గంటలకు సయ్యదుల్లా యాజ్ఞప్రకారము క్రిందనుండి యతని సైనికులు కోటపైకి బయలుదేరుదురు. వారిని త్రోవలో నడ్డ గించి వారికి బదులుగ మీ సైన్యమును పైకి పంపవలెను.

అదే సమయమున సయ్యాదుల్లా హమీదాను బంధించుటకై బయలుదేరును. మీరు మాత్రము మీ సైన్యమందలి యొక భాగముతో క్రిందనున్న సయ్యాదుల్లా సైనికుల నాపి, మరి యొక భాగముతో పైకేగి దుర్గమును స్వాధీన పరచుకొనుడు. చాల దినముల క్రితమే నేను సయ్యాదుల్లాను వధింతునని ప్రతిజ్ఞ చేసి యుంటిని. కావున హమీదాను రక్షించి, సయ్యాదుల్లాను సంహరించు భారము నాపై వదలుడు. ఇంతకంటె దుర్గమును జయించుటకు వేరు సులభోపాయము లేదు." అని సయ్యాదుల్లా తన సైనికులకు చెప్పిన సాంకేతిక శబ్దములను గూడ చెప్పి యాతడచటనుండి వెడలిపోయెను.

శివాజీ కిదియంతయు నాశ్చర్యముగ నుండెను. ఆ నల్లని యువకుడెవడో శివాజీకి తెలియదు. అతడు చెప్పినట్లొనర్చుటయా? మానుటయా? యని యాతడాలోచింపసాగెను. కొంతసేపటి కాతని యంతరాత్మ యా నల్లని యువకుడు చెప్పినట్లు చేయుమని ప్రబోధించెను. అంత శివాజీ సూర్యాజీని పిలిపించి యతనితో— "నీవు నీ యనుచరులను వెంటగొని రాత్రి పండ్రెండు గంటలకు కొండకు దక్షిణపుదిక్కున దాగి యున్న సయ్యాదుల్లా సైనికుల విషయము కనిపెట్టుచు వారు కొండపైకి బయలుదేరి నంతనే వారి నడ్డగించమని చెప్పి పంపి వేసెను. పిమ్మట తనవద్దనున్న సైన్యమునకు రాత్రి పండ్రెండు గంటలకు సింహద్వారముగుండ కోటపై కెక్కుటకు సిద్ధముగ నుండుడని' యాజ్ఞాపించెను.

తరువాత కొంతసేపటికి నానాజీని పిలచి—"నానాజీ! నేడు సుల్తానుగఢముపై దండయాత్ర జరుగును. నీవు ముందుగ నీతండ్రివద్దకేగి మహమ్మదీయుల యత్యాచారములను, సయ్యదుల్లా పాపకృత్యములను సవిస్తరముగ నెఱింగించి దుర్గమందలి వెనుకటి యుద్యోగులను మనపక్షమునకు త్రిప్పుటకై ప్రయత్నించుము. వారు సయ్యదుల్లా యెడల నసంతుష్టులై యుండుటచే మన కార్యము జయప్రదముగ నెరవేరును. నీవు దుర్గముపై కేగునపుడు ద్వారపాలకులు నిన్నడ్డగింతురు. వారికి సయ్యదుల్లా చెప్పిన యీ సాంకేతిక శబ్దములను వినిపింవు మ౫ని నానాజీకి రహస్యముగ కొన్ని శబ్దములు చెప్పి బంపెను. నానాజీని పంపిన పిమ్మట శివాజీ దండయాత్రకు వలయు సన్నాహముల నతిజాగరూకుడై చేయుచుండెను.

సరిగ రాత్రి పండ్రెండు గంటలకు దుర్గముపై నొక పెద్ద కోలాహలము బయలుదేరెను. నానాజీ దుర్గమున ప్రవేశించి తన తండ్రియొద్ద కేగెనని సయ్యదుల్లాకు తెలియవచ్చెను. అంత నతడు కాపలావారిని తిట్టుచు నానాజీని వెదకుటకై బయలుదేరెను. త్రోవలో నాతనికి వెనుకటి నల్లని యువకుడు మరల ప్రత్యక్షమై ఒక్క తన్నుతో సయ్యదుల్లాను క్రింద పడవైచెను. ఆ యువకుని చూచినంతనే సయ్యదుల్లా ప్రాణము లెగిరిపోయెను. క్రిందనుండి యా యువకునివైపు దీనముగ చూచుచు "యాఖుదా! చంపుచున్నాడు." అని కేకవేసెను. అతని కేకవిని అతనికి సాయమొనర్చుటకై వచ్చువారెవ్వరును

లేరు. కారణమేమన నదేసమయమున క్రిందనుండి యనేక మంది సైనికులు 'హరహర మహాదేవ' యనుచు పైకి వచ్చు చుండిరి. మొదట సైనికుల కోలాహలము విని సయ్యదుల్లా తన కుసాయ మొనర్చుటకై తన సైనికు లేతెంచుచున్నారని భ్రమించెను. కాని "హరహర మహాదేవ" యను శబ్దము వినుటతో నాతని యాశ నిరాశయై భయ మధికమయ్యెను. అతడు లేచి గబగబ పరుగెత్తి కిలేదారుని శరణుజొచ్చెను.

అతడు కిలేదారుగొద్ద కేగునప్పటికి అప్పాసాహెబు తన కుమారినిపై మండిపడుచుండెను. ఇంతలో నా సైనికులు అప్పాసాహెబు గుమ్మమువద్ద కేతెంచి 'సయ్యదుల్లాను మా కొప్పగింపుడు. లేనిచో యుద్ధము తప్పదు.' అని హెచ్చరించిరి. వృద్ధుడైనను కిలేదారు పౌరుషము చావలేదు. శరణాగత రక్షణ మహారాష్ట్రుల పరమ ధర్మముగాన సయ్యదుల్లా నొప్పగించుట కంగీకరించలేదు. అంతియగాక సయ్యదుల్లా నొప్పగించుట యనిన సుల్తాను యెడల ద్రోహ మొనర్చుటయే. స్వామి ద్రోహమనునది కిలేదారునకు స్వప్నమందైనను గిట్టదు. అందుచే నాతడు యుద్ధమునకే సిద్ధపడెను.

## ౧౮

కిలేదారు యుద్ధమునకు సిద్ధపడెను. తాను జయింతు నను విశ్వాస మాతనికి లేదు. కారణ మేమన పరిస్థితులు వెనుకటివలె లేవు. తాను రెండునెలలనుండియు బీజపురమున నుండెను. ఇచటి పరిస్థితులతో సంబంధమే తెగిపోయెను. వచ్చినప్పటినుండియు సయ్యదుల్లా ప్రభుత్వమే సాగుచుండెను. అదియునుగాక, తలవనితలంపుగా తటస్థించిన దీ యుద్ధము. అయినను కిలేదా రధైర్యపడక తన శరణుజొచ్చిన సయ్యదుల్లాను వెంటనే క్రిందనున్న యాతని యనుచరులవద్దకు బంపు నేర్పా టొనరించి యుద్ధమునకు దిగెను.

అతనికి మిగిలిన శత్రువులపైకంటె తన కుమారుడైన నానాజీపై కోప మధికముగ నుండెను. అతడు శత్రువులలో జేరుటవలననే వారి కింతటి ధైర్యము వచ్చినది. లేనిచో నప్పాసాహెబు నెదిరించుట కెవరికి సాహసము కలదు ? నిజముగ యుద్ధక్షేత్రమున నానాజీయే యెదురై యుండినచో నప్పాసాహె

బాతనిని తన కరవాలమునకు బలి యొనర్చెడివాడే. కిలేదారు యుద్ధ మొనర్చుచున్నను అతని దృష్టి కుమారునే వెదకు చుండెను. కాని యాతనికి నానాజీ యెచటను కాన్పింపలేదు.

నానాజీ యుద్ధ క్షేత్రమున తండ్రిని జూచినంతనే యాతని ధైర్యము చెదరిపోయెను. తండ్రి కెదురుగ నిలువబడి యుద్ధముచేయుట కాతని యంతరాత్మ యంగీకరించలేదు. అందుచే నాతడు దూరముగ తొలగి యుద్ధ పర్యవసానమునకై నిరీక్షించుచుండెను. ఇంతలో నెవడో వెనుకనుండి నానాజీని కత్తితో పొడిచెను. నానాజీ యా దెబ్బతో నేలవ్రాలెను. నానాజీని పొడిచిన వ్యక్తి నానాజీ రొమ్ముపై గూర్చుండి— "దుర్మార్గుడా! నన్ను మఱచితి ననుకొంటివా? నీ భార్యను రణదుల్లా కొప్పగించి నా ప్రియురాలైన ఫాతిమా నపహరింపదలచితివా? నన్ను బంధించితిమని సంతసించితిరి గాబోలు! సూర్యాజీ సైనికులు వెడలిపోయినంతనే మిగిలిన వారి కండ్లలో దుమ్ముచల్లి నిన్ను యమసదనమునకు పంపుటకై వచ్చితిని. ఇదిగో చివఱిదెబ్బ' యని కత్తినెత్తి పొడవ బోవునంతలో నెవరో వెనుకనుండి యహమ్మదును నఱికిరి. నానాజీ మాత్రము అహమ్మదు కొట్టిన దెబ్బకే మూర్ఛ బోయెను.

అహమ్మదును వధించిన యువకుడు అహమ్మదు శవమును దూరముగ లాగి, నానాజీకుపచారము చేయ మొదలిడెను. ఇంతలో నిరువురు స్త్రీలు తమలో తామేదియో మాట్లాడుకొనుచు వచ్చుచుండిరి. శివాజీ వారలంగాంచి —

"మీరీ దుర్గమునకు పరిచితులవలె నున్నారు. ఇచట నొక వ్యక్తి గాయపడియున్నాడు. ఇతనిని జూచుచుండుడు. నేనేగి సైనికులను గొనివచ్చి యీతనిని భవనములోనికి గొంపోదును.' అని నానాజీని వారి కొప్పగించి తాను వెడలిపోయెను.

ఆ యిరువురు స్త్రీలును మొదట యీ క్షతగాత్రు డెవడో యనుకొనిరి. కాని దగ్గరకు వచ్చి చూచినంతనే అందొ కతె - పద్మాబాయి - కెవ్వున కేకవేసి యేడ్వసాగెను. ప్రక్క నున్న దాసి యామె నోదార్చుచుండెను. ఇంతలో శివాజీ నలుగురు శిష్యులను గొనివచ్చెను. వారి వెనుకనే మరి యిరు వురు యువతులేతెంచిరి. ఆయువతు లెవరో పాఠకులూహించియే యుందురు. వారు మఱెవ్వరునుకారు-హమీదా, ఫాతిమా లే.!

వారందరును గలసి నానాజీ కుపచార మొనర్చుచుండ గనే యొక సైనికుడు వచ్చి శివాజీతో—"అయ్యా! దుర్గము స్వాధీనమైనది. కిలేదారును బంధించితిమి. ఇకముందేమి చేయ వలెనో శలవిండు." అనెను.

ఈ వార్త విని శివాజీ పరమానందభరితుడై యా సైనికునితో—"సరే! కిలేదారుని మాత్రము సగౌరవముగ నొకచో నుంచుడు. నేను వచ్చుచున్నాను. నీవు పొమ్ము.' అని పంపివేసి నానాజీ యుపచారమునకు వలయు యేర్పాట్లు గావించి తాను వెడలిపోయెను.

శివాజీ వెడలిపోయిన కొంతసేపటికి నానాజీకి తెలివి వచ్చి కనులువిప్పి చూచెను. కనులు విప్పి చూచుటతోడనే యాతనికి హమీదా కనబడెను. హమీదాను చూచి నానాజీ

చిరునవ్వు నవ్వెను. ఆ చిరునవ్వు చూచినప్పుడు హామీదాకు కలిగిన యానందమునకు మేఱలేదు. ఆమె తపస్సు ఫలించి నట్లుండెను. వెంటనే యాతడు ప్రక్కను చూచెను. అచట పద్మాబాయి తన దాసితోగూడ ఖిన్నవదనయై కూర్చుండెను. ఆమెను చూచినంతనే నానాజీ స్మితరేఖ యసహ్యసూచక మైన యేవగింపులోనికి మాఱెను. తన భర్త తన సాన్నిధ్య మునుగూడ నసహ్యించుకొనుచున్నాడని పాపమా సాధ్వి యంతరాత్మ పరితపించెను. ఇక నామె యచటనుండి దాసిని వెంటగొని బయట కేగెను. తరువాత కొంతసేపటికి హామీదా కూడ తన భవనమున కేగెను.

పద్మాబాయి వెంటనున్న దాసి చాల తెలివిగలది. మంచి సమయస్ఫూర్తి, ధైర్యసర్యములు గలవ్యక్తి. ఆమె తన స్వామినికి వాటిల్లిన విపతునకు చాల విచారించి యామెతో—"అమ్మా, నానాజీ యనురాగమును చూఱ గొనుటకును, ఆతని యనుమానము దూర మొనర్చుటకును ఒకటే యుపాయమున్నది. ఇంకెవరు చెప్పినను నానాజీ వినడు. హామీదా చెప్పినచో తప్పక విశ్వసించును. ఆమె రణదుల్లా సోదరియగుటయే దానికి కారణము. అంతియగాక చిన్నతనమునుండియు నానాజీకి హామీదా మాటపై నభిమానము మెండు. ఇప్పుడు మనము హామీదాను ప్రార్థించుట దక్క వేఱొక యుపాయము లేదు" అనెను.

ఇది యభిమానమునకు, గర్వమునకు దగిన సమయము కాదు. అందుచే పాపము పద్మాబాయి చేయునదిలేక దాసి

వెంటగొని హమీదావద్దకేగి తన స్థితిని విన్నవించుకొని యెట్లై నను నానాజీ యనుమానమును పోగొట్టుమని ప్రాధేయపడెను. పాపము హమీదా స్థితి విచిత్రముగ నుండెను. తాను కోరిన దేమి ? సరిగ తన కోరిక ఫలోన్ముఖమునకు వచ్చినప్పుడు సంభవించిన యీ ప్రసంగమేమి ? తన ప్రేమను బలిదాన మొనర్చి దంపతులను సుఖపెట్టుటయా ? లేక దంపతులకున్న మనోమాలిన్యముల బెంచి స్వకార్యమును సాధించుకొనుటయా? ఆమె హృదయమున సంఘర్షణ బయలుదేరెను. ఆ దేవదానవ యుద్ధమున దేవతలకే జయము లభించెను.

సద్భావము కలిగినప్పుడు దాని నాచరణయందుంచుట కాలసింపరాదు. అందుచే నామె వెంటనే నానాజీ వద్దకేగి— "నానాజీ! కొఱమాలిన శంకలకు లోనై నీ రోగమును వృద్ధి జేసుకొనుచుంటివి. నీ వింతటి హృదయ దౌర్బల్యముగలవాడ వని నే నెన్నడును తలచలేదు. ఆ మహాసాధ్వినే నీ వనుమా నించినచో ప్రపంచమున నీవు విశ్వసించదగినవారెవరు ? నేను నిత్యము నామెను జాగరూకతతో పరీక్షించుచునే యుంటిని. ఇంక నీ వా యనుమానమును వదలుము." అనెను. హమీదా మాటలు వ్యర్థముకాలేదు. నానాజీ యనుమానము కొంత సడలేను. కాని భార్యపై వెనుకటి యనురాగము జనించుటకు మరికొంత సమయము పట్టవచ్చునుగాక ! మనసు సరియైన మార్గమునకు వచ్చినది. నాలుగైదు దినములొక లెక్కకాదు.

ఆ మరుదినమే ఫాతిమా బీజపురమునకు పయన మయ్యెను.

## ౧౮

సయ్యదుల్లాను కోట వెనుకభాగమునుండి యాతని సైనికులవద్దకు బంపి కిలేదారు యుద్ధమునకు దిగెనని మనమిదివరలో చదివియుంటిమి. అతడు తన సైనికులకొరకై చాల సేపు వెదకెను. కాని యాతనికి తన సైనికులజాడ కానరాలేదు. ఎట్లయినను ప్రాణముల దక్కించుకొని బీజపురమేగుట కాతని మనసు తొందరపడుచుండెను. తాను సైనికులకొరకై వెదకుచున్నచో నెవరైన తనను చూతురేమోయని యాతడొంటరిగనే యరణ్య మార్గమున బయలు దేరెను. అతడు కొంతదూర మేగునప్పటికి యెవ్వరో తన కెదురుగ వచ్చుచున్నట్లు తోచెను. సయ్యదుల్లా ధైర్యము తెచ్చుకొని యట్లే మఱికొంతదూరమేగెను. ఇప్పుడాతనికి తన కెదురుగ వచ్చుచున్న వ్యక్తి స్పష్టముగ కన్పించెను. అతనిని జూచినంతనే సయ్యదుల్లా నిలువెల్ల కంపించిపోయెను. అతడు భయపడుచున్నట్లే మఱల నా నల్లని వ్యక్తి ప్రత్యక్షమై—

"సయ్యాదుల్లా! నేడు చివరిదినము. తెల్లవారులోపల నిన్ను వధింతునని ప్రతిజ్ఞ యొనర్చి యుంటిని. దొంగచాటుగ నిన్ను చంపుట నా కిష్టములేదు. నీవు నా భార్యను గొంపోయి సుల్తానున కొప్పగించి నా సర్వస్వమును నాశనమొనర్చితివి. నీవు వీరుడవగుట వలననే నాతోడి వైరమునకు పూనుకొంటివని యెంచితిని. ఇదిగో కత్తిని గొనుము. ద్వంద యుద్ధమునకు సిద్ధపడుము"ని హెచ్చరించెను.

సయ్యాదుల్లా నిలువెల్ల వణకిపోవుచు "నన్ను కరుణింపుము. నే యుద్ధమొనర్ప జాలను." అని దీనముగ ప్రార్థించెను. అందులకానల్లని వ్యక్తి "దుర్మార్గుడా! నీవొక పురుషుడవని యెంచి కఠినమైన ప్రతినబూనితిని. నిన్ను చంపకుండ విడువను. నిశ్శస్త్రుడవైన నిన్ను జంపుటయు హిందూ ధర్మమునకు వ్యతిరేకముగావున పౌరుషముతో యొద్ధమొనర్పుము. లేదా యీ చెట్టున కురిపోసుకొని ప్రాణములు వీడుము." అనెను. సయ్యాదుల్లా యెట్లయిననూ ప్రాణములు పోవుట తప్పదని నిశ్చయించుకొని కత్తి దెబ్బలు తిని చచ్చుటకంటె నురిపోసుకొనుటయే యుత్తమమని యెంచి యట్లొనర్చెను.

సయ్యాదుల్లా మరణించెనేగాని రాణోజీ ప్రతిహింసాభావము మారలేదు. అతడచటనుండి యుద్రేకముతో బీజపురమునకు బయలుదేరెను. బీజపురమునకు చేరి యాతడు బైరాగి వేషము దాల్చి మెల్లగ రంభావతియున్న మందిరమునకేగెను. రంభావతి సన్యాసివేషమందున్న భర్తను గుర్తించి పాదములపై వ్రాలెను. అంత నాతడామెతో "నీతోకొన్ని

విషయములు మాట్లాడ వలసి యున్నది. తోటలోనికి రమ్మ"ని పిలచెను. ఆమె భర్త యానతి శిరసావహించి తోటలోని కేగెను. రాణోజీ యామెతో—"నేనెందులకు పిలచితినో గ్రహించియే యుందువు. నీవీ రూపమున జీవించియుండుట నేను చూడజాలను. నీ జీవితము మహారాష్ట్ర జాతికొక కళంకము. నిన్నంత మందించుటకే యిటకే తెంచితి" ననెను. ఇదివిని యామె "ప్రభూ ! ఇంతకంటె నాకుకావలసినదేమున్నది. నేను చనిపోవుటకు ముందు పాపిష్ఠియైన సయ్యాదుల్లా మరణవార్తను వినవలెనని యున్నది. మీరావార్త నెఱింగించినచో నిదిగో దీనిని మ్రింగి యిప్పుడే ప్రాణములు వీడెద"నని యాతని చరణములపై వ్రాలెను. రాణోజీ సయ్యాదుల్లా మరణవార్త నెఱింగించిన తోడనే యామె తనవద్ద నుంచుకొనిన కాలకూటమును త్రాగివైచెను.

మఱునాడుదయమున చూచినంతనే రంభావతియు రాణోజీయును తోటలో మరణించియుండిరి. రాణోజీయాత్మహత్య యొనరించుకొనెనో లేక నెవరైన చంపిరో తెలియదు.



## ౨౦

సుల్తానుగఢము వశమై రెండుదినములు గడచిపోయినవి. ఇంతవరకు శ్రీధరస్వామి జాడ తెలియలేదు. అతడు రామదాసస్వామిని వెంటనిడుకొని వచ్చునని శివాజీ ప్రతీక్షించుచుండెను. వారింకనూ రాకపోవుటచే శివాజీ యుద్విగ్నుడై యుండెను.

ఆ నాటి రాత్రియంతయు శివాజీకి నిదుర పట్టలేదు. రామదాసస్వామి దర్శనమునకై యాతని మనసు త్వరపడుచుండెను. అతడు హృదయమున స్వామిని తలచుకొనుచు నిటునటు పచారులు చేయుచుండెను. పూర్వదిశ యరుణకాంతుల వెదజల్లుచుండెను. పుణ్యకాంతలు గృహకృత్యముల దీర్చుకొనుటకై లేచుచుండిరి. ప్రక్కలనున్న దేవాలయము నుండి మేలుకొల్పులు వినవచ్చుచుండెను. అట్టి తరుణమున దూరమున నెవరో యిర్వురు వ్యక్తులు వచ్చుచున్నట్లు కన్పించెను. శివాజీ యాశ వల్లవించెను. అతడు రెండడుగులు

ముందునకు వైచి దృష్టిసారించి చూచెను. అతని యానంద మున కంతులేదు. చిరకాలము నుండి చూచుచున్న స్వప్నము నేడు ప్రత్యక్షముగా నుండెను.

ఇంతలో రామదాసస్వామితోకూడ శ్రీధరస్వామి యట కేతెంచెను. రామదాసస్వామిని జూచినంతనే శివాజీ భక్తిభావముప్పొంగి వెల్లువలై పాఱెను. అతను భక్తివినమిత గాత్రుడై స్వామిచరణముల కెఱగెను. రామదాసస్వామి శిష్యుని లేవనెత్తి "వత్సా! నేటికి నా కలలు ఫలించినవి. ఇది నీ ప్రథమ విజయము. నీ వలన గో బ్రాహ్మణ హిందూ ధర్మరక్షణ విధానేరును. ఇకనుండి విజయపరంపరలను గైకొనగలవు. సుల్తానుగఢ విజయము నీ ప్రారంభిక ప్రయత్నము. నీ భావి విజయములకు నాంది. హిందూధర్మ పునరుద్ధరణకు శుభచిహ్నము. స్వతంత్ర మహారాష్ట్రజాతికిది శుభోదయము."

స మా ప ము.